జనవంశమ్

ప్రథమ ముద్రణ 1994



వెల. రూ 60

ఈ పుస్తకం దొరికే చోటు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-4--435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 1 మరియు
వారి బ్రాంచీలు
(1) విశాలాంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్
(2) హనుమకొండ (3) విజయవాడ (4) కాకినాడ(5) విశాఖ పట్నం (6) గుంటూరు (7) తిరుపతి (8) అనంతపురం

ముఖచిత్రం
PAUL KOUYIOUMTZIS
ప్రఖ్యాత గ్రీకు చిత్రకారుడు,
ఎథెన్స్ (Greece)

ముద్రణ
భరద్వాజ్ ప్రింటర్స్
రామ్‌కోఠి, హైదరాబాద్

# విషయ సూచిక

మానవ సమాజంలో యుగయుగాన దీర్ఘకాలానంతరం ఐతిహాసిక కావ్యాలు ఉత్పన్నమవుతూ వచ్చాయి. అవి తత్తద్యుగీన తత్త్వాన్ని ప్రదర్శించేవి. ఇతిహాసం యుగీనవాణి, పూర్వకాలంలో వచ్చిన ప్రతిఇతిహాసానికి ఒక అనుబంధ కావ్యం ఉండేది - ప్రాచ్య దేశాల్లో గానీ పాశ్చాత్యదేశాల్లో గానీ. వాల్మీకి రచిత రామాయణానికి ఉత్తరకాండ అనుబంధ కావ్యము. అట్లాగే వ్యాస మహాభారతానికి అనుబంధకావ్యం హరివంశము. ఇదేవిధంగా ప్రాచినకాలంలో గ్రీసులో వచ్చిన జగద్విదితమైన హోమర్ విరచిత ఇలియడ్ అనే ఇతిహాసానికి అడిస్సీ అనుబంధ కావ్యం. ఇతిహాస కావ్యరచనా ప్రక్రియానుసారంగా ఆధునిక మహాభారతానికి అనుబంధకావ్యంగా ఈ జనవంశమ్ వచ్చింది. ఇత్యలం

ప్రకాశకీయం



"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే "

**( ఇదే భారతీయ సంస్కృతి )**

## ఋతుకాండ

నీవు ఉదయం మొదటిసారి నీ నేత్రద్వయం
తెరచినప్పుడు తమ్ముడూ ! దేన్నీ చూడకు
తెలుసా,సుస్నాతం చేశావు నీ దేహాన్ని
శుభ్రంగా కడిగావు నీ ఇంద్రియాల్ని
నిశాతటద్వయం మధ్య ప్రవహించే నిద్రాముగ్ధ
జలాల్లో -

అప్పుడు నీ కళ్లు చీకటి కెరటాల్లో ఈదుతున్న
నక్షత్రాల్లా మెరుస్తుంటాయి
నీలిమఖ్మల్ సేవ అనుభవించిన రత్నాల్లా
కోమల కాంతులు కురుస్తుంటాయి.

ప్రభాతం అనగానే ఓం ప్రథమంగా
ఆకాశం పూచిన పువ్వు సూర్యుడు ఒకటి
ప్రవహించే ప్రకాశమయ నీలోదకాల్లాంటి
ఆకాశం రెండు
అప్పుడు సృష్టిలో ఈ రెండే నీ రెండు కళ్లూ
చూడదగిన వస్తువులు !

ఒకప్పుడు నేను చూశాను నిర్మల వ్యోమనీలిమ
లోతుల్లో
మనిషి దృక్కులు ఎగరలేని ఎత్తుల్లో ఒకశ్వేతపక్షి
యుగళాన్ని !
పావన ఏకాంతంలో పరస్పరం క్రీడిస్తూ
పూరేకుల్లాంటి పక్షాల్ని ఆడిస్తూ - ఉన్న యుగళాన్ని
నిమేషమాత్రమే క్రీడిస్తాయి ఆ మిథునం
నిమేషానంతరం విలీనమవుతాయి నీలిమలో
ఇక కనిపించవనుకున్నప్పుడు
కళ్లు పరితపిస్తున్నప్పుడు
నీలకేళీ నిమగ్న భంగిమలో కళ్లని
ప్రభాత పుష్పాలుగా మారుస్తాయి !

ఓహో ఆ మిథునం క్రీడిస్తున్నాయో లేక
నన్నాడిస్తున్నాయో ?
నాలో ఏదో పలికినట్లయింది
ఆ రెండు పక్షులూ ఆకాశభాష ...
సృష్టి మాతాపితలనిపించే ఆ మిథునం నుంచి నా
నేత్రాల్ని తిప్పుకోలేకపోతున్నాను
నాకు తెలీకుండానే నాలోకి ప్రవహించిపోతున్నాను
నేను ఆకాశభాషా డోలికలో శిశువునై ఊగుతున్నాను
చూశావా తమ్ముడూ, తొలి ఉదయకిరణం

లోకాన్ని ముట్టుకున్నప్పుడు కళ్లు తెరవడం
ఎంత రోమాంచక సంఘటనో ఎంత మహాత్వపూర్ణ
సాహసయాత్రో!
తమ్ముడా! ఇవిగో నీ నేత్రాలు.

●

ఎక్కడో ఒక మామిడి తోపు
మేను విరిచి ఆవులించింది
నాజూకు పరిమళం వ్యాపించి
గాలి మూర్ఛపోయింది
నేను పూల బరువు మొయ్యలేని ఆత్మని
వెయ్యి పాటలుగా మారి తోటల మీద
వాలుతున్న వసంతాన్ని -
ఈ సంవత్సరపు తొలిపువ్వుసాక్షిగా
చెపుతున్నాను.
నేను సుఖదుఃఖాలకు బానిసను
గడ్డం వెనుక కోర్కెలు దాచుకోలేని సన్యాసిని
నేను మనిషిని

●

ఆరే ఈ చైత్ర చ్ఛాయలక్రింద
పువ్వు ఇచ్చేఒక్క గ్లాసెడు
ఆతిథ్యం తాగనీ
ఈ తొలి మానవ రాగరాగిణుల్లో
స్నానం చెయ్యనీ
ఈ పువ్వులన్నీ కోల్పోయాను
నాదుఃఖాల్లో
పాటలన్నీ రాల్చుకున్నాను
నా అశ్రువుల్లో
ఏరుకోనీ కొన్ని పరిమళాల్లయినా
నేనిక్కడ ఒక పుప్పొడి కథనై
ఎగిరి పోనీ
నీ చూపుడు వ్రేలెక్కి
ఒక పువ్వుగా మారిపోనీ.



ఈ నదులు ఈ కొండలు ఈ దేశం ఎవరిది
పనిచేశిన కూలీతో బ్రతుకు తున్న ప్రజలది
ఈ దేశపు వీధుల్లో నడిచే హక్కెవరిది
స్వేదబిందువుల దండలు వేసుకున్న వారిది
రచిత అక్షరంకంటే రాయే అతిశ్రేష్ఠము

నగటు మనిషిగతి చూస్తే ఇదే మనకు స్పష్టము
ఈ రోజున పురాణాలు దేవలోక శిథిలాలు
కవితలు నక్షత్రవీథి నలిగిన పేజీలు
ప్రతి శతాబ్ది ఒక సిద్ధాంతం లేవదీస్తుంది
భూమి మీద దాన్ని రుద్ది పూజచేయమంటుంది
కొండ మీద ఉన్న పాతకోట చూస్తున్నది
గుడ్లులేని కన్నులతో కొత్తమనిషి నడకను
సుఖంవేటలో కళ్ళకు సూక్ష్మంకనిపించదు
బాష్పంజీవన సత్యద్వారంఅనిపించదు
తోటతోటలో సీతాకోకచిలుక ఎగురుతూ
ప్రతి పువ్వును చూపిస్తుందదే టార్చిలైట వుతూ
పువ్వు జీవితం హ్రస్వందినంజీవితం దీర్ఘం
ఎవరు చెప్పగలరు ఏది ఎవ్వరి దౌర్భాగ్యం
చూడు గాలి మబ్బుల్లో చేరిన చిరు చెలమలో
నగ్నంగా నక్షత్రం స్నానం చేస్తున్నది.



కాలం రుతు చిత్రాలు గీయడానికి
నులిచ్చి ఉన్న కాన్వాసే
వృక్షం -
పంచాంగాల్లో ఉండవు రుతులు

జీవితాల్లో ఉంటాయి
అరణ్యాల్లో ఉంటాయి
చెట్టు చెట్టునా ఉంటాయి
ఋతువులు
చెట్ల సుఖదుఃఖాలు.



ఎవడు కాలాన్ని చేయగలడు
ఈ కాలం నన్నెందుకు ఇలా శిథిలం చేస్తుందో
నాకు తెలీదు
రాలి మట్టిలో కలిసిపోయే ఆకుని నేను
హద్దుండాలిబాధకన్నాడా
ఇంతకూ నేను రక్తమాంసాన్ని
రాయిని కాదు
చాలామందికి తెలీదు
కాలం ఎంత శక్తి శాలో
ఎంత అజ్ఞేయ మహిమో !
మానవ జీవితాన్ని
ఏవీ వివరించలేవు
మనిషిగానీ కర్మగానీ
కార్యకారణ సంబంధంగానీ
చివరకు దేవుడు గానీ విధిగానీ -

వసంతం ఒక భయానక భూతం
రెచ్చగొడుతుంది జంతువుల్లాంటి
కోర్కెల్ని మానవమస్తిష్కంలో
అరుస్తుంది జీవన తృష్ణతో
ఒక జల పాతంలా
పరిమళాల తాగుబోతు
ఆ అరణ్యం చైత్రమాసపు
తొలిపూల కిశోరశ్వాసలతో
మత్తెక్కి పిచ్చిదైపోయింది

తాగుబోతు మబ్బులతో
చెలిమి చేశాను. విద్యుల్లతల చేతుల్లో
చిక్కుకున్నాను ఇప్పుడు నక్షత్రాలు
నారక్తనదుల్లో జలక్రీడ లాడుతున్నాయి

తోటలో ఎగిరే ఇంద్రధనుస్సు
ఆసీతాకోకచిలుక
ఒక్కోపుష్పాన్ని చూపిస్తోంది
తన అస్తిత్వపు కాంతితో-
ఈ గాలి కొండల్లో పుట్టిందో లేక
సముద్రాల్లో పుట్టిందో
నాగుండెని గాయపరుస్తోంది
లోయల్ని గొంతెత్తి ఏడ్పేలా

చేస్తోంది
నేను చూడగలను
నీ నేత్రాల రేవుల్లో
నౌకల్లా తేలుతున్నాయి
స్వప్నాలు ...

●

శుక్లపక్షం ఊదిన బడగలా
తేలుతున్నాడు చంద్రుడు
ఆకాశ నీలిమలో ...
చెరువు గట్టు మీద ఆమె నేను కూర్చుని,
ఇవాళ చూడదగినది
లోకంలో ఇదే అని
చూస్తూ చూస్తూ ఉండగానే
ఆ వర్తులాకార వెండి బింబం పశ్చిమానికి
దొర్లి పోయింది
తూర్పుబుగ్గల మీద ఊదారంగు రేఖలు

●

ఇవాళ తెగపొడు తొందేమిటో తోటలో ఆపక్షి
పిచ్చి పట్టిందేమోదానికి
ఆపాదమస్తకమూ పూచిన ఆ శ్వేతపుష్పవృక్షాన్ని
చూచి ...
వసంతరుతు వంటే చెట్టులో నుంచి
విరుచుకు పడ్డ విశ్వరూపం కాబోలు
పశుపక్షివృక్షాదులు వాటి శరీర సంపదను
వీరావేశంతో వెదజల్లుతున్నాయి దశదిశలా
ఈ రుతువులో సింహాసనం మీద ఉన్న రాజు కంటే
కొమ్మమీద కూర్చొని ఉన్న కోకిలే మన ప్రభువు
ఇప్పుడు కోకిల పాడే ప్రతి పాటలో నుంచి
గుంపులు గుంపులుగా దేవతలు దూకుతున్నారు !
కోకిల తోలుకునివచ్చిన మిలియన్ల మిలియన్ల
పూలమందలు
కొమ్మల నిండా విడిసి, చేస్తున్న నృత్యాలు వందలు
వందలు
ఒక్క పువ్వు చాలు ఉన్న స్మృతులన్నీ రద్దు
చెయ్యడానికి
శోకాన్ని మరచి లోకాన్ని మరచి పోవడానికి
తిథీవార నక్షత్రాలు పరివారంగా వస్తున్న
కాలం మనల్ని కరుణించి ఇస్తోంది ఈ
మహాసౌందర్య దర్శనం
కాలం చెట్లలో పూలు పూస్తుంది

శిథిలాల్లో సాలె గూళ్ళు నేస్తుంది
బూజు పట్టిన వస్తువుల్లో చరిత్రనింపుతుంది !
సృష్టిస్తుంది యుగాల్ని నిర్మిస్తుంది సిద్ధాంతాల్ని
నిర్దాక్షిణ్యంగా వాటినే సంహారిస్తుంది
మళ్ళీ జలాల మీద పుష్పమై తేలుతుంది ఏమీ
ఎరగనట్లు
అనంత శూన్యంలో పరుగెత్తుతున్న ఈ మహాకాల
వలయాన్ని
ఏ బాహువు ఆపగలదు ?
రాలే ఆకు భూమిలో లీనమైపోతుంది మళ్ళీ కోకిల
గొంతు
వినగానే కొమ్మలో నుంచి నిద్ర లేస్తుంది - ఆశ్చర్యం
దినం సాయంత్రం మరణించినా మరునాడు పునర్జన్మ
ఎత్తుతుంది

కోడి తెస్తుంది ప్రభాతాన్ని మనకు
కోకిల తెస్తుంది వసంతాన్ని

మహాకాల మహిమల్ని గానం చేసే ఆ
ఖగ మహా ఋషులకు
చేతులెత్తి నమస్కరిద్దాం-



కాలపు బాటలంబడి యొకా
నొక తియ్యటివేళ కోమల
జ్వాలగవచ్చి నా హృదయ
చారుతరాలయ శాతకుంభ శృం
గాలను మేలుకొల్పి నవకాంతులతో
మధుమాస; మాత్మ ప
క్షాలను విప్పిలేచెను వికస్వర
జీవమహోదయమ్ము న్.

నాలోనున్నది మాధవమ్మొకటి అంత
ర్జ్వాతమై జీవన
జ్వాలాకీలకమై మదీయ మధుర స్వప్న
ప్రపంచమ్ములన్
బాలించున్ పరిణామజీవితదశా
వ్యాఖ్యాన సంకేతమై
కాలంబన్నది దుర్విలంఘ్యమని యుద్ఘాటించు
ను చైత్రగతిన్.

ఇది మధుమాసమా! అవుర
యెంతమనోహరమెందుజూచినన్
సదమల కాంతులం గులుకు
జాజులు మల్లెలు తీగసంపెగల్
కొదమగులాబులుం జిగురు

గొమ్మల రెమ్మల శాద్వలమ్ములన్
ముదమున ముంచె నీ సుమ
సముద్రము విశ్వదిశాంతరాళమున్.

ఈ ఆకాశము నీ మహోజలధులు
న్నీ ధారుణీ మండలం
బీ యందాల తరుప్రపంచనిచయం
బీ విశ్వవైశాల్య మెం
తో యంతస్సుషమాసముల్బణముతో
నుయ్యాలలూగించెనా
హో ! యూహావిహాగమ్ము తా నెగిరిపో
నాశించెనుత్కంఠతో.

నీలిజలంబు నీలిధరణీ
వలయంబు వినీలశైలముల్
నీలితరుప్రపంచములు
నీలి యనంతము - యెందు జూచినన్
నీలిమ ; నీలిమాకలిత
నిర్భరకంఠము పిల్చినట్లు నా
నీలిమ దేహాపంజర వి
నిర్గతమై పరుగెత్తె నెంతయున్.

ఏ మాకందతరు ప్రవాళములనో
హేలాగతిం గోకిలా
భామాకంఠము శంఖమై మొరసె,
శుంభత్కీరనారీదళ
శ్యామంబై మెరసె న్నభంబు,
భ్రమరజ్యావల్లి మల్లీసుమ
శ్రీ మీనాంకశరమ్ము లంగురిసె
వాసింపై త్రమాసమ్మునన్.

చిక్కనిచిగురాకుజీబులోపవళించి
యెండువేణువు కంఠమెత్తి పాడె
తలిరాకులూడిచి తపసిగా మసలిన
నగ్నవల్లికయు పర్ణములదాగె
జిలుగు సీతాకోకచిలుక రూపముదాల్చి
కీటకయోగి కంకేళి గవిసె
శిశిర వ్రతాచార జీర్ణమారుతమూర్తి
యలరు గిన్నెల గందమలదుకొనియె
ఇచ్ఛప్రకృతిలోరెక్కవిచ్చెనేమొ
యెడద పురుషనిలో మొగ్గదొడిగెనేమొ
విశ్వమందిర కుడ్యముల్ విరగగొట్టి
మోహకల్లోలవీచికముంచివైచె.

ఎలబ్రాయమ్మున విశ్వమందిరమునన్
హేలాకళామూర్తితో
కొలువై కన్నులపండువైన బురుషున్
గోర్కుల్పిసాళించియై
పులకింపం దిలకింపగా ప్రకృతిసాం
పుల్గుల్కు సింగారియై
యలరుల్ కెంజిగురుల్ ధరించిన వసం
తారంభకాలం బిదే.

ఆ యాకర్షణ మా మహోత్సవము
నా యావేశ మాకాంక్షయున్
ఏయాలింగనకున్ సుధామధురపా
నీయాధరా పేక్షకున్
ఏ యుద్వేలరతిక్రియాకలనకున్
ఏమాత్రముంగాదు తా
నే యంతర్గతసృష్టిసూత్రమహిమా
హేవాకమో చూడగన్

ఆసల్దీరునె దృష్టిచే, మహితగా
ఢాలింగనాయుక్తిచే
నాసంయోగ నిరంతవేదనములే
యద్వైతసంసిద్ధికో
నై సర్గంబగు నేయగాధకుహా

రాంతఃప్రజ్వలానందకీ
లాసంతర్పణకో శరీరమొక కా
రాగారమ్మై తోచగన్.

ఇది వాసంతరసస్రవంతి ; యిది
ధాత్రీజీవకూలంబులన్
గదియంబారెను హోరుమంచు, నళినీ
కాసారతీరంబులన్
బొదలం దోటల బాటలాధరలతో
పోలేని కూలీజనుల్
మదిలోగుందుచు చేలలో దిరిగి రా
మధ్యాహ్న కాలంబుల్.

కొండలకోనలన్ నదుల
కోవల త్రోవల నాట్యమాడుచుం,
బండువు సేయగా కుసుమ
బాలులు, శోకరసాలవాలమై
కొండొక కంఠ మే శిథిల
కుడ్యగుహాంతరితాంధకారమం
దుండియొ నిగ్గమించె విన
వోయి తురంగము నావుమించుకన్

కలికి గులాబిగేలగొని,
కమ్మ్రనితెమ్మ్రెరగుబ్బిమెక్కి, కెంపులదలిరాకుబాకు
నడుముం
గులికింతువుగాని, చూడు, నీ
జిలుగు పసిండిదువ్వలువ
చీరచెరంగు నభాగ్యశోకపంకిలకలనాకళంకములు
గీల్కొనెమేల్కొనవోయిమిత్రమా.

లోకాలోకపరీత భూవలయ
కల్లోలంబులందాటి యే
రాకాకోకిలశోకమో మలయ
నారంభించె వాసంతిక్;
నాకళ్యాణ హృదంతరాళ కల
కంఠస్స్వరఘంటాపథ
వ్యాకీర్ణస్వరమాధురీలహరులై
భాసింప తద్వైఖరుల్.

తిమిరతమాలపల్లవము
తీయన కోకిల యాకులందున్
గుములుచు కూరుచుండి యొక
కోమలగీతిక పాడినంతనే
సమధిక విశ్వశోకమయ
సాహితి పొంపిరివోవ త్రోవలన్
విమలరవంబు మా హృదయ
వేణువులన్ రవళింపనేలనో.

తోరపు పంటచేలు పువు
దోటలు బాటలు పచ్చబీళ్ళు పొ
గారు తటాకముల్ తనవి
గావు ; విశాలధరాతలమ్మునన్
దూరగ్రహాంతరాగత వినూతన
జీవిగ గ్రుమ్మరిల్లి యిల్
సేరగబోవు శ్రామికుడు
చీకటిదిక్కులపిక్కటిల్లగన్

చేలంబూవులువెక్కిరించె
గగనశ్రీ చంద్రరేఖాంకయై
వేళాకోళముజేసె తాళవనిలో
వేలాది తారావళుల్
గోలంజేసెను చింతకొమ్మ పయినం
ఘూకంబుశోకించె నా
కూలీవాడు కుటీరగర్భమున
నాక్రోశించె దైన్యంబున్.

ముదుసలి తల్లిదండ్రులును
ముగ్గురు పిల్లలు చిన్నచెల్లెలున్
ఒదిగి పరున్న జీర్ణకుటిలో
నిటువైపున భార్య యావలన్
జిదుగులచెంత దాను శయ
నించును కన్నులుమూసి, మిన్నులన్

దదియ శశాంకరేఖయు
నితాంతనిశాగతి నస్తమింపగన్
నేలయు నింగియుం దెలియ
నీక యొకే తిమిరంబు విశ్వమం
దేలెను కీచురాళ్ళు ముఖరించె
మిణుంగురు లంధకారముం
జీలిచె చెట్లకొమ్మలును
శీర్షములన్ విరబోసి దయ్యముల్
వోలె చలించె జీర్ణకుటిలో
నెటులో నిదురించె జీవుడున్.



అరే మళ్ళీ వసంతం వచ్చింది
నాలో ఉన్న పంచభూతాల్ని
రెచ్చగొట్టింది
నేనీ పువ్వుల్లో కలిశిపోతాను
ఈ క్షణ భంగురమైన ఋతువును
కౌగిలించుకుంటాను.

నాకళ్ళు స్వప్నాల మంజూషలు
నారక్తం మధురగాయకులైన

పక్షుల ఆకాశం
నా శరీరంలో అడవులు
పరుగిడు తున్నాయి
నదులు పారుతున్నాయి
కొండలు మనుషులు గ్రామాలు
ప్రవహిస్తున్నాయి
నేను నా దేశాన్ని.



ఊపిరి కంటే అస్పష్టమైన ఆత్మలు
పూలవి
బరువులు మొయ్యలేని అవయవాలు
పూలవి
చిత్రం ! సౌందర్యం లోకపు అన్ని వస్తువుల
కంటే బలశాలి
పిడికిళ్ళు బిగిస్తే వేళ్ళలో నుంచి కారిపోతుంది
వసంతం
అంగుళులతో స్పృశిస్తే
అనేక రాగాలు దానం చేస్తుంది వసంతం
అరే ! మూర్ఖుడా ! బలప్రయోగం
బహారు మీద పనిచెయ్యదు.

జీవితం ఒక మండే జ్వాల
పువ్వులు బ్రతకడానికి మండుతున్న
జ్వాలలు
శేషన్! కొమ్మల్లో ఆచైత్ర మాస దేవత
పాడే పాట విను
జన్మలో వంచనాశిల్పంలేని
పక్షుల్లా పువ్వుల్లా బ్రతుకు ...
నీ కివ్వబడిన ఈ జీవితం
స్వప్నాల్ని బాణాల్లా సంధించే
ఇంద్ర ధనుస్సు -



చేతులలో తటిల్లతలు
చెలువుగ దాల్చిన ఓ కవీ! ధర
త్రీతలమం, దుగాది యరు
దెంచె మదించిన అంధకారసం
ఘాతము పారద్రోలి నవకాంతిశిఖల్
దరికొల్పుమోయి, ఖద్యోతపథమ్ము డిగ్గి
వినవోయి, ఉగాది యగాధగాథల్.

చేతికందని నక్షత్రసీమలందు
నవనవోన్మేష ప్రత్యూష నర్తకివలె
వెలయు సుఖరేఖ జీవన శిలలమీద
మలచి రూపొందజేయగా నలయుచుంటి.

చెమటలోడిచి బ్రద్దలు చేసినపుడు
గండశిలలోన సుఖరేఖ ఉండునేమొ ?
కటిక ముత్తెపుచిప్పల కడుపులోన
ఆణిముత్యాలబాల చెల్వారునట్లు.

అలయుటేగాని అలయుట కంతులేదు
శీర్ణమైపోయె జీవనశ్రీభరమ్ము
కోరికలు జారె వచ్చిన శారికలుగ
సానువులనుండి దిగజారు ధేనువులుగ

మొన్న కోకిల తా నొక గున్నమావి
కొమ్మలో జేరి కో యని కూయువరకు
ఇలకు వాసంతకాల మేతెంచెనంచు
తెలియకుంటిని బాధావికలితమతిని.

జలుగు చినుకుల జలతారువలువ దాల్చి
వచ్చిపోయినదట మొన్న వర్షయోష
మెడకడన్ దెగి చన్నుల నడుమనుండి

జారిపోయెడి ముత్యాల జాలువోలె
మడుగులను వీడి కొండల మధ్యనుండి
వెడలిపోయిన కొంగల వెంటనంటి.

రెల్లుపూలతో ధరణి ధమ్మిల్లమందు
కులికెనట బాలవాతూల కుట్మలములు
చిలిపి హిమబిందు సుందరి చెక్కులందు
పులిమెనట మందభానుడు వెలుగులన్ని.

అవియు జనెనట దూరదేశాంతములకు
జానపద రామణీయక సరణులంటి
బాడి యెండిన యడుగుల జాడలంటి
పూపలను రాల్చు మామిడితోపులంటి

బ్రతుకుకుంబాటల బాటసారిని వ్యథా
భారమ్ము ఘోరమ్ముగా
కుతుకంబెల్ల నశింపజేసె లతికా
కుంజమ్ము పుష్పింపనీ
ప్రతిభృంగమ్మును పాడనీ దశదిశా
వ్యాకీర్ణ వాసంతికా
ద్యుతిపై తన్మయు గోచరింపదు
అభాగ్యుండనైన నా కక్కటా!

ఏడనోగాని చిగురాకు మేడలోన
జేరి వనములు భువనముల్ మారుమ్రోయ
పిలిచె నిప్పుడు జీవులం బికమహర్షి
ఋతురసామ్నాయ ఉద్గాత, శ్రుతివిజేత.

తరువులందాటి కలువల చెఱువు దాటి
ఆ మధుస్వరలహరి నన్నంటగానె
హృదయమం దాశ యిటునటు కదిలియాడె,
కమల వనమున విహరించు గండుచేప
తోక తగిలిన తామరరేకువోలె.



కోకిల యాకులెం దాదిగి
కోయని తీయని కేకవేసి, కా
రాకులు రాలువేళ, శిశిర
ప్రతిసీర తొలంగ ద్రోసె, నీ
లోకము నందు దోచె నవ
లోకము, నాకము నీ ధరిత్రితో
నేకము జేయు లేళ్ళు, సెల
యేళ్ళు, చిగిర్చిన కొండకోనలున్

కాలముకూలమెక్కి యొక
కమ్మని ఈల వెలార్చి హేలగా
నీలి దిగంతకూలములు
నిండిన బాల కిసాల రాశిలో
నోలి గిరాటువేసె నొక
నూతన చేతన కాంతిఖండమున్
పూలు తటాలునం బొదలె
బుద్బుద పుంజ విలాసరోచులై

చిగిరిచి పూచినట్టి తరు
సీమలు మేన ధరించి, నవ్వుచున్
నగములు తెల్లమబ్బులను
నాణెముగా తలపాగ జుట్టి, పై
దిగు సెలయేళ్ళ నాత్మ భుజ
దేశములన్ సవరించి ప్రత్యుషో
గగన విలాసినీ రుచిర
గండ తలమ్ములు ముద్దులాడెడిన్

కెరలి వసంతవేళ పుల
కింపగ నింపగు కొండకోనలం
బరుగిడు కన్నె కాలువలు
పచ్చని తోటల గున్న మావులం
దిరిగెడు గండు కోయిలలు

తీగెల నూగెడు చిల్క బోదలున్
విరిసిన రమ్యతా విఫణి
వీథిగ దోచె సమస్తలోకమున్

పచ్చనినునురెక్క పైటదాల్చినచిల్క
గొంతెత్తి పిల్లన గ్రోవి నూదె,
సంపెంగముక్కును సవరించిపిచ్చుక
జలతరంగిణి మీటె శ్రావ్యసరణి,
శబల చూడము తలన్ చలియింప వడ్రంగి
ఖేలగా తియ్యని యీలవేసె,
గుమ్మడి పూవన్నె కుక్షి కదల్చుచు
భరతపక్షి సితారు పలుకరించె,
గరుడపక్షియు నీలాల గగన సీమ
దిరిగి సన్నాయి వాయించి తేనె గురిసె,
కుసుమ పీఠిక దుమ్మెద కూరుచుండి
తంబుర న్మీటి శ్రుతిగూర్చె ధరణికెల్ల.

చల్లని రేల నింగి విర
జాజుల పందిరియై హసింపగా
తెల్లని సోగ వన్నెలలు
తెమ్మరలుం జతగూర్చి నిండుజా
బిల్లి జగమ్ము మీద వల
వేసెను, లోపలజిక్కి చేపలై

యెల్లెడ జీవరాసు లటు
లిట్టులు గంతులు వేయుచుండగన్

సాగె వసంత కాలపు బ
జారు హజారు విరుల్ పరాగముల్
రేగగ రంగు రంగు నును
రేకుల కోకలు దాల్చి కేకలన్
స్వాగత వాక్యముల్ విసిరి
వైచెను; తుమ్మెద గుంపు లింపుగా
రాగము లాలపించుచు త్వ
రం బరుగైతె వసంత సంతకున్

సంపెంగా! నను చంపకే, పొగడ! నీ
సౌరభ్య పూరమ్ములన్
ముంపం జూచెదవేలనే, నళిని! నీ
పుష్పాళ్ళు పై జల్లకే,
సొంపుల్గుల్కు గులాబి! నీ
సొగసులం జూపించి బంధింపకే,
కెంపుల్ బూచిన కింశుకమ్మ! అటులం
గ్రీగంట న న్ జూడకే.

అబ్బ! లోకమెల్ల అందాల గోలతో,
నిండి యున్నదిచట నిలువలేను

నిమిషమైనగాని సమకూరకున్నది
శాంతి యీ వసంత సంతలోన

ఓ విహగమ్ములార! ఎట
కోయి ప్రయాణ? మనంత వీథులం
దావనభూములన్ వదలి
యాగిరు లాఝురు లాసముద్రముల్
ఆ వియదధ్వముల్ గడిచి
యావల తారల దాటి తేలుచున్
బోవుచు నుంటి రెచ్చటికి
పువ్వుల నవ్వుల గోల కావలన్

చివురుల్ వేసిన వేయనీ మధువులుం
జిప్పిల్ల పుష్పింపనీ,
చవులూరన్ ఫలగుచ్ఛముల్ పొదలనీ
శాఖోపశాఖాదులం
దివి యంటం పెరుగంగనీ, నిలువలే
నీ వృక్షమందింక, నా
యవదాతాభ్ర పతాకముల్ కదలె దా
మాకాశ మార్గమ్ములన్
అదిగో ఆ చిగురాకులందు చిలుకై
యానంద మందారమై
మృదుల స్వాదు ఫలమ్ము ముట్టక సము

స్త్రీలాక్షియై చూచుచు
న్నది యా పక్షి ననున్; క్షణమ్మయిన నుం
డం జాల నిచ్చోట; నా
కదిగో సుందర మందహాస రుచిరా
హ్వానమ్ము; నేబోయెదన్



లోలంబంబు ధ్వనించె నాకసము
గండూషించె బీరెండలన్
వాలాయంబుగ బాలకోమలదళ
వ్యాలోల డోలావళీ
కేళీమంజుల లీలందలసి
కుస్మెం గ్రీష్మ వాతూలముల్
చేలుం దోటలు దాటి యేగి వన
వంశీకుంజపుంజంబులన్

ప్రత్యూషముల దిశాఫాలభాగమ్ముల
కెంపమ్మి విరిచాయగీలు కొల్పు
కుతపవేళల విశ్వకుహరాంతరములందు
గుమ్మడి పూవన్నె గుస్తరించు మధ్యాహ్నముల
నభోమండలాధ్వములందు
మక్షైదండలశోభ వెల్లిగొల్పు

అపరసంధ్యాల రమ్యవిపిన నిర్ఝరులందు
సిందూరకాంతులు చిలుకరించి
కాలకందునిఘాలాక్షికాఱుచిచ్చు
దావపావకదీప్తికిజీవగఱి
పశ్చిమానిలవీచికి పట్టుగొమ్మ
అవతరించెను గ్రీష్మకాలాతపమ్ము.

దుర్నిరీక్ష్య ప్రభాధూర్ధరచ్ఛటలతో
క్షేత్రజీవనుల శిక్షించినాడు
పటురోషకాషాయ కుటిలాంశుకశలతో
గోగణంబులు చావగొట్టినాడు
ఖరమయూఖ క్రూర ఘనకాండపటలితో
విహగజాతులు క్షోభపెట్టినాడు
గ్రీష్మ కాలప్రాంశు కింశుకద్యుతులతో
తరువల్లికల కగ్గిదార్చినాడు
గగన ఘన ఘోట ఖుర నిరాఘాటఘాటీ
నలఘు బ్రహ్మాండభాండమ్ము నలగద్రొక్కి
చటుల దుర్ఘన రాజ్యశాసనము వోలె
సాగె మార్తాండ చండప్రచండ రథము.

ఎవడో చాకలి ఆకలిన్ మరచి
తానేవన్యమల్లీలతా
నివహాక్రోడపుటీ తటాకమున.కో

నిత్యశ్రమాజీవన
వ్యవసాయంబొనరించుచున్న
ధ్వనియే వ్యాపించె ప్రాపంచిక
వ్యవహార ప్రవిహీన విశ్వహృదయ
వ్యాపార మేమోయనన్.

వివిధ నిమ్నోన్నతవీధులం బరుగెత్తి
వైశాఖులో మేనువాల్చె నొకడు
ద్రాఘిష్ఠ ఘంటాపథమ్ములం దిరుగాడి
బెజవాడ కన్నీరుబెట్టె నొకడు
మధ్యాహ్న పరితప్తమార్గమ్ములంబోయి
గుంటూరులో కుప్పగూలె నొకడు
కాలాహి కుటిలశృంగాటకమ్ములు జుట్టి
నెల్లూరిలో సొమ్మసిల్లె నొకడు
క్రూర దారిద్ర్య దుర్విధికారణమున
తనభుజాగ్రమునెక్కు భేతాళమూర్తి
సర్వకాలానువర్తి రిక్షాధరించి
లాగలేకను వేసవి కాగలేక.

కొండల గండభాగముల
గూర్చి శిలాశకలమ్ము లేర్చి పే
రెండలధాటికోర్చి శ్రమి
యించి పురీపరిణాహవీధులం

బండలు లాగుచుం బ్రతుకు
భారము మోయు నభాగ్యకోట్లు నా
గుండెలలోన నగ్నిదరి
కొల్పును తీవ్రనిదాఘవేళలన్.

గునగున సంచరించు పసి
కూనలు చానలు చెట్లనీడలం
దినములుబుచ్చు కాలము
గతించునుగాక సమస్తదీన జీ
వనములు పల్లవించి సుఖ
వంతములై విలసిల్లుగాక నా
మనము శమించుగాక మరు
మల్లెలలో చిగురాకుచందమై.



కనరాదు యామినీకబరీభరమ్ములో
బెడగారు కలికి జాబిల్లిరేక
సికతరీతిగ తమశ్చికుర నికరమ్ములో
నలతిచుక్కలమోసులలముకొనియె
జిలుగువెన్నెలచీర చిరిగిపోయెనదేమొ
కాఱుమబ్బులు మేనగ్రమ్ముకొనియె

యెడదలో నేదేని సుడియుంచుండెనో యేమొ
కాకలీనినదముల్ క్రందుకొనియె
మేను విరిచెనేమొ మెల్లగా నిట్టూర్చి
విధురవాయువీచి విస్తరించె
నాత్మవేదన కోక యాకారమై తోచి
నేటిరేయి నన్ను కాటువేసె.

ఘనఘనాఘన గజ్రై వేయఘంటికా
టంకారములకు ఘంటాపథంబు
శక్రచాపోదగ్ర శార్దూలపాలనా
విభవోన్నతికి భూరివిపినసీమ
చటుల ఝుంఝూమరుచ్ఛృతకోటి భేతాళ
లుంఠనక్రియలకు రుద్రభూమి
పటుతటిద్విలసన బ్రహ్మరాక్షస కఠో
రాట్టహాసమున కహార్యబిలము
గగనభాగమ్ము ప్రావృష ద్విగుణరోష
ఘటిత నటనోగ్రధాటీ విఘటిత ప్రకట
కుటిల ధూర్జటి ఘనజటాపటల నిటల
వికటభ్రుకుటీ కుటీర ముద్విగ్నమాయె.

విరిసెను మేఘపరంపర
మెరసెను శాంపేయలతలు మిన్నులు మొరసెన్
పరచెను ఝుంఝూనిలములు
కురిసెను వర్షంబు కుంభకుంభితరీతిన్.

దీపించెం జలరాశిఘోష, కడు
నుద్రేకించి గీతంబు లా
లాపించెన్ నగసీమలందిగి
మహారణ్యమ్ములన్ నిర్ఝరుల్,
వ్యాపించెన్ హారిదంతదంతురమ్ములై
యారావకల్లోలముల్
వాహీకూప తటాకభేకముఖ
జీవానీక లోకంబులన్.

వర్షాగర్జదమోఘమేఘపటలీ
వాఃపూర ధారాసము
త్కర్షామర్షనిపీడ్యమానజనతా
కంఠీరవంబై నభః
శీర్షాంతఃపుర భోగభాగ్యవనితా
శ్లేష ప్రభాహర్ష దు
ర్ధర్షాగార బిడాలమై నడచె నౌ
రా! కాలముద్వేలమై.

ఒకనికి గండభేరుండ శుండాలంబు
లొకనికి మకరధ్వజోత్కరంబు
ఒకనికి నశనిపాతోగ్రబిభీషికల్
ఒకనికి మురజప్రమోదరవళి
ఒకనికి సమవర్తి హుంకార కింకరుల్

ఒకనికి ప్రియదూత నికరలీల
ఒకనికి శైత్యభల్లూక భీకరదంష్ట్ర
లోకనికి యువతీకవోష్ణసుఖము
యేమిధర్మంబు భాగ్యవిహీన దీన
జనులమీదనె దౌర్జన్యచర్యగాని
హేమధామ సముద్దామసీమలందు
అడుగుపెట్టంగపర్జన్యుడైనవెఱచు.

కనకమేఖలవోలె గగనమ్ము జఘనమ్ము
నింద్రచాపము కుండలీకరించె
జాజిదండలవోలె జలదమ్ము కబరిలో
సౌదామినీమాల సంచలించె
చిలిపినవ్వులవోలెచిన్కుముత్యాలలో
నీహార మధురిమ నివ్వటిల్లె
అందెలరవళిగా ఆశాపథమ్ము లం
దంబుదధ్వనులు మోహంబుగొల్పె
వలపుకై పెక్కి బిబ్బోకవతియొకర్తు
వచ్చెనోయన వెచ్చని భావశయ్య
నిదురవోయెడు ధనికుల మృదుకవాట
వాటములు తట్టి పిల్చెను వర్ష ఋతువు.

ఘనతర వర్షపీడిత జగమ్మున
కమ్మని సౌధవీధులం
గనక మయప్రభావ పరి
కల్పిత భోగవిలాసవాసనా
జనిత మదప్రలాపములు
శల్యములై వినిపించుచుండగా
మనము సముజ్జ్వలజ్వలన
మాలికలంబడి ప్రమ్గకుండునే.

చరిగాలిం జడివానలంబడి ప్రపం
చంబెల్ల చల్లారగా
నలఘు క్రోధమునంజ్వలించె హృదయం
బాభీల కీలావళీ
కలితోదగ్ర మహాగ్ని హోత్రమున నీ
కర్కోటకక్రూరమౌ
చలిలో బీదలబాధలం దలచినన్
శాంతింపగా సాధ్యమే.
అకలంకారమృతమిచ్చినావొకరికిన్
హాలాహలజ్వాలికా
నికరమ్మొక్కరికిచ్చినాడవు
జగన్నిర్ణేత! ఏతద్విధం
బొకకంటం దుహినాంశుమండలము
రెండోకంట నుష్ణాంశువుల్

ప్రకటింపంగల లోకరక్షణకళా
ప్రావీణ్యమేమో ప్రభూ !



ముల్లోకములు ఏలు ముద్దుహారిణాంకుడు
విరజాజితీవలకు విరహిణీ జీవులకు
తరిపివెన్నెలపాలు త్రాగించుచున్నాడు.

ఏగాలికెగసెనో యీ చికిలితారకలు
అందాల తళుకుతో అప్సరసలకుమల్లె
ఆకాశరంగాని కవతరిస్తున్నాయి.

నిర్మలాకాశంపు నీలాటిరేవులో
పండువెన్నెల నీట పిండి ఆరేసిన
తెలిమబ్బువలువలు తేలిపోతున్నాయి.
చిగిరు గుబురులుదూరి చిరుగాలి బాలికలు
రేరాణిపూలపై పారాణిరాచుకొని
చిక్కనినెత్తావిపుక్కిలిస్తున్నాయి.

తీయని భావాల తీగలల్లుకుపోయి
రాగమయ భావనారమ్య వనభూమిలో
విరితేనియలు వెల్లివిరిసిపోతున్నాయి.

తరుమూలమ్ముల పూలవానకురిసెన్
దారాడె కూలంకషా
తరుణీస్వచ్ఛదుకూల చేలములలో
తారళ్య సారళ్యముల్
ధరణిన్ నిండె శశాంకదీధితి
నిశాధమ్మిల్ల మల్లీవిక
స్వరకింజల్కములైయొకానొక
శరద్వాతూల హేలాగతిన్

వలపించె కెలకులం గొలకులో మదకరి
పుక్కిటినీహారపుష్కరములు
కురిపించె తేనెలం గోనలం దిరుగాడు
కొండవాగుల గానగుంభనములు
నవరించె మంజిమల్ నవతృణాంకుర భూమి
విరిసిన సారంగ విభ్రమములు
పచరించె హరివిండ్లు బాలవాతూలముల్
వెదజల్లు చల్లని విప్రుషములు
విపినసీమలు శారదవేళ హృదయ
గుహాలలోపలి చీకటి గూళ్ళలోని
కోరికలులేని ఆశాచకోరికలను
మేలుకొల్పెనురెక్కలంగీలుకొల్పె.

అదిసాయంతనమర్క మండలము
సాంధ్యశ్రీలు గోల్పోయి యే
పొదలో గ్రుంకెనో అంధకారమొక
యంభోరాశియైలేచె; నా
మది నవ్యక్త విషాద భావరజనీ
మంజూషగా మారిచెన్
మృదుహిందోళమరందరాగలహరీ
మిశ్రంబులై వాయువుల్.

సాంధ్యరాగశ్రీలు సాగిపోతున్నాయి
యెడదలో క్రీనీడలేపారుచున్నాయి
చీకటి దయ్యాలు శీర్ణకేశాలతో
దూరాన చెట్లలో తారాడుచున్నాయి
కాకరపాదులో కనరాని వేవియో
మొకరింగొంతులు జగము ముంచివేస్తున్నాయి
గ్రుడ్డి ముసలమ్మ లాగున్న గదిలో దివ్వె
తన పూర్వగాథలను తలపోసుకుంటూంది
ఈ శూన్యలోకపు యిసుక యెడారిలో
కళ్ళుమూస్తే పీడకలలు వస్తున్నాయి.

హితవుగమేఘమాలిక
ద్రవించునుగాక, చిగిర్చి యంతటన్
లతలు సుమించుగాక

పృథులమ్మగుగాక వెలంది వెన్నెలల్
ఋతువులు మారుగాక
జ్వలియించు క్షుదా వ్యధితోగ్రజీవన
క్రతువులు మారెనే యుగయుగమ్ముల
భారమొకింత తీరెనే.

నిదురవోయెడు యామినీ తనూవల్లికి
తులలేని జలతారు వలువగప్పి
చిక్కగా పూచిన చిగురాకు కోనలో
కన్నె కాలువలకు వన్నెగూర్చి
నర జాతి కందని నక్షత్ర వీథిలో
తెలిమబ్బు తేరెక్కి తేలియలాడి
లలిత జీవన లతా లావణ్య ఖేలలో
సాధసుధలకు వింతసొరుగూర్చి
లోకమునకెల్ల నమృతాభిషేకమొసగి
పరుగులెత్తెడి యందాల పాలవెల్లి
పండువెన్నెల రాదేల పంతగించి
చితికిపోయిన దీనుల జీర్ణకుటికి.

అంతములేని కాలపథమందొక
యొంటెల బారువోలెన
శ్రాంతము సాగిపోవుఋతు
జాలము జాలము సేయ ; దీతమో

దంతురమౌ విశాల జగ
దంతరమన్న యెడారిసీమ నే
కాంతముగా తపించు
విధురాత్మ నుగైకొనియేగదక్కటా!

ఆకాశపునీలి నికుంజం వెండిపూలు పూచింది
మల్లెపూలబాటల్లో మబ్బుల బిబ్బోకవతులు
వెడలెను అతిషోకుగా వెన్నెల తిరునాళ్ళకు
వెళ్ళిపోకు జాబిల్లీ నా ఊహల పాలవెల్లీ.

సుమనిశ్వాస సుగంధిల సుందర మందానిలములు
మసలే తరుశాఖల్లో హసియించే నీవు
బాహువులం దొదిగిన నా మోహినిలా ఉన్నావు
వెళ్ళిపోకు జాబిల్లీ నా ఊహల పాలవెల్లి.

నా స్వాప్నిక సీమల్లో పయనించే బాటసారి
నా జీవిత లోయల్లో ముఖరించే వేణుగీతి
మది కౌముదిలో జలకా లాడించిన కాంతిలహరి
వెళ్ళిపోకు జాబిల్లీ నా ఊహల పాలవెల్లి.

నేనొక నవకోకిలనై జీవన తరుశాఖల్లో
తియ్యటి రాగాలొలుకుచు తిరిగిన ఆ రోజుల్లో
పలురంగుల పువ్వుల్లో పరుగిడు సీతాకోక

చిలుకనుగా ఎగిరిన చిన్ననాటి రోజుల్లో
నా ఊహాల మహాళ్ళలో నర్తించిన సుందరీ
వెళ్ళిపోకు జాబిల్లీ నా ఊహాల పాలవెల్లి.

విధి అదృశ్య హస్తం అదిగో ఉదయ మయూఖం
మౌనముఖాలతో తూర్పునించి పశ్చిమానికి
పయనించే తారలారా! మింటి ఎడారి బాటసారులారా
ఉదయాన్ని ఆపలేరా జాబిల్లిని నిలుపలేరా.

జీవిత నిబిడారణ్యపు చిక్కుపొదల్లో బడి
పరుగెత్తే సుఖ హరిణిని భ్రాతుల పసిండి బరణిని
విసుగులేక విరతిలేక ఎన్నాళ్ళని వెంటాడుదు
దొరకని ఓ జాబిల్లీ నా ఊహాల పాలవెల్లి.

హృదయ విపినాన్ని ప్రేమజ్వాల రగిల్చింది
సంధ్య కొండల వెనుక పశ్చిమాన్ని దహించింది
గాయంగా ఏదో ఒక కవిత మోసులెత్తింది
మదిలో పూచిన మోదుగు పువ్వై విరిసింది.



నెల వెలవెలబారె నీలంపు మిన్నుల
చుక్క సంభ్రమించె చుక్కలేక
ప్రాలేయపుం జిల్గు పరికిణీధరియించి
చెంగావిలేయెండ చిందులాడె
అరవిరబారిన యంబుజమ్మకు బుట్టె
మునురేయిజిక్కినమొకరితేటి
ముద్దుగా మృదువుగా మొలకతెమ్మెరకురుల్
కదలించి ప్రియురాలి కలముగించె
చిగురు బాలలు హిమపాళి సిగలదాల్చి
చిలిపినవ్వుల సింగారమొలకబోసె
జగతి మొగసాల నీ కొల్వు సాగనిమ్మ
పసిడి కాంతులబరణీ! ఓ బాలతరణి!

ఇభకుంభస్థల మౌక్తికాభరణమో
హేమంత సీమంతినీ
కబరీ మంజులకింశుక ప్రసవమో!
కళ్యాణ సిందూరమో
శుభసందోహ మహావతారమొ
యనన్ శోభించుచున్నావు మా
కభయంబిచ్చి నిశాపిశాచకుటిలా
హంకారముం గూల్పవే.

భ్రమరము భ్రుమిచ్చిలించి మక

రందము లెల్లను శూన్యమైన యా
కమల వనమ్ములో పసిడి
కాంతులు చిల్కిన చాలదోయి మా
తిమిరగృహాంతరాళముల
దీపము వెట్టుము కన్నుదోయి నీ
యమలమయూఖ రేఖలకు
అర్రులు చాచెను లోకబాంధవా.

కొందమ వెలుంగులన్ చికిలి
కుంచెలతో హిమబిందు సుందరీ
మృదుల కపోల పాళికల
మీద లిఖింతవుగాని ధారుణిం
బ్రతుకుల నావరించిన
పురాతన యాతనలన్న చీకటుల్
ప్రిదులు తెరంగున్ శర
ఝరిం గురియింపవదేలనో ప్రభూ.

తిమిరములోన బాధపడు
దీనజనాళికి దారిజూపి నీ
యమలమయూఖమాల
చరితార్థము చేయక లాలితీలతా
సుమసముదాయమూర్తి వయి
శూన్యపథమ్ముల సంచరించుచున్

హిమరమణీయసౌధముల
నెచ్చటనో వసింయింతువా ప్రభూ.

ఒక మల్లె విరిసింది ఊహాలో మురిసింది
ఏ యాస నీ మీద యెంచుకొనెనొ
ఒక గులాబీ బాల చికిలి నవ్వొలికింది
ఏ యెలమి తరంగ మెగిరి పడెనో
ఒక జాజి వలపు నిట్టూర్పులు బరపింది
ఏ కోర్కె యెదనాక్రమించుకొనెనో
ఒక తీగె సంపంగి ఉప్పొంగిపోయింది
ఏ తలపు వెదుళ్ళ యూల వినెనో
శిథిల జీవులు నీరాక కెదురు జూచె
వేయిచేతులు కదలించి విశ్వజగతి
జీవకాంతులు ప్రసరింపజేయుమోయి
తెరలు తొలగించి రావోయి అరుణమూర్తి.



జాజులమీద మోజుపడి
సంతల పుంతల సంచరించి యీ
బూజుబజారు మెట్టితివో
పూచి గులాబి జిలేబి గిన్నెలుం

దేజము లోడిగిల్లినవి
తేంట్లకు తేనెలు గోలుపోయి, యీ
రోజుకు వెళ్ళిపొమ్ము
శిశిరోదయమాయె నిలాతలమ్ములన్.

ఆకులురాలి శాఖలకు
ఆకులపాటు ఘటిల్లె, పాప మీ
లోకము వృద్ధిమూర్తియయి
లొంగి స్మశాన కృశాను కీలికా
నీకము చెంతజేరె, ధరణిన్
హిమదంష్ట్రలు కాటువేసె నా
జూకు కళాపిపాసలకు
చోటొక యింతయు లేదు నేడిటన్.
చలి పులివోలె దారుల
పచారులు చేయుచునుండ ఊరికా
వల పెనుమఱ్ఱిక్రిందనెల
వంకయె దీపముగా పరున్న పే
దల పనిపాప లెవ్వరికి
తప్పు దలంచిరి కాలమే హాలా
హాలమయిపోయి యా శిశువు
లాకలితో చలితో, నశింపగన్.

ఓ పరమేశ్వరా! యెచట
నుంటివి నీ వసలుంటివా ప్రజా
శాపములం భరించుటకు
సాధ్యముగాదని పాతపెత్తనం
బీపయి సాగబోదని
యెటేని పరారయినావ? బాధలం
బాపగలేవు నీవు శిలవా
కలవా సెలవీయుమో ప్రభూ!

కమలా కంకణ కింకిణీక్వణములన్
గందర్వ దర్పంబులన్
గమనీయంబగు సౌధవీధికల నా
నందించు దుర్మార్గవ
ర్గములం బ్రోచెడు దేవుడేమెరుగు
నిర్భాగ్యప్రజాకోటిదు
ర్దమబాధాయజీవితానుదిన
గాధాగర్భసందర్భముల్.

ఏలాగో ఒకనాడు ఆ శిశువుతో
యుంధానమౌగాక యు
ద్వేలక్షోభ నభోంతరాళమెగయన్
విశ్వప్రజాలోచనో
న్మీలంబై హృదయాగ్ని పర్వత

మహానిర్ఘోషరోషానల
జ్వాలాజాలకరాళజిహ్వాకలు
తుచ్ఛంబైన యీ లోకమును
గూలంజేయునుగాక; యీ వచనమే
ఘూర్ణిల్లుగా కంతటన్.



విప్లవ భాషావిధాత కవిసేన మేనిఫెస్టోప్రణేత బుధజనవిధేయ శేషేంద్ర నామధేయ కవివర్య ప్రణీత ఆధునిక మహాభారతస్య అనుబంధకావ్యం జనవంశమ్‌లో ఋతు కాండ సమాప్తం.

# భ్రమరకాండ

గదిలోకి వచ్చి ఎగిరే గిటారు
ఆ దేశ ద్రిమ్మరి భ్రమరం
బయట నులోస్తీ ఉన్న భయానక ఎండ
గాలిని బంధించిన గూండా
పసుపులో ప్రేళ్ళుముంచి నులోస్తీ ఉన్న
మౌన వృక్షమే
మనిషీ రాగమూ అనుభవించే
నిశ్శబ్దంలో నుంచి అనంతంలోకి ప్రవహిస్తున్న కాలం
రెక్కలుజాపివాయువుల్లో
నిశ్చలత్వం సాధిస్తున్న పక్షి
మూడూ తొమ్మిదీ మీద చేతులు జాపి
ఆకాశంలో ఉన్న గోడ గడియారం !



"రాత్రి
తోట ధరించిన ధ్యానముద్ర
తోట
రాత్రి కంటున్న కల

నీలి రాత్రి నక్షత్రాల క్రింద
నిద్రావస్థలో ఉన్న తోట
ఒక ప్రతీకల మహా నాగరకత"



జీవనకల్లోలంలో ఆత్మ విసిగిపోయి ఒకనాడు చెప్పిన మాట -
తిరిగి తిరిగి చేరానిల్లు
అరిగి పోయి రెండూ కాళ్ళు

ఇంతచిన్న ఈ కుటీరం
ఇదే నాకు నీలాకాశం
అందులోని నీ నగుమోమే
చేతి కందే చందమామ

నీచేతులు నీలివాజులో
నింపిన ఆనాలుగు పూతే
చిరునామా వెతుక్కుంటూ
చేరిన నా వసంత ఋతువు

జగమంతా వెతికాను
నాలోనే ఉందని ఎరగక
చిరుబుల్బుల్ గొంతెంతది
చైత్రించును అరణ్యమంతా



ధరిత్రిని హాలం దున్నితే
అప్పుడు అవుతుంది
అది ఒక దేశం ;
ధరిత్రిని కలం దున్నితే
అప్పుడు అవుతుంది
అది ఒక ఇతిహాసం
హాలమూ కలమూ దున్నని
ధరిత్రి
ధరిత్రి కాదు వట్టి మట్టి

శాఖల్ని విడిచి ఆకులు
రాలిపోతున్నాయి
చెట్లను విడిచి నీడలు
పారిపోతున్నాయి

యుద్ధోన్మాదులు సముద్రాలు
దాటి వస్తున్నారు
దేశాలు దాటి ప్రజలు
ఘోషిస్తున్నారు
బానిసత్వపు బరువుతో
వంగిపోయిన వెన్నెముక
ఉక్కులా నిల్చునే రోజు
ఉరిమి చూస్తోంది



స్వర్ణంలాంటి రక్తపాతం చేత కూడా
స్వప్నాలు శాశ్వత వాస్తవాలు కాలేదు
మూర్ఖులకే తెలీదు పరిణామం కూడా
పరిణామ గ్రస్తం అని

దూరానకుక్కలా మొరుగుతోంది
ఏకవచనంలో దిగంతరేఖ
నిన్ను చూచి దిగిపోరా అనే
నిరంతర కేక

అందమైన సోమరి కలలు
పుస్తకాల్లో పూచే పూలు
ఫలించని పరిమళాలు
సగం దేహం పులి నోట్లోకి పోయిన
మనిషిని కూడా రుద్రాక్షలు తిప్పమనే నాగరకత
దైవం నుంచి కూడా తైలం పిండే ధూర్తత...

గగనంలో ఎగిరే పక్షికి
పాపపుణ్యాల చింతే లేదు
భూమి మీద నడిచే మనిషికి
పునర్జన్మ అంటే భయం
గాలి మబ్బుల్లో చేసిన చిరునీలి చెలమలో
చూడు ఒక నక్షత్రం నగ్నంగా స్నానం చేస్తోంది.

పారిపోయి గదిలో బంధించుకోకు
కుర్చీలు నవ్వుతాయి గోడలు ప్రశ్నల్ని
రువ్వుతాయి,
పటాలు ఉపన్యాసాల జలపాతాల్ని
విడుదల చేస్తాయి
కట్టర్న జాజ్ సంగీత దండయాత్రల్లో
నీవు కొట్టుకుపోతావు
ఎందుకు నిరీక్షిస్తావు గదిలో ఖైదీవై
ఏ ఉత్తరమూ నీ తలుపు కొట్టదు

ఈ దేశంలో వసంతం అడుగు పెట్టదు
ఎవడూ కోకిల గొంతు గుర్తుపట్టడు.
ఎందుకు అంత నాజూకు జీవితం మోస్తావు ?
నిన్ను కొలవడానికి ఒక్కోసారి సముద్రం కూడా
అల్పం - ఒక్కోసారి బిందువు కూడా అధికం !
నిరీక్షించు నా కోసం
నీకలంలోకి దిగుతాను
నీ కలల్లోకి దూకుతాను
నీ ఆకాశాన్ని పిడుగునై చీలుస్తాను...

మండిపడుతున్న ఎండ
ఇవాళఆవిష్కరించింది
నీడ దైనందిన నేత్రానికి స్ఫురించని
ఒక పదార్థం అని
ఏది శూన్యమో
ఏది పదార్థమో
తెలిసే జ్ఞానం
కష్టసుఖాలు మనిషికి చేసే దానం

రెండు కాకులు ఒక చెట్టు ఆంతరంగిక శాఖల్ని
మధుశాల చేసుకున్నాయి

గుండెల్ని టేబిలుమీద పెట్టి
గుసగుసలాడుకుంటున్నాయి



ధరిత్రీ ! సముద్రాలు నీచీరెలు
నీవే నాకు కవిత్వం నేర్పావు
నీ భాష జలపాతం లా
నా గుండె లోయల్లోకి దూకి
ప్రవహిస్తుంది నరనరాల్లోకి
నీ పలుకులు తేనేటీగల్లై
పూలకాగితాల్లో ఎగురు తున్నాయి
నీ వాక్యాలు
కామాలు ఫులుస్టాపులు లేని నదుల్లై
అడవుల్లో పరుగులెత్తు తున్నాయి
హేమంతాల గుంపులు పోగుచేసే ఆకులు
నీవు రాసే పేజీల పరంపరలు
చెమట బొట్టుకు ! నీ హృదయం కోల్పోతావు
చేతులనిండా ! ధాన్యం నింపుతావు
సముద్రాలతో శరీరాన్ని కప్పుకుంటావు
నాగరకతతో మా నగ్నత కప్పుతావు

గింజలు తింటావు పూలు ఉమ్మివేస్తావు
అందుకనే
మేఘాల్లో బంధింపబడిన చినుకు
నీ యెదలో చోటుకోసం
తహతహ లాడుతుంది



అంతరసముద్ర కల్లోల ఘోషలో
కలిసిపోతున్నాయి వేదనతో కుమిలే
ఆకాశపు గుసగుసలు
ఏమిటి ఈ పేజీలు రెపరపలాడుతున్నాయి
జీవన ఝంఝా ప్రభంజనంలో
చేతిలో చిక్కినపక్షిరెక్కల్లా
ఆ పేజీల్లో ఏముంది
విరిగిపోయిన మానవతా శిథిలాలు
శిథిలాల్లో విషాద పారావతాల
దైన్య స్వర వలయాలు
మనస్సు భయంకర భావ పరంపరలు
వెంటాడు తుంటే ప్రాణాలకోసం పరుగిడుతోంది
అడవుల్లో రేచులు వెంటాడే హరిణంలా

ఈ కాలంలో నీ కిచ్చే కానుక
మన జీవన మూలిక
ఒక స్వప్నం అయిన జీవితంలో
నిజం కోసం వెతకబోకు
స్వప్నాన్ని మధుర స్వప్నం చేసుకో
దుఃఖాలకు అలవాటు పడ్డ నీ మది
ఓ శేషేన్, జైలుకు అలవాటు పడ్డ ఖైదీ!



కాలలీలా విలాసం
కాలం ఒక చిరునవ్వు నవ్వింది
ముళ్ళపొదల్లో ఒక పువ్వు పూచింది
ఏ క్షణంలో నేను జీవితానికి ఋణపడ్డానో
ఆ క్షణం నీవు నా కిచ్చింది
నేను నీకిచ్చింది
అదిగాలి కెగిరిపోయే ఎండు టాకు కాదు
గగనంలో ఎగిరే నీ చేలాంచల రేఖ
నన్ను ఎలుగెత్తి పిలిచే ఒక ప్రేమ విహంగి
రంగులరెక్క- దేనికోసం నేను పూలచేలల్లో
దానినీడ నావలా ప్రాకే బ్రతుకు కోనల్లో

తామర కొలకుల్లో పరుగులెత్తానో
ఆ క్షణం
మనం ఈ యుగం కన్న కలలం
ఈ క్షణం మన మీ తృషిత యుగానికి
ఇచ్చే సలిలం
మనం పుచ్చుకోవడం ఈ యుగలక్షణం కాదు
ఇవ్వడమే ఈ యుగలక్షణం
చూడు నాకళ్ళలోకి
ఆరక్తనదుల కావల ఆ సిందూర సంధ్యల కావల
ఆ సాంద్ర చాంద్రీమయ రాత్రుల కావల
ఏముందో చూడు
అదిగో ఆ క్షణాన్ని నా రుతువుల గాయాలనుంచి
కారే రక్త ధారలతో తడిపి తెచ్చాను
ఆ జీవన దానాల్ని ఒక్క రాత్రి ఒక్క పగలు
సుఖదుఃఖాలకు రాగద్వేషాలకు ఆవల నిలిచి
మది ప్రముచ్చిలించే ఉన్మీలిత శాద్వల వన భూముల
కావల నిలిచి మన వైపు నవ్వే ఆ క్షణాన్ని తెచ్చాను
ఆ ఒక్క క్షణం లేకపోతే నేను
ఇలా బ్రతికి ఉండేవాణ్ణి కాదు !



ఋషులం గూర్చి విచింత్య బ్రూమః - యథా
సకల జగమ్ము సౌఖ్యరససాగర చారుతరంగ డోలికా
నికరములందుండి మృదు నిద్రమునింగిన
యర్ధరాత్రినీ
వొకడవు నిద్రమాని హృదయోదయ భావసమీర
వేదనా
వికలితమూర్తి వై పరితపించెద వేల ధరిత్రికోసమై

నీవు విశాల భావరమణీయ విహంగివి నీదయామృత
ప్లావిత పక్షయుగ్మ మృదులాంతర గర్భకవోష్ణ
కోశమం
దావృతమై జగమ్మెపుడు హాయిగ నిద్దుర
వోవు ఘోరగ
ర్జావిల సత్పయోధర పరంపర పొంపిరి వోవనీ పయిన్.

ఓ కల్యాణ తపస్వి ! ఓత్రినయనా! ఓలోకదీపాంకురా
ఓ కౌండిన్య కణాద గౌతమ ప్రజాక్షేమంకరా శంకరా !
నీ కారుణ్యరసావతార వివిధా నీకంబు లోకంబునం
దాకల్పాంతము ప్రజ్వలించు నొక విశ్వాంతర్ముఖ
జ్యోతియై.

వనముల కాలముం గడిపి వన్యఫలమ్ముల దృప్తి
జెందిజీ

వనమును కేవలమ్మొక తపమ్ముగ జేసి గడించినట్టినీ
ఘనతర జ్ఞాన దుగ్ధములఖండిత రీతి నొసంగి
నిచ్చలున్
మనుజ కిశోరమూర్తి పరిమాణము పెంచెద వంచిత
ద్యుతిన్

ఏమిభుజింతువో వలువలేవి ధరింతువో విశ్రమింతువో
నీ మహనీయ మూర్తి కొక నిర్మల తేజము దక్క వేరు లే
దోమహిమాహిమాలయ! లయోదయ
కాలకులాయకోమల
శ్రీమయ దీపకాంతియె వరించి ధరించును నీతనూ
లతన్.



నేను కవిని అనే మాటను గోలీతో కాల్చు
నాకుగర్వం నేను మనిషిని అని
నేను క్యూలో నుల్చుని
అనుభవిస్తాను జీవితాన్ని
నేను ముందుకు పోనునాముందు నుల్చో
ఉన్న మనిషిని వెనక్కి తోశి

పోస్టుకార్డు క్యూలో ముందున్న మనిషి
ముందు పొందితేనే నా మనస్సుకు హాయి
అన్యాయానికి మనిషి బలికాలేదుగదా అని తృప్తి
నేను జనంలో నడుస్తాను
దౌర్జన్యంగా ఒకడు మరొకడ్ని
కొడుతుంటే చూడ లేను
నాలో ఒక అగ్ని పర్వతం ఘుర్ఘుర ధ్వని
చేస్తూ ఉంటుంది
అదిఒక్కసారిపగులుతుంది
అగ్నిచ్ఛటల ఝంఝను విసురుతుంది
అన్యాయాన్ని భస్మీ పటలంచేస్తుంది
ఎంత క్యూగత జీవనం అనుభవిస్తానో
ఎంత నాకాళ్ళని ఎక్కువగా రోడ్లకి అప్పగిస్తానో
అంత మానవీయ సంపద ఆర్జించి గర్విస్తాను ;
కనకనే కొందరు నన్ను కవిఅంటారు
భవనాలను మింగాలి
జనాలను మాలగా వేసుకోవాలి
రస్తాను రంగ స్థలం చేసుకోవాలి
ఆకాశాల్లో విహరించాలి
పాతాళంలోకి ప్రయాణించాలి
పక్షులతో పాడాలి - పశువుల్ని పలకరించాలి
ఎంత రోడ్ల అనుభవం ఎంత జనుల క్యూ అనుభవం

గడిస్తాడో అంత సంపద అది ఒక మనిషి
కవి గాజన్మ ఎత్తడానికి -
ఎన్ని దేశాల్లో తీర్థ యాత్రలు చేస్తాడో
అంత విస్తార కావ్యానుభవంగడిస్తాడు
కవి - కవి ఎత్తు ఈ విస్తృత సంపద రూపాంతరమే !
ఈ అనుభవం మనిషిని రసాలుగా మార్చి జనుల్లోకి
ప్రవహింపజేస్తుంది.
భవనాంతరాల్లోకి పోయి శయ్యాంతరాలకు
శరీరం అర్పించి అదే స్వర్గంగా భావించేవాడు
బ్రహ్మాండ మైన నదిలా ప్రవహించే మానవ
జీవనంలో జలకమాడే హిరణ్య సంపద
కోల్పోతాడు -
భవనంలో ఎంత లోతుకు పోతే అంతనష్టం
సంభవిస్తుంది మనిషికి - కవి అంతచిన్న కవి
అవుతాడు అంత అకవి అవుతాడు
కవి ఏమిటి గోలీమారో ! మనిషి ప్రధానం !
సామాన్యుల సుఖదుఃఖాలకు
ఎంత శిరస్సు వంచుతాడో మనిషి
అంత ఎదుగుతాడు
సుఖదుఃఖాలు మనవజీవన సముద్రంలో

మత్స్య కచ్ఛపాలు ;
నిజమైన మనిషి మానవ జీవన సాగరాన్ని
ఆచమనంగా తీసుకున్నప్పుడు
ఆరెండుభగవత్స్వరూపాలుఒక్కదోసిట్లోకి
వచ్చి దర్శన మిస్తాయి.
మనిషి మనిషిగా జీవించి కవి అవుతాడు
నేను ఈ శతాబ్దపు శిథిలాల్లోనుంచి లేస్తున్న కవిని !



మా బాల్యనీలోకి వ్యాపించిన ఒకనగ్న శాఖ
నన్ను సదా నిలదీశి అడిగే రహస్య మయరేఖ !

దాని జ్వాలల్లాంటి చివుళ్ళు దీపికల్లాంటే పుష్పాలు
బాటసారిని ఆపే ఫలగుచ్ఛాలు
దాని నీడల్లో పాడే కోకిలలు
దాని ఆకుల్లో ఇరుక్కుని వ్రేలాడే ఆకాశపు నీలి పేలికలు
అన్నీ ఎక్కడికిపోయాయో !

ఇప్పుడు మాత్రం అది నగ్నశాఖ -
దాని చివర కాలధర్మం చెందిన సంక్రాంతి తోకలా

వ్రేలాడుతూ. విరిగి పోయిన ఒకగాలి పటం
ఎండి పోతున్న అదృశ్యబాష్పం -

నేను ఒక దృశ్య మాన శారీరిక భంగిమ అందిస్తే
మీరు నా అదృశ్యభావ ప్రపంచాన్నంతా
మింగేస్తారని
నాకు తెలుసు - కనక చెప్తున్నాను
నగ్నంగా ఉందేగానీ ఆశాఖలో
కాలం ప్రవహిస్తోంది
రాగితీగెలో విద్యుత్తులా

అందుచేతనే ఇప్పుడు మళ్ళీ చైత్రం చేతిలో
భూమి భూమి అంతా పువ్వుల్లో మునిగి పోయింది,
నగ్న శాఖ సహితంగా -
ఆకాశం వెన్నెట్లో మునిగి పోయింది
నాకు మాత్రం నిద్రాహారాలు కూడా
మిగల్లేదు -



పువ్వులు వృక్షం అనే వర్ఛిలో
పురోహితులు
ఉడతలు పక్షులు కీటకాలు తమ
పీడిత ఆత్మల్ని మోసుకుంటూ వచ్చి
వృక్షశాఖల్ని ఆశ్రయిస్తాయి
తమ పశ్చాత్తాప నివేదన చేసుకుంటాయి
సృష్టిలో ఉన్న ఎగిరే ప్రాణుల్ని
ఎగరలేని ప్రాణుల్ని పుష్పాలు
సమానంగా పరిపాలిస్తాయి
వాటి జీవితాలకి నిశ్శబ్దసౌందర్య
తత్త్వబోధ చేస్తాయి

మౌనశాఖలో రెక్కలు కప్పుకుని
కళ్ళు మూసుకున్న పక్షి కంటున్న
చిగురాకు కల లోతుల్లో
కావ్యాలంకారాలు వేణువులూదే
శాద్వలాలై తేలుతున్నాయి
పుష్పాల ఆశ్రమ సీమల్లో రంగులు చేసే
ప్రయాణాలన్నీ
కాషాయరంగువై పే

●

తన కన్నుల్లో నీరు తెచ్చుకునే వాడి కంటే
అన్యుల కన్నుల్లో నీరు తెచ్చేవాడే కవి!
ఒరే ప్రజలారా! నేను కవిని
మీరు నాకు అప్పగించబడిన పిల్లలు
మీ ముసలి నమ్మకాలు మీరక్తంలో
భయాల్ని పొదుగుతున్నాయి
మీరక్తం పారబోసి నా కవిత్వం
నింపుకోండి -

నగరపు రాత్రి పులుముకున్న అంధకారంలో
అక్కడక్కడావీథిదీపాలవెలుతురుమరకలు
టాక్సీల నీడల్లో కూర్చుని ఉన్న నిమ్న జాతి
మానవాకృతులు
ఎవరోఆడుకుంటూవిశిరేసినపేకముక్కలు
చిరిగిన బట్టలు మురికి మొహాలు
లారీ క్లీనర్లు జేబుదొంగలు
ముద్దలు ముద్దలుగా కనిపించే
ఇంప్రెషనిస్టు చిత్రాలు
ఓహ్! అవి మానవుడు రాతిమీద
రాశిన జీవిత కథలు
కాలాంతర పండితులకు పరిశోధన సామగ్రి
ఇప్పుడు నాకు అశ్రువుల సముదాయం -

నీ శబ్దాలు అద్దాలుగా మార్చుకోగలిగితే
నీవు పట్టుకుంటావు వాటితో పర్వాతాల్ని
నిశ్శబ్దాక్షరాలు ఉచ్చరిస్తున్న
పద్మాసనాసీన పర్వతాలు
గొంతెత్తి పాడబోతున్న తామరపువ్వు నీడలో
కూజితం చేస్తున్న జలవిహంగం -



ఒకనాడు అతడు దేవతల్లో కలుస్తాడు
ఆకాశం నుంచి తన ప్రజల్ని చూస్తాడు
ఒక దూరదూర చంద్రగ్రహం మీద ఆడుకుంటున్న
బాలబాలికల్లా కనిపిస్తారు -
అతనికి అదిదూరాన్నించి కనిపించే
టెక్నికలర్ సినిమా
వాళ్ళు ఆయుధాలు పుచ్చుకుని ఒకర్నొకరు
వధించుకుంటూ ఉంటే, రక్తప్రవాహాలు
దశదిశలా ప్రవహిస్తూ ఉంటే అతను ఏడుస్తాడు
నిస్సహాయుడై
అతని చేతులు అంతదూరం చేరలేవు
అతని గొంతు ఆకాశపు అనంతత్వంలో

ఇరుక్కుపోతుంది...
అతని వాళ్ళ కోసం భావాలతో శబ్దాలతో
నిర్విరామ కృషి చేశాడు
అతని ఉపకరణాలు విశ్రాంతి ఎరగవు
పొలాల్లో కర్షకులు, ఫ్యాక్టరీల్లో శ్రామికులు
ఆఫీసుల్లో గుమాస్తాలు ఆవారాకవులు తుపాకి
దాల్చిన సైనికులు
వీరందరు తమబంధంలోకి ఆకర్షించిన తన ప్రజలు
వాళ్ళెవరికీ ఇతనెవరో తెలీదు
అతను అస్పష్ట మానవుడు ఒక
అల్ప కవితాకాండిల్‌తో,
కబళించే అంధకారాన్ని ఎదుర్కొనే వాడు -
ఎవరూ శాశ్వత సముద్రాల్లా అతని కన్నుల్లో
ఊగిసలాడే అశ్రువుల్ని చూచి ఉండరు
శబ్దాల మధ్య శూన్యం, ఏదయితే ఉందో
కవితోపాటు దాని దీర్ఘత్వం పెరుగుతూ పోగా పోగా
అతని చేతిలో పనిముట్లు నిశ్శబ్దంలోకి
జారిపోగా
నిస్సహాయ అభౌతిక జగత్తు చేరి దేవతల్లో కలిశాడు
అతడు !
భూమి మీద ఉన్నప్పుడు అతన్ని ఎవరూ ఎరగరు!



ఏమిటీ వెర్రి కోలాహలం
నాగొంతులో తుఫానులు కూర్చో ఉన్నాయి
ఎక్కడో ఆలోచనలోతుల్లో ఇరుక్కో ఉన్న
ఒక ఒంటరితనం
ఒంటరితనం లోతుల్లో గర్జిస్తున్న
జనసమూహాలు....

రాజవీథుల్లో కవాతు చేస్తూ
మొరిగే సైన్యానికి రాత్రీ పగలూ
భేదం తెలీదు
దొంగముఖం దొంగగుండెను కప్పు
గలదే గానీ, మరచిపోకు
నీటి మీది బుడగల్లా మనుషులు
భూమి మీది బుడగలు

లోకంలో ప్రతివస్తువూ పుస్తకంగా
మారడానికే పుట్టిందన్న విశ్వాసంతో
ప్రారంభించాను ! నేటికి అది మారి
పుస్తకం కంటే రాయే యోగ్యమైన
వస్తువని తెలిశింది !
,రాయి అంటే చేతిలోది, మందిరం
లోది కాదు......

అవి తాళపత్రగంధాలు కావు
ప్రాచీనదేవతల శిథిలాలు
అక్కడచెదపురుగులుఋషుల్ని
దేవతల్ని తిని బలసిన తమ శరీరాల్ని
మోస్తుంటాయి
నిన్నెప్పుడూ దేవతలు కలవలేదు
నీతో కలిశికూర్చుని ఎప్పుడూ ఒక
కప్పు కాఫీ కూడా తాగలేదు
దేవతల్నే తిని జీవించే చెదపురుగులకే
లేని ఆధ్యాత్మిక చింత నీకెందుకు
అదే నాచింత!

భిక్షగాళ్ళకు కూడా పిల్లలున్నట్లూ ఆ
పిల్లలు కూడా పుస్తకాలు చదువు
కుంటున్నట్లూ ఎందుకనుకుంటావు ?
దేవతలక్కూడానీరూపాన్నే .
ఎందుకు ఆరోపిస్తావు ? తెలుసుకో
మాదగ్గర ఆయుధాల్లేవు కానీ
రాళ్ళున్నాయి ! రాళ్ళు కూడా
లేకపోతే ప్రాణాల్నే రాళ్ళుగా
విశిరేస్తాము

చలో, హృదయముంది
ద్రవించడానికి
అశ్రువులున్నాయి
కార్చడానికి
పద జీవన మైదానాల్లోకి
మబ్బులు జల్లులు చల్లుతున్నాము
ఇంద్రధనుస్సుముక్కలు
రాలుతున్నాయి
పద మహాజనోత్సవంలో
పాల్గొందాం...



కొమ్మల్లో పక్షులు కిలకిల్లాడుతున్నాయి
కాలం ఎగిరిపోతోంది
ఆకుల్లో కిరణాలు మిలమిల్లాడు తున్నాయి
కాలం ఎగిరిపోతోంది
వీథిలో పిల్లలు గోలచేస్తున్నారు
కాలం ఎగిరిపోతోంది
స్వప్నాల వనాల మీద గ్రద్దలు ఎగురుతున్నాయి
కాలం ఎగిరిపోతోంది

నాయింటి మీద నాఒంటి మీద పక్షుల నీడలు
ప్రవహిస్తున్నాయి
కాలం ఎగిరి పోతోంది



లోకం ఒక విశ్వాసాల గూడు
కుక్క అనంతత్వాన్ని కొలిచేస్కేలు
వాస్తవాల కోరల్ని చూచి
పారిపోతుంది దినం
నక్షత్రాలు దాల్చిన ప్రేయసి అర్ధరాత్రిని
గ్రామ వీథిలో కూర్చుని పిలుస్తుంది
మోర ఎత్తి భైరవుడు
ప్రవహించి పోతున్న కాలం ఒక
మౌనవాహిని -



ఒక్కోసారి అనిపిస్తుంది గడియారంలో రెండు చేతులూ సర్కస్ ఫీట్సు చేస్తున్న వ్యాయామకళాకారులు కాదు ; మన జీవితాన్ని కాలంగా మార్చే కళలో భాగస్వాములు ! సృష్టిలో ప్రతివస్తువులో ఈ రెండు చేతులూ ఉండి బ్రతుకును కాలంగా మారుస్తుంటాయి కాబోలు -రాలే ఆకులూ, ఎగిరే పక్షులూ, ప్రభాత గగనంలో కరిగిపోతున్న మంచు ముక్కలాంటి చందమామ - ఇవన్నీ కాలరేఖని కలుసుకోడానికి ప్రయాణాలు చేస్తున్న వస్తువులే-గడియారం గంటలు కొట్టినప్పుడు అతడికి తెలుస్తుంది తానూ ఒకప్పుడు రాగాలోలికే తాంత్రమతంత్రిగా ఉండేవాడని - రాగశక్తి మనిషిని స్మృతులుగామార్చి కాలంలో కలిపివేస్తుంది.

అవి మాసిపోయిన బంగారవు ఫ్రేముల్లో వెలవెలబోతున్న తైల వర్ణచిత్రాలు కావు - శతాబ్దాల గ్లాసుల్లో నుంచి మనవైపు చూస్తున్న ఆత్మల ఇంద్రధనుఃఖండాలు !

విశాల వృద్ధ వృక్షాల నీడల్లో కలధ్వనులు చేస్తున్న నరనారీసముదాయమూ! స్వచ్ఛమైన ఉల్లిబంతుల్లా కొండచరియల మీద సంచరిస్తున్న గొర్రెల గుంపులు ! గొర్రెల కాపరి పెదవుల మీద

కాలపు భూతద్దం దీర్ఘీకరించిన పిల్లనగ్రోవి ! మనస్సును శాంతిమయభంగిమకు తెచ్చుకుని పరచిన హరిత శాద్వలం మీద వంగి, పడుకున్న శూన్యం - ఇవన్నీ జ్యోతిర్మండలదూరాల్ని దాటుతూ అనంత ప్రయాణం చేస్తూ అలసిపోతూ వాతావరణపీడితం అవుతూ మనల్ని చేరుతున్నాయి....

ఆ తైలవర్ణాత్మక రూపాలూ శిలల మీదా శబ్దాల మీదా చెక్కిన మోహన మూర్తులూ అన్నీ కాలమనే సర్వభక్షక రాక్షసి మీదికి విడుదల చేయబడిన కళాత్మక క్రూరమృగాలు ! ఏ చేతినుంచి కళజన్మిస్తుందో ఆ చేయి సృష్టికి గర్భ స్థానము - సృష్టి కాలం మీద జరిగే శాశ్వత దండయాత్ర



*బయట గ్రీష్మకాలం వస్తువుల్ని ఎండలో స్నానం*
*చేయిస్తోంది*
*అలసిన జీవుల అశబ్దత వ్యాపిస్తోంది*
*ఏదోరాగం జీవితాన్ని పోగుచేసుకుని*
*పోతోంది దూరదూర కాలవలయాలుగా*
*వలయాలుగా మారి -*

ఎండలో నుంచి ఇంట్లోకి వచ్చి
ఎన్నో స్మృతుల్ని నిద్రలేపే కందిరీగ
ఒకరెక్కలొచ్చిన తంబుర-

మౌనముద్రదాల్చి నుల్చో ఉన్న వృక్షమూ
గాఢనీలిమ కప్పుకుని నిర్లిప్తంగా
చూస్తూ ఉన్న ఆకాశమూ కలిశి
నన్ను ఒక విషాదమయనిశ్చల జీవన
తైలవర్ణచిత్రంలో వ్యక్తం చేశిన శూన్యసీమలో
తేలుతున్న పక్షిరెక్కలా నిలిపాయి

గాలి చనలం కోల్పోయి వ్రేలాడు తోంది!
చలనిశ్చల ప్రపంచాలు రెండున్నట్లు
వాటిమధ్య రేఖగీస్తూ ఒక పక్షి
ఎగిరిపోయింది

నా కిటికీ గ్లాసులో నుంచి కనబడుతున్నాయి
దూరపు కొండలు కొండల మీద పచ్చటి
బిందువుల్లాంటి చెట్లు
మనుషుల కాళ్ళు చేశిన బాట
సజీవంగా వంకరటింకర్లుగా క్రిందికి
ప్రాకివస్తోంది - ఒక సరీసృపంలా .......

దగ్గర ఒక ఋషిలాంటి యూకెలిప్టస్ చెట్టు
కొండల వెనక లేచే పెద్దమబ్బుల్ని చూస్తోంది
ఎండలో నుల్చుని ఎందుకో నిరీక్షిస్తూ
ఒక ముసలి ఆకు - గాలిలో విలాసంగా ఊగుతూ
ఆగిన ఆకు - భూమి వేసిన పాశంలో చిక్కి వెనక్కి తిరిగి
తన కొమ్మను చూస్తూ చూస్తూ కొమ్మను
విడుస్తోంది



కిటికీగ్లాసులో ఏదో ఒకవింత మృగం వింతముఖం
గ్లాసుకు ఆనించిన పెద్ద అరచేతుల్లో గీతలు
గ్లాసుకు నొక్కిన ముక్కు గుహాల్లాంటి నల్లటి తొర్రలు
నల్లటి అగ్ని గోళాల్లాంటి కనుగ్రుడ్లు - ఆచూపుల
ప్రభావం అగ్ని
భూగర్భంలో శతాబ్దాల వెనక బొగ్గుగనిగా
మారిపోయిన నాచెట్టు శరీరాన్ని స్మృతికి తెచ్చాయి
నేను లేచి గదిబయటికి వచ్చా గబగబా
తలుపువేసుకుని మరోగదిలోకి వచ్చి చూస్తే
ఆతలుపుల్లో నుంచి బయటికి వచ్చి నుల్చుంది
ఆమృగం

శబ్దం లేని వికటాట్టహాసం చేస్తూ -
ఆ శబ్దం వినబడదో లేక అది వినబడని శబ్దమో
నాగుండె మునిగి పోయింది ఒక్క క్షణం
గుండె తాళగతి తప్పింది
ఎక్కడికి పారిపోవాలో కాళ్ళకు తెలీదు
ఆ ఆకారం ముందుకు వస్తోంది తలుపుల్లోనుంచి
గోడల్లోనుంచి
అన్ని వస్తువుల్లోనుంచి బయటికివచ్చి నట్లే
నాశరీరంలో నుంచిదాటి
నడిచి పోతోంది
నా మెదడుని ఆపిల్‌లా నమిలేశింది - పెదవుల్నించి
ముక్కలు.......
నా నరాల్ని పాయసంలో సేమియాల్లా
వేళ్ళతో నోట్లో వేసుకుంటోంది
నా కళ్లను పీకివేసింది
శతాబ్దాల క్రితం ఆగిపోయినగడియారపు మృత
శరీరం
వ్రేలాడుతోంది గోడగుండె మీద !
నాభార్య కెవ్వున కేకవేశింది చూడమంటూ
చూస్తే, చేతుల చుట్టూ తెల్లటి మంచుగడ్డలు
పొడిపొడిగా
పేరుకుంటున్నాయి ... శరీరం అంతటా క్రమంగా

తెల్లటి కోటులా అల్లుకుంటున్నాయి
ఎక్కడికో పరుగెత్తుతోంది పారిపోయి రక్షించుకోడానికి
ఇంట్లో అందరూ అలాగే ...

ఎక్కడికోపారిపోతున్నా నుహిమపంజానుంచి
తప్పించుకోడానికి
అగ్ని నుంచి తప్పించుకోడానికి పారిపోయి
ఇక్కడికి వచ్చి హిమపంజా ఇనపపిడికిట్లో ఇరుకున్నా!
ఇక్కడ నాలో ఉన్న అగ్ని నా నాసికారంధ్ర
ద్వారాలదగ్గర నుల్చుని పోరాడుతోంది తెల్లటి
మంచుతో,
లోపలికి రానీ కూండా

ఐదంతస్తుల కిటికీ గ్లాసులో నుంచి కనిపిస్తున్నారు అగ్నిమేఘాల్లోనుంచి పరుగులు తీస్తున్న మనుమలు శరీరాల మీద జ్వాలలు రేగుతుండగా పరుగులుతీస్తున్నారు ! ఒంటి మీదే రేగుతున్న అగ్ని నుంచి తప్పించుకోడానికి ఎక్కడికో పరుగెత్తుతున్నారు మెదడుకోల్పోయిన మనుష్యులు !

మట్టయి పొడిపొడిగా రాలిపోతున్నాడు మనిషి నాలోపలమంచుగడ్డ పగిలి జలపాతంలా బయటికి

పారిపోయింది ధ్వనులు చేస్తూ - మస్తిష్కవిస్ఫోట లోనించి సహజమానవ స్థితిలోకి రాగానే తెలిసింది ఇది ఆక్షణంలో వ్యక్తమయిన స్వయంభూ రచన అని !!



*సూర్యుడు వెళ్ళి పోయాడు*
*ఆకాశపు ఉత్తరమండలం విడిచి*
*మా బాల్కనీ దర్శించడం మానేశాడు*
*నా తడి తువ్వాల్ని మరచి*

*మండిపడుతున్న గ్రీష్మం*
*తటాల్న ఆవిష్కరించింది*
*నీడ దైనందిన నేత్రానికి*
*స్ఫురించని ఒక పదార్థం అని*

*ఇవాళనా జీవనయాత్ర తెలిపింది*
*చెట్టు పరచే ప్రతినీడ*
*చెట్టు వ్యక్తిత్వపు సంపూర్ణ*
*సారాంశం అని*

శతాబ్దానికి విరిగింది వెన్నెముక
శతాధిక గ్రంథాలభారం మోయలేక
మనిషి నలిగిపోయాడు ఎప్పుడో
ఇతిహాసపు ఇనప చక్రాలక్రింద

ప్రతి శతాబ్దమూ ఒక ప్రియస్వప్నం కంటుంది
పల్లకీ ఎక్కించి దాన్ని ప్రజలచేత మోయిస్తుంది
నినాదం చేసిదాన్ని దశదిశలా అరుస్తుంది
పూజారి అయ్ దాన్ని మతంగా మార్చి వేస్తుంది

స్వర్ణం లాంటి రక్తంతోకూడా
స్వప్నాలు శాశ్వత వాస్తవాలుగా మారలేదు
మూర్ఖులే గ్రహించలేరు
పరిణామంకూడా పరిణామ గ్రస్తం అని

ఏమెరుపు అయితే గర్జించి ఆకాశాన్ని
శతకోటి శకలాలుగా ఛేదిస్తుందో
నక్షత్ర మండలాల్ని గజగజ వణికిస్తుందో
అదే రెండో క్షణం అక్కడ లేదు
కానీ నేలమీద కుర్చీ ఎక్కిన వాడికి
వాడి శాశ్వతత్వంమీద ఎంత అచంచల విశ్వాసం !

తినడానికి గడించాలి చేతులు
ఏదన్నా పనిచేశి
తినడానికి గడించని చేతులు
పనిచేయనివాడు చెప్పే నీతులు
ఆకాశంలో అష్టమి చంద్రుడు
బిడ్డా ! నీ ఆకలి కందని అన్నపు ముద్ద

డాములెన్ని ఉంటే ఏమి భూమిలేని వాడికి
పరుగెత్తే ప్రవాహాన్ని బంధించడమెందుకు
మనిషిని మనిషే చంపే మతాలనే వెందుకు
మనిషిని పశువుగ మార్చే మందిరాలు ఎందుకు
అశ్రువులను తుడువలేని అధికారం ఎందుకు
నలుగురితో మాట్లాడని నాయకత్వ మెందుకు
అక్షరాల శక్తి ముందు ఆయుధాలు ఎందుకు
అధర్మాని ఖండించని అక్షరాలు ఎందుకు
కొమ్మల్లో పక్షి జన్మ కోటి రెట్లు మంచిది
అందరినీ పాటపాడి అలరిస్తున్నందుకు

ఒకనాటి దీపాల సమూహాలన్నీ పోగా
ఏకాకిగా వెలుగుతున్న దీపకాంతిలో
మౌన స్తంభాల్ని అడుగుతాను
ఈ ఉనికి విసుగునుంచి

నన్ను రక్షించలేరా అని
ఎక్కడికీకదలకుండా
అక్కడే ప్రతి ఏడూ పూచే గుల్మొహర్లని
అడుగుతాను నన్ను రక్షించలేరా అని
అందరూ నాకంటే గొప్పవనుకునే
అత్యున్నత భవన కుడ్యాల్ని అడుగుతాను
ఎప్పుడూ తమ గొప్పతనం చాటుకుంటూ
ఒకేచోట పడి ఉన్న వెనీషియన్ ఫర్నిచర్ని
అడుగుతాను
పర్షియన్, కార్పెట్లని అడుగుతాను
ఈ ఉనికి విసుగునుంచి రక్షించలేరా అని
అన్నీ దీన స్వరంతో చెపుతాయి,
మేమూ నీలాగే మారని దృశ్యాలు
చూస్తూ
వంద ఏళ్లనుంచీ పడి ఉన్నాము
నీకంటే పాత ఖైదీలము !



అగ్లాసుకేసులో ఉన్న గడియారంలో అవి
రెండు చేతులు కావు ఆరెండూ కలిశి ఒక యోగి !
తన నడుము ఇరుసుగా హేర్‌పిన్ ఒంపుల్లాంటి
ఒంపులు వంచుతాడు ! తన శరీర ఊర్ధ్వభాగాన్ని
తలక్రిందులు చేశిన చంచాలా, శీర్షాసనంవేస్తాడు
గడియారపు వ్యాసాన్ని కొలుస్తున్నట్లు పడుకుంటాడు
ఒక పెన్సిల్, కన్యలాంటికాగితం మీద పడుకుని,
కావ్యాత్మక ధ్యానంలోకి మునిగిపోయినట్లు-
లెటర్ బాక్సు తన చివరిశ్వాస ఎప్పుడో విడిచి పెట్టే
శింది
కానీ చివరి శ్వాసను చేరుకుంటున్న మనిషిని
అతడు చేస్తున్న పురోగమన తిరోగమనాల్ని మధ్య
ఒక మెటఫరై గమనిస్తూ ఉంటుంది.

ఆ మనిషి కోర్కెలు - మృతపక్షులూ చితికిన పళ్ళూ; ఆమనిషి ప్రవహించని కాలానికీ ఎప్పటికీ రాని ఉత్తరానికీ మధ్య ఊగులాడుతోన్న ఒక వ్యాకరణ పీడిత వాక్యం అతడు నడిచేదూరం గ్రహణ కాలంలో తమోబింబం కబళించబోతున్న అస్పష్టకాంతి వలయంతో సమానం అతడు ఒక ఇంద్రజాల సముద్రం మీద తేలుకున్నఅద్భుత కధకు ఉదాహరణ

తన నాలుగు గోడలు దాటి ప్రవహించడం
ఆగిపోయిన మనిషి
గడియారానికీ లెటర్‌బాక్సు కూమధ్య ప్రయాణం
చేస్తున్నాడు
కుండలీకృత సర్పాలముద్రలున్న కుర్చీల్లో
శతాబ్దం క్రితమే కాంతి విడిచి పెట్టినా
ఇంకాఇంటి కప్పు పట్టుకుని వ్రేలాడుతున్న పురాతన
ధూళి ధూసరిత షాండిలీర్లలో తన అస్తిత్వాన్ని
పారేసుకున్న మనిషి
ఒకటి రెండు పిచ్చుకలు, మధ్యాహ్నకాలదూతలు
కిటికీలో నుంచి ఎగిరి వచ్చి షాండిలీర్ల మీద
కూర్చునే
రెక్కలఅతిథులు- వాటి స్పర్శతో పులకించి
షాండిలీర్ల ద్రాక్షాగుచ్ఛ శిల్పంలో వ్రేలాడే గ్లాసు
శలాకలు
మూర్ఛ వచ్చే రాగస్వరా వళిని విడుదల చేస్తాయి
గాలిలోకి



యౌవనం తరుముతుంటే సాహసం దౌడు తీస్తున్న రోజుల్లో కందల్లో కోర్కెలు ఆడవుల్లో సింహాల్లా విహరించే రోజుల్లో మెరుస్తున్న కారుల్లో క్రిక్కిరుస్తున్న అందాల ముద్దల్ని తిందామని మెదడు కీళ్ళు కిర్రుకిర్రు మంటున్న రోజుల్లో నా ఊహానగరాల్లో ఇల్లు లేని వీధులే ఉండేవి ! అది ఆనకట్ట లెరుగని ఆనంద ప్రవాహం

ఆ ఆనందాన్ని అందిస్తున్న చేతిని కన్నెత్తయినా చూడలే దెప్పుడూ ఏ దేవుడికి కృతజ్ఞత చెప్పాలో అనికూడా ఆలోచించలేదు కించిత్తు పరధ్యానంకూడా మలినం చెయ్యనీకుండా జీవితాన్ని జుర్రుకుంటున్నకాలమది ! నది దొర్లి పోతుంటే నిద్రిస్తున్న తీరాల్లాంటి రోజులు ఆనాడు అతడే తన కాలానికి కేంద్రం ఆనాడు తనచుట్టూ పరిభ్రమిస్తున్న చిత్రం పేరే ప్రపంచం

ఒక శుభలగ్నాన కడుపులో ఒక కాయకాచింది లోకమే మారిపోయింది కేంద్రంమరోకచోటికి కదిలి పోయింది మరో పెదవులకు సుఖం అందివ్వడంలోనే సుఖాన్ని ఆస్వాదించడం మొదటిసారి ఆత్మనేర్చుకున్న విద్య

ఆసుఖసంపాదనకోసమే రస్తాల్లో పరుగులెత్తి పరుగులెత్తి కండల్లో ఉన్న సింహాలు అన్నీ కరిగి చెమటయ్ కారిపోయాయి. ఇప్పుడు మనిషి కండల్లో శిశువులే ఉన్నారు ఆశిశువుల కన్నీటి కిటికీల గుండా రస్తాల్లో శిశువుల కన్నీరు కనిపిస్తోంది ఇప్పుడు. ప్రపంచవైశాల్యమంతా ఒక్కసారి కన్నీటి కిటికీలో ఖైదీ అయిపోయింది. ఇప్పుడు అతనికి సొంత సుఖాలేమీ లేవు - సుఖముందిగానీ అది తనవాళ్ళకోసం తననికోల్పోవడంలోనే ఉండి. నా వాళ్ళు అనబడే మాటే సాగిసాగి అతడొకసుదీర్ఘ నదిఐ దేశాన్ని పెనవేసుకున్నాడు.

ఇల్లు తీగెలున్న ఒక సితారు ; తీగెల్లున్న సితారు మీటితే రాగాలొలుకు తుంది ; తీగెల్లేని రోడ్లను మీటితే ఏరాగాలు పలుకుతాయి ? స్వచ్ఛమైన మానవసామగ్రి తయారయ్యే కర్మాగారం ఇల్లు. ఆత్మ పరిమళాలు చిమ్మే వాక్యాలే భాషగా ఉత్పత్తి అయ్యేచోటు. ఇక్కడే మనిషి జీవనదావాగ్నిని చిరునవ్వుతో తాగి కవిగా ఉద్భవించాడు స్వర్గ శిధిలాల్లో నుంచి పారిపోయి వచ్చిన దేవతలు కూడా తలదాచుకునే చోటు

ఇల్లనేది ఒక మహాగ్రంథం ! మృగంగా ఎక్కడో బయల్దేరి దీర్ఘప్రస్థానం చేశిన మానవుడు చివర

చేరుకున్న అంతిమ మజిలీ ఇల్లు సంపూర్ణ మానవుడి దేవాలయం ! ఎక్కడ క్రౌర్యం బలి ఇవ్వబడుతుందో ఎక్కడ కన్నీళ్ళతో చెక్కిన సౌందర్యశిల్పానికి ఆత్మకర్పూరం జ్యోతిగా వెలిగింపబడుతుందో ఎక్కడ సంస్కృతీ నాగరకతలు పురోహితుడుగా పూజారిగా నవుకరీలు చేస్తాయో ఎక్కడ పుస్తకాలు పుడతాయో ఎక్కడ దేశాలు లేచి నిలబడతాయో అదీ ఇల్లు !

ఇల్లంటే రాళ్ళ కుటుంబం కాదు -



*భూమి మీది ప్రేమికులు, సాక్షులు కావాలనుకుంటే*
*ఎందరో ఆకాశంలో ఉన్నారు*
*చంద్రుడూ, గుంపులుగుంపులు నక్షత్రాలూ -*
*నాగరకతల్ని సృష్టించే దేశాలూ*
*నాగరకతలకు నాయకులూ ఎవరో*
*వారే గాయపడ్డవారు, కన్నీరు*
*బుగ్గల మీదనుంచి దొర్లుతున్నవారు*
*మృత నాగరకతలు మాత్రం బానిసత్వపు*
*నులివెచ్చని సుఖంలో, సోమరితనంలో*

అవినీతిలో అవయవాలు ముడుచుకుని
హాయిగా నిద్రిస్తున్నారు
వారు కష్టసుఖాల భేదమెరుగని యోగీశ్వరులు

కవితా శాఖమీదపూచిన పుష్పం బాష్పం
బాష్పగర్భంలో నుంచి జన్మించే శిశువు కవిత

ఓ ప్రభూ !
ప్రేమానురాగాలు అసలు జీవన పదార్థమనీ
మిగిలిన వన్నీ మిథ్యఅనీ చిరకాలం
ఎరగ లేక పోతిని - వాటిని నా అజ్ఞానంలో
కాళ్ళతో తొక్కు తూవెళ్ళి పోతిని
వాటిని నాలో ఉన్న భయానక స్మశానంలో
పాతి పెట్టితిని - భూగోళం నా చుట్టూ
తిరుగుతోందను కుంటిని - ఈ అజ్ఞానానికి
నన్ను నేను ఎంతగా బలిచేసుకున్నానో
నే నెరగనైతిని -
ప్రభూ ! నన్ను పిలిపించుకో! నన్ను
నిర్దాక్షిణ్యంగా శిక్షించు-

సీసాల్లో ఆసవం లేదు
తోటల్లో వసంతం లేదు
కాలం జాలం చేస్తుంటే

కల ఇంద్రజాలం చేస్తోంది
ఈ జ్ఞాపకాలతో ఇంతచెలిమి ఎందుకో
మాటిమాటికీ పోతుంది వాటివైపుకే మనస్సు

ఒక్క కల ఇవ్వు దేవుడా అంటే
అదే బ్రతికిస్తుంది నువ్వున్నంతకాలం అన్నావు
ఇప్పుడు ఈ కోర్కెల తుఫానుల్లో
చూడు, దిక్కులేని పడవలా ఉన్నాను

నీలిదారుల్లో వేలు పట్టుకుని చంద్రుడు
నడిపించుకుపోతున్నాడు తెలిమబ్బుతునకను
నేలమీద విలపిస్తున్నాయి కలకంఠంతో
నగ్న యువతుల్లాతలపులు -
నిశ్శబ్దంగా కురిసే వెన్నెట్లో
నిశ్చలంగా తడుస్తున్న అడవులు

ప్రొద్దు టెండలు బంగారురెక్కల మీద వచ్చి వాలుతాయి
సాయంకాలం గులాబీ రెక్కల మీద ఎగిరి పోతాయి
రాగాన్ని పూసుకున్న తెలిమబ్బులు మాత్రం
సంధ్యను కోల్పోయి అంధకారంలో మునిగి పోతాయి.

చిక్కు పడ్డ దారాలు జీవితపుదారులు
నీవాళ్ళెవరుకారో నీకు తెలీనీవు
నీవు నిలబడ్డ భూమి కూడా రేవు
నిన్ను వంచించదని చెప్పలేవు

కష్టాల్లోనే నీ ఒంటరితనం కనిపిస్తుంది నీకు
లక్షలాది నడిచేనడిబజారు
నచ్చుచెపుతుందీనగ్నసత్యం
ఎదలో చెలరేగే గోలకు
ఎదటి గోల వినిపించదు

ఎదురు చూస్తున్నావు ఎడారిచిరునవ్వు కోసం
కోర్కెల సమిధల్ని బాధల జ్వాలల్లో వేస్తూ
బ్రతుకు భస్మంఅవుతుందో జ్వాలల్నించి
ఒక నవజీవన ముదయిస్తుందో!



అదిగో వినబడుతోంది
మానవుడి తడబడే అడుగుల చప్పుడు
దేవాలయాల గోడలు పట్టుకుంటూ
రక్తధారలు కార్చుకుంటూ వస్తున్నాడు
ఏగోడల నీడల్లో కాళ్ళు విరిగిన దేవుడు
కన్నీటి మడుగుల్లో పడున్నాడో
ఆగోడలమీద వాలుతూ తూలుతూ
వస్తున్నాడు
తన నిస్సహాయతకు తనని తానే
కనికరించు కుంటూ కాలపు ఇనపగుండు
బుజానమోస్తూ వస్తున్నాడు

నిష్క్రమించే శతాబ్దాలనిర్మాణాలు
కూలిపోతూ ఉన్న ధూమ్ర మేఘాల్ని
చూస్తూ
ఉదయించని ఉషస్సులకోసం
ఉత్కంఠతంతో నిరీక్షిస్తూ-
యుగాంతాన మనం వంచితులంగా మిగిలిపోయాం
యెదలు భగ్నమైన ఎండలు శాంతి కోల్పోయిన
గాలులు
విషాదం తొణికిసలాడే వానలు మనబంధువులుగా
మిగిలిపోయాం

సోదరా నిరాశకు లొంగకు
గాయాలు కూడా నవ్వుతాయి
యెదలో కోకిల పాడుతుంది
ఋతువు వికసిస్తుంది



గాలిచేత గాయాలు తిన్న ఎండుటాకుల్లారా,
ఎగిరిపోకండి -
నాకు తెలుసు, మీ తలపులు తోటల్లో ఒకదా న్నొకటి
తరుముకుంటూ పరుగులెత్తే సీతాకోకచిలుకల్లా
ఉండేవి,
మీరు కన్న కలలు, కొమ్మల్లో రంగురంగుల రెక్కలు
తొడిగి నాట్యం చేసేవి,
కానీ ఈ నాడు మీ మనస్సు, విరిగిన ఇంద్రధనుస్సు,
కలలుంటాయి కన్నీళ్ళుంటాయి
గాలికెగిరి పోవద్దు -
జీవితం ఎన్ని గాయాలు చేసినా
నేను మాత్రం దాని కొంగు విడువను
ఈ చెత్తకుండీల్లో పువ్వులు వికసిస్తాయనుకోవటం
నీదే తప్పు -

నీ కలని రెండు చేతుల్తో పుచ్చుకొని, ఎక్కడ జారి
పడుతుందో
అని ఎందు కలా ఎదకు హత్తుకుని నడుస్తావ్ ;
ప్రవహించే కాలంలో పరుగెత్తే రంగులచేప, జీవితం ;
కన్నీళ్ళ వలల్లో పడదు, కలల గాలానికి తగలదు -
రెక్క కొమ్మల్లోఇరుక్కోకుండా
ఎగిరిపోయే పక్షిదే సుఖం ...
అరే ! బాధ చూచి నా కళ్లు కన్నీళ్లు కారుస్తున్నాయి ;
నేను మనిషినన్న స్పృహ ఇచ్చే తృప్తి,
మరేదీ నా కివ్వదు.
ఆకాశపు నీలికన్నుల్లో తారలనే అశ్రువులు నిండాయి.
నాకు తెలీదు కానీ వాడికి తెలుసు
ఈ నాటకం ఎలా మొదలు పెట్టిందో ఎలా అంత
మవుతుందో
అడవుల్లో అశాంతితో పరుగెత్తే దావాగ్నిని నేను
తెలిమబ్బుల మందల్లోనించి వడిగా
ఒక తార వైపుకు పరుగెత్తే చిరుమబ్బును నేను
బాధల్లో మునుగుతాను సంతోషాల్లో ఉదయిస్తాను
నేను మానవ సూర్యుణ్ణి



విప్లవ భాషావిధాత కవిసేన మేనిఫెస్టో ప్రణేత బుధజన విధేయ శేషేంద్ర నామధేయ కవివర్య ప్రణీత ఆధునిక మహాభారతస్య అనుబంధకావ్యం జనవంశమ్ లో భ్రమరకాండ సమాప్తం

# ప్రజాకాంద

నేను చూచిన కాలపు అద్దంలో
సంవత్సరాల అడుగులు కనిపించడం లేదు!
చెట్లు అర్థవైనాల్లకు పైగా
ఆకులు రాల్చుకోవడం చూచాను
ఆకలి తన చెమటబొట్లని
రాల్చుకోవడం కూడా చూచాను
మొదటి సైకిలు మా గ్రామంలోకి
ప్రవేశించడం నుంచీ మనిషి చంద్రుడి మీద
కాలు మోపడం దాకా చూచాను
ఒక కొత్త ఆకాశం ఒక కొత్త దేశం మీద
నక్షత్రాల జల్లుల్ని కురవడం
ఈ శతాబ్దం చూస్తుందని ఆశించాను
కానీ - ప్యారిస్ నుంచీ పెర్ల్ హార్బర్ వరకూ
బాంబుల వర్షం చూచాను
సుమేరియన్ నాగరికతని సృష్టించిన
రెండు నదుల్లో మానవ రక్తం
ప్రవహించడం చూచాను...
మహోన్నత మానవ నిర్మాణాలు
విరిగి ముక్కలైపోవడం చూచాను
నా అక్షరాలు ఆక్రోశిస్తూ ప్రవాహాలై

పత్రికల్లో ప్రవహించాయి
ఇంకా ఎన్నో సంవత్సరాల్లేవు - ఇప్పుడు
కాలపు అడుగులు కనిపిస్తున్నాయి!
సూర్యుడి చుట్టూ ఇన్ని యుగాలు
తిరిగి తిరిగీ సాధించిందిదేనా
అన్న ప్రశ్న నిఎదుర్కొంటున్న
చరిత్రని చూస్తున్నాను



ఎక్కడికి పోయాయో ఆ పుస్తకాలుగా
మారని రస్తాలు
ఎక్కడికి పోయాయో ఆ రస్తాలు
నా స్వప్నాల్ని కలవడానికి నేను
ప్రమాదాలతో చేతులు కలిపి నడిచినవి
ఇవాళ రస్తాలు చేతులు కలిపిన చోట
ఆశాజ్వాలల ముందు కూర్చుని
నేను చలి కాచుకుంటున్నాను



సోదరా! నక్షత్ర మండలాన్ని
నీ అరచేత్తో పట్టుకుని అలాగే ఉంచు!
వరి పొలాల్లో వెన్నె ఉదయిస్తుంది
ఉదయించిన వెన్నె చూచి చలి
గజగజ వణుకుతూ పారిపోతుంది
కాలం తెస్తుంది ఉగాదిని
మోసుకొస్తుంది కోకిల పాటని
ఉత్తరాన మా బాల్కనీలో వేలాడుతున్న
తువాలుకు సూర్యుడు పులుముతాడు
హిరణ్మయ రశ్మిని



అరేబేటా వాడ్ని మాత్రం నమ్మకు
వాడు జెండా లెగరేశే దొంగ
నీళ్ళున్న చోటికే ఎగిరిపోయే కొంగ
భయపడకు నీ చేతిలో
రాళ్ళున్నాయి రాకెట్లు లేకపోతేయేం
ఛాతీలో గుండె ఉంది
చేతిలో బందూకు లేకపోతేయేం



పోదాం పదండి గోదావరిలోకి అందరం
పుష్కరాలు వచ్చే వరకూ ఎందుకు
తరుముకొస్తోంది అంధకారం రాజకీయ బంధురం-

అహింసా కమండల ధారులు మన అందరికోసం
బడ్జెట్టనే మందుపాతర పరచారు
హాయిగా నడవండిరా అని ఢిల్లీ నుంచి అరిచారు -

ఊరూరా తాటిమీద అరుతున్న చొక్కాల ఆకృతి
సంకేత భాషలో చెపుతోంది మనకు
సర్కారు చేతిలో సాధారణ ప్రజలకు పట్టిన గతి

పత్రిక ముట్టుకుంటే చాలు పాము కరుస్తోంది
రోడ్డు తొక్కితే చాలు బజారు కాటేస్తోంది
సూర్యుడు ఉదయిస్తే చాలు బ్రతుకు ఉరితా
డవుతోంది

ఎన్ని రోగాలైనా సరే ఎన్ని కల మందుతోనే నయం
చేస్తాం అని మంత్రాలు చదువుతున్న భూత వైద్యులు

శాశ్వతంగా పెట్టారు దేశం నెత్తిన
శుష్కప్రజాస్వామ్య శూన్యహస్తం

ఓట్లు మేసి ఒళ్ళు బలిసిన నాయకుడి ముందు
ఏనుగంత రూపాయి ఎలుకై సలాం చేస్తోంది
అరే ఇప్పటికే మునిగిపోయాం గోదావరీ జలంబుల
యందు



మానవుడు అజేయుడు . . . . . . .
మును పైతామహ గర్భకోశ విలసన్మూర్ధన్య తేజ
మ్మవో
అణువై తారకవై మహామహిత బ్రహ్మాండమ్మవై
యంతటన్
వనమై వానరమై యశేషధిషణా వర్ధిష్ణు తేజస్వివై
ఘనవిశ్వా కృతి దాల్చుచున్న నరుడా! గైకొమ్ము
పుష్పాంజలిన్.

భవిత వ్యంబయి దుర్ని రోధమగు నీ ప్రస్థాన
మార్గమ్మునన్
వివిధా కారహిరణ్య కశ్యప సమావిర్భూత భేతాళముల్

గవియుంగాక ననేక శోక ఘటనా కౌశల్య
శల్యంబులన్
భవదీయో జ్జ్వల విశ్వ రూపమహిమా భంగంబు
వాటిల్లునే



కొంగజపం చేయలేను
దొంగల పద్మ వ్యూహం
ఛేదించుట చేతగాదు
జనులకనుల నీరు పితికి
జెండాలుగ మార్చలేను
సుహృద్భావనకు ఎందుకు
సభలు సమావేశాలు ?
ధూర్తుల సామ్రాజ్యంలో
ఆర్తుల హాహాకారం !
ఏ మనిషీ నీకంటే
తక్కువ కాదన్న నిజం
తలపుకు వస్తే చాలు
నీజన్మ సార్థకం
హృదయంలో కారుణ్యం

మాటల్లో మార్దవం
చైత్రంలో చెట్లమీద
చిగుళ్ళలా పుడితే చాలు
ధనమద మధికారమదము
దగ్గర రానీ కుంటే
అదేచాలు పదిటన్నుల
బంగారు సుహృద్భావం!
బిడ్డా! నీ సంగతి మాకు తెలుసు
గ్రుడ్డివాళ్ళు కారు ప్రజలు
నువ్వు త్రవ్వి నట్టిగోతి
లోనీవే పడతావు సుమా!
ప్రజలను దోమలు చీమలు
బల్లులుగా చూడబోకు
వాళ్ళ ఓట్లు నుంచి పుట్టి
వాళ్ళ రాజుననుకోకు
కవులను గుర్తించ లేని
కాలుష్యంకడుక్కో
ప్రజలు కూడమనుషులన్న
సత్యాన్ని తెలుసుకో
లేకుంటే ప్రజాస్వామ
మనే పేరు ఎత్తకు

సుహృద్భావనకు ఎందుకు
సభలు సమావేశాలు !



తెలుసా బిడ్డా ! ఈ దేశంలో రాజకీయ ఋతువు రాగానే
ఓట్ల డబ్బాలకు గర్భ స్రావం జరుగుతుంది -
ప్రజాస్వామ్య శిశువు ప్రసవం ఎప్పుడూ జరగదు !
ఓట్ల వరి కోతలు మాత్రం యథావిధిగా జరుగుతాయి
రాజధానుల్లో ధాన్యాగారాలు నింపడానికి -
చూచారా !! ప్రింటింగు ప్రెస్సులోనే
మర్డరు చేయబడింది పుస్తకం .
గడప దాటలేదు , దాని రక్తం రవీంద్ర భారతి
నిండా పండుగలా ప్రవహిస్తోంది
కవి మూకల్ని దొడ్లోకి తోలి వాళ్ళకూలీ
వాళ్ళమొహాన పారేస్తున్నారు సక్రమంగా
నూతన వస్త్రధారణ చేసుకున్న నేతలు మాత్రం
వట్టిగాలితో చేశిన బెలూన్లు ఎక్కి
ఆకాశ వీథుల్లో విహరిస్తున్నారు నోట్ల
జెండా ఎగరేస్తూ
అప్పుడప్పుడూ బోఫోర్సు మెహతాలు

చేశిన చక్రాల మీద దొర్లే రథాలెక్కి
వాళ్ళు రాజ మార్గాల్లో ప్రకాశిస్తారు -
రోడ్లప్రక్క చేరిగుంపులు గుంపులుగా
నోళ్ళు తెరుచుకుని చూస్తున్న
భారతీయ మనుషుల చెత్తకుప్పల్ని చూచి
మాతృదేశం అంటుంది,
"నా కొడకల్లారా !" మీ మెదడులో
ఎప్పుడు ఉదయిస్తుందిరా సూర్య మండలం ?
మీ చేతుల్లోకి దూర్చిన జెండా లెగరేస్తూ
మీ నాలికల మీద అతికించిన నినాదాలు అరుస్తూ
ఎన్నేళ్ళు ఇలా బతుకుతార్రా ?
చూడండి ఒక్క ఆకు కూడా
కదలడం లేదు మీ మొహాలు చూచి
చెట్లన్నీ సమ్మె చేశాయి
సూర్యుడు కూడా ఉగ్రవాదిగా మారాడు



పక్షులంటాయి "ఈ ఆకాశం లేకపోతే ఏమైపోయే
వాళ్ళమో"-
చెట్లంటాయి, "మేమున్నాము భూమి మీద

మీకాశ్రయంగా
మనమంతా భూమి పుత్రులం, మనకు మాత్రం
భూమి లేదు
ఆకాశమూ లేదు, మేమున్నాం అనే వాళ్ళూ లేరు

పక్షులు గాలిలో ఎగిరే పాటలయితే, ఎగురుతూ
ఎగురుతూ
కొమ్మల్లో ఇరుక్కున్న పాటలు పుష్పాలు!
వసంత రుతువులో రెండూ గుమిగూడి నప్పుడు
ఆ పాటల ప్రవాహంలో పడి లోకం కొట్టుకుపోతుంది
మనం మాత్రం నిస్సహాయ పక్షులం
ఈ జైల్లో కూర్చుని పాడుకుందాం, గొంతెత్తి అరుస్తూ
మన రూపం లేని స్వాతంత్ర్యానికి అదే మన మిచ్చే
అభివ్యక్తి

మన బ్రతుకుల్ని సుందరీకరించడానికి మన పేరుతో
ఈ యుద్ధా లెందుకు ఈ బడ్జెట్లెందుకు
ఇక్కడ మానవసామగ్రి మంచిది దొరకదు ఈ
భారతీయమార్కెట్లో

ఏ ఇంటి మీద సూర్యుడు తన ప్రభాతాల్ని!
కుమ్మరిస్తాడో ఒక స్వర్ణ వర్షంలా - దాన్ని ఎలా

రక్షించుకుంటావో
ఈ బడ్జెట్ ఉచ్చుల్లో నుంచి! వాడు నిన్ను నేరుగా
సూర్య చంద్రులకే అప్పగిస్తానంటున్నాడు!

చీకట్లో దీపం వెలిగిస్తే చీకటికి కోపం వస్తుంది
ఆ చెయ్యి నరికెయ్యి అని ఆర్డరు వేస్తుంది.
నా కవితకు బహుమతులు కోరడం లేదు నా
గొంతుకు జవాబడుగుతున్నాను
మతాన్ని తొలగించానంటావు కానీ నీ అభిమతాన్ని
దారి కడ్డంగా వేశావు
నీవు కొంపలంటిస్తావు నేను గుండెలంటిస్తాను
నేను కవిని నీ వెవరో అందరికీ తెలుసు - గీటు
రాయికి బంగారం నిలుస్తుందిగానీ పదవి నిలవదు
ఎన్ని అందమైన నక్షత్రాల రాత్రులు నా కలల్లోకి
దూకుతాయో
నేను అన్ని కన్నీటి బిందువులు కోల్పోతాను - నీకు
తెలీదు
ఒక్కపాట కోసం బ్రతుకంతా అర్పించాను
జీవితపు పాదాల ముందు

ఇప్పుడు-చైత్ర మాసపు పెదవులకు మధువు
లందిస్తున్నాయి పువ్వులు

పోయిన కోకిల విడిచిపెట్టి పోయిన గూట్లో
నేటి కోకిల పాటలు పాడుగుతోంది
మెదడులో నిద్రిస్తున్న నదులు మేల్కొని
ప్రవహిస్తున్నాయి
మాకు మాత్రం టయం లేదు ఈ తమాషా చూడడానికి
ఆకాశం నిండా జెండా లెగురుతున్నాయి
పరుగెత్తండి అదేమిటో అందులో చేరుదాం



ఉదయ మారుతంలో ఊగే కొమ్మలకేం తెలుసు
రాబోయే రాజకీయ రాక్షస సంఘటనలు
దేశంలో రాజకీయ వాయుపీడనం చేత
దేశభక్తి తరిగిపోయి దైవభక్తి పెరిగింది
గుళ్ల మీద భక్తజనులు గుంపులు గుంపులుగా దూకి
చేశే భజనల దెబ్బకు శివుడో మాధవుడో ఎవడో
వాడి గూబ గుయ్యిమని ఏడుపు మొహమేస్తాడు
డప్పులు తాళాలు చాలవన్నట్లుగ నలుదిక్కుల
లౌడు స్పీకర్లు పెట్టి సినిమా పాటలు చేర్చి
ఊదరగొడుతూ ఉంటే దేవుడు, ఉంటాడా చస్తాడా
స్వాతంత్ర్యానంతర యుగమున సర్వదేవతా జాతికి
నిద్రాహారాలు లేవు నిమిషం విశ్రాంతి లేదు
భక్తులు పెట్టే బాధలు తట్టుకునే శక్తిలేక

గుళ్లు గోపురాలు విడిచి గుట్టలు పుట్టలు అనక
పట్టు పంచెలెత్తి పట్టి పారిపోవుచున్నారు

భాద్రపదం అంటేనే భయం భయంగా ఉంది
పండుగలంటేనే చాలు గుండెలాగిపోతున్నవి
పాపం గణపతి బాబా భారీ శరీరధారి
ఓట్లు పోగు చేసుకునే ఉద్రేకంలో నేతలు
ఆయన చేతుల్లో కూడా జెండా ఒకటిరికించి
చౌరస్తా కీడ్చుకొచ్చి ప్రొసెషన్లో నడిపిస్తూ
వీథివీధులా తిప్పి పని ముగిసిన తర్వాత
పారేస్తారు । ఎక్కడ।
నగర 'శ్రేయోభిలాషి' హుసేన్‌సాగర్‌లో

ఈ వీరావేశం చూస్తే ఇంకో ఐదారేళ్లకు
హుస్సేన్సాగర్ ఒక హాకీ ఫుట్‌బాల్ మైదాన్
లేదా నేతల గలీజు చేతులు చేసే ఒక భూదాన్
గామారక తప్పదు   మనమంతా అభాగ్య ప్రజలం
అశ్రుభరిత నయనాల్తో అవలోకించక తప్పదు

కనకనే నేటి ఆ నగర బంధువు
భావి నగర బాష్పబిందువు



ఇరవై అశ్రువుల్ని రాల్చడానికి
ఇరవై అక్షరాలు చాలవు
ఈ అక్షరాల మీద గద్దలు వాలవు !
నా హృదయంలో ఒక పద్యం
రగులుకుంటోంది
అది లోకాన్ని దహిస్తుంది
ఎన్ని ఘోర కృత్యాల కని సిగ్గుతో
తలవంచను ?
తిండి పెట్టే చేతుల్నే తెగ నరికే
మన చేతికిచ్చిన జెండా ఎగరేస్తూ
నోట్లో నాటిన నినాదాలు అరుస్తూ
రోడ్ల మీద తిరిగే ప్రజల్లో ఒకణ్నయి
పుట్టినందుకే సిగ్గుతో తలవంచుతున్నాను
గడ్డికేం తెలుసు గేదెలకు పళ్ళుంటాయని
చచ్చేముందే సిగ్గుతో చచ్చాను
అరే ఈ దేశంలో
రాళ్ళు కూడా అరుస్తున్నాయి
మనిషే అరవడు !
ఈ దేశంలో నదులు ఏడుస్తున్నాయి

అన్నార్తులకు చెందని ధాన్యానికి
అంకురారోపణ చేస్తున్నందుకు -
ఈ దేశంలో అడువులు ఏడుస్తున్నాయి
పశు పక్షుల సహోదరులుగా
తమ కడుపున పుట్టిన జనులకు
దక్కకుండాపోతున్నందుకు-
తినడానికి యోగ్యత లేని చేతులు
తెగ తింటూ ఉంటే
చెమట బొట్టు ఆకలి దేవత రాల్చిన కన్నీటి బొట్టు
ఎన్ని రోగాలైనా సరే ఎన్ని కల మందుతోనే
నయం చేస్తామనే భూత వైద్యులు
బాబూ ! దేశం నెత్తిన పెట్టారు
శుష్క ప్రజాస్వామ్యశూన్యహాస్తం
ఆరే ప్రజల రక్తం నేల మీద రాలుతోంది
ఇక ఈ దినానికి అంతిమ అధ్యాయం పలకాలి
ఏ మెరుపు గర్జించి గగనాన్ని శతకోటి
శకలాలు చేసిందో
అదే మెరుపు రెండో క్షణం అక్కడ లేదు
చూడు చరిత్ర చెత్తకుప్పల్లో
ఎన్నో హిట్లర్ల తలకాయలు
ఎన్ని పిడుగులైనా పడనీ
ఎన్ని భూకంపాలైనా రానీ

ఏ పూలు పూయాలో అవి
పూయకతప్పదు
పొదలో ఒక బుల్బుల్ పాడితే
నేను తలవంచుతాను
నీవూ తలవంచు
దేశం మారుతుంది
(చుండూరు మృతులకు అంకితం)

ఎన్నెన్ని నగరాలు ఎప్పుడు లేచాయో
ఈ భూమి మీద ఎవడికి తెలుసు
ధాన్యం పండించి పండించి
యుద్ధాలు చేశి చేశి
పిల్లల్ని కని కని అలసి పోయాయి
భూమిలోకి అస్తమించాయి
ఈ గుడిసెలు ఈ మురికి కాలువలు
ఈ చెత్తకుప్పల్ని ఆవేశించిన పిల్లలు
అన్నీ కలిశి ఏకగ్రీవంగా మన పేదరికాన్నే
గానం చేస్తున్నాయి
ఇవాళ నా శరీరం నా ఆత్మకు గోరీ
ఏకాకి పక్షి ఒకటి దాని మీద దిగంతాల్లోకి
చూస్తూ

ఎడారుల్లో పూలు పూస్తాయి కాబోలు
శిలల్లో నూతులు వికసిస్తాయి కాబోలు



ఉదయాన్నే కిరణాలు పోలీసుల్లా
ఏదో వెదుకుతున్నాయి తీవ్రంగా
చెట్లలో చెరువుల్లో ఇళ్ళలో
తామర పువ్వుల్లో
దూరి దూరి చూస్తున్నాయి దొంగల కోసం
పాపం వాటికి తెలీదు
రక్త కణాల్లో దాక్కో ఉన్న దొంగల్ని
రాష్ట్రపతి కూడా పట్టుకోలేడు



ఆ కుర్చీలో కూర్చో ఉన్న ఆ నున్నటి
ఆబోతు లాంటి వాడు
కాలాన్ని చెరుకు ముక్కలా నములుతున్నాడు
సువర్ణస్వప్నాల్లో ఇరుక్కో ఉన్నవాడ్ని

దంతాన్ని దంత వైద్యుడులా
పీకేసే ఘడియ ఇంకారాలేదు
పెండ్యులం కాలాన్ని ఉయ్యాలలో పెట్టి
ఊస్తోంది

కాలంఒకచెరుముక్క
చిలిపిగాతింటున్న చిలకముక్కు
ఈపద్యంఅంకితంపల్లికి పల్లికి



ఈ చీకటి ఇలా వీస్తోందేమిటి పెనుతుఫానులా ?
దేశంమీదికి ముంచుకు వస్తోంది
మినుకు మంటున్న దీపాల్ని కూడా
మిగల నీకుండా ఆర్పివేస్తోంది
కనపడిన దాన్నంతా కబళిస్తా నంటోంది
ఓహ్ ! ఏమి చీకటి ! ఏమి తుఫాను !

పాపం పసిపిల్లలకు పగలింకా రాలేదు
ఆ సూర్యగోళాన్ని ముందుకు
ఎందుకు తోయవు ?

ఈ చీకటిని చీల్చి నీ ఎర్రటి గుండెలాంటి
అరుణోదయాన్ని ఎందుకు ఇయ్యావు ?

సూర్యమండలాల్లాంటి స్వేదబిందువుల దండలు
ధరించిన ఓ మానవుడా!



చేతులు చేతులు చేతులు
రక్తపు మరకల చేతులు
చీకటి ఇంట్లో కూడా కనిపించే చేతులు
రవి బింబం పోగానే సర్కారు బింబాలూ పోతాయి
ఇళ్లకు చీకటి పంచే ఎంత గొప్ప సంక్షేమ పథకం
దొంగలు దొంగలు చేతులు కలిపిన వెనువెంటనే
దూకుతుంది ఇళ్లలోకి దుర్మార్గుడిలా చీకటి
టీ.వీ.ని. చూపమన్న క్విట్టిండియా టీ.వీ.లోనే హతం
మనం చూస్తున్న గాంధీయిజం మాత్రం ఒక ధూర్తుల
దురాగతం

చూడు చూడు తమ్ముడూ చీకట్లో కూడా
ధగధగ కనిపించే ఆ రాజకీయ చేతులు!

ప్రజల ఇళ్లలో దీపా లార్పేశే చేతులు
ఆత్మ కుక్షి నింపుకుంటూ అసంఖ్యాక జనావళిని
ఆకలి మంటల్లోకి విశిరేశే చేతులు
మహాత్తర సందేశాన్ని మైకుల్లో అరుస్తూ
గుండా రాజ్యం చేస్తూ జెండా ఎగరేశే చేతులు
ఆమలిన క్విట్టిండియాను మలినం చేశే చేతులు
దేశాన్ని హత్య చేశి మోసంతో మెరిశే చేతులు
చేతులు చేతులు చేతులు రక్తపు మరకల చేతులు

ఈ చేతులు కృష్ణానదిలో ఎలా కడుక్కుంటారు
ఎన్ని పుష్కరాలైనా క్షాళన ఎలా చేస్తాయి
ఈ చేతులు ముంచారంటే ఎంత కృష్ణానది అయినా
జలమంతా రక్తవర్ణ కలుషితమై పోతుంది
చేతులు చేతులు చేతులు రక్తపు మరకల చేతులు



ఎంత ఘోరం చేశింది ఈసారి వసంతం
కోకిల ఎత్తిన గొంతుని క్రూరంగా కోశింది
కొమ్మ కొమ్మ నుంచి తరిమి కొట్టింది పుష్పాలను
దర్జాగా తన మెడలో ధరించిం దొక మాలను

కరకర రూపాయలు నమిలే భయానక మొసళ్ళ
మాలను !
రాలేదు చిగుళ్ళు కొమ్మల్లో
వచ్చాయి పగుళ్ళ గుండెల్లో
ఆకాశ వీథుల్ని హాయిగా చుంబిస్తూ
మధు సేవ చేస్తున్న మహోగ్ర భవనాలకు
ప్రజాద్రవ్య విందుల్లో పచ్చడిగా ఇచ్చింది
ఆమని అని ఉగాదిని అప్పుడుగా పిలిచిన మనిషిని -
ఓ నిర్దయీ ఓ లోకవంచక ఉగాదీ
మా రక్తంతో పొట్ట పోసుకునే కబోదీ
నీ వెవరి పక్షమో మాకు తెలుసు
నీ కుహనా రూపం మా కాళ్ళకు గోలుసు
ఓహో ! ధూర్తుల సామ్రాజ్యంలో ఆర్తుల హాహాకారం
సూర్యుడు లేకపోతే ఏమి కవి ఉన్నాడు
దేశానికి కాంతి ఇవ్వడానికి
ఈ సంవత్సరం పేరు ఏదయితే ఏమి
జైల్లో ఉన్న వాడికి పుడిశెడు ఆకాశం కోసమే దాహం
సముద్రం కోసం కాదు
నా పద్యాలన్నీ నా దేశపు ఒళ్ళోపోశాను
నా దేశం ముందు మోకాళ్ళ మీద నుల్చో ఉన్నాను
సత్యమెంత కఠోరమో విను
నా బిడ్డ కార్చిన కన్నీరు ఈ గడ్డను కాల్చక తప్పదు

కోట్లాది పీడితుల ఘోష బెడిసి కొట్టక తప్పదు
భూగోళంలా పెరిగిపోతున్న మీ పొట్టలు
ఫట్టున పగలక తప్పదు



చరిత్రలో అణిగిపోయిన చార్మినార్‌కు ఎంత చరిత్ర !

నవాబుల ఇనప గిట్టలు తొక్కిన జమీను మీద అప్పుడు చార్మినార్ లేస్తే నాయకులనషా కింద నలిగిపోతున్న మనిషి మీద లేస్తున్నాయి ఇప్పుడు అభ్రంకష భవనాల అంతస్తులు, వాణిజ్య నిలయాలు

ఓరి అంధా ! ఇది ఒక పెద్ద చీకటి బజారు, లైట్లున్న చీకటి బజారు నవ నాగరక బురఖా మాత్రం తగిలించుకుంది ఆధునిక భంగిమకోసం -

ఆ రాస్తాలు చూడు , నడిచే భిక్షగాళ్ళు, పరుగులెత్తే గుమాస్తాలు మనుష్య పదార్థం పొర్లిపోయి నేలమీద ముద్దలు ముద్దలుగా పడుతున్న రాక్షసి బస్సులు, రిక్షాలు,

సైకిళ్ళు, నానా బరువులు మోస్తున్న మానవ రూప కూలీలు - అడుగు నుంచి నగరాన్ని నడిపిస్తున్న నానా జన సమూహాలు గర్జిస్తూ పారుతున్న మహా ప్రవాహాలు ఆ రాస్తాలు, నగరపు రక్తనాళాలు -

ఏ దిక్కుకైనా నీ చూపులు తిప్పు ఆ దిక్కున్నే నీ కళ్ళ మీదికి దాడి చేస్తాయి క్షణ క్షణం ఆకాశాన్ని ఎదిరిస్తూ లేస్తున్న బిల్డింగుల భయంకర స్వరూపాలు, వేటి ముందు నిలుచుంటే మనిషి చప్పన నలుసుగా మారిపోతాడో, వేటి హద్దుల్లో రద్దయిపోతాయో సమస్త మానవీయ విలువలు, ఏవి వల్లమాలిన వర్గ చైతన్యాన్ని రెచ్చ గొడతాయో ఆ భయంకర స్వరూపాలు -ఏక్కడ్నించి వస్తుందో ఈ ధన ప్రవాహపు వూట! ఏ భూగర్భ కుహరాల్లో వూరుతుందో ! మన చేతులదాకా రాదేమి? మన పిల్లల నోళ్ళ కందదేమి ?

ఈభయంకర తామసిక సామగ్రితో దున్నపోతుల ముఖాలు ఉత్పత్తి అవుతున్నాయి పెద్దపులులకండ్లు భల్లూకాల శరీరాలు, జలూకాల నాలుకలు ఎన్నో అవయవాలు నగర స్వరూప అరణ్య రాక్షసికి మానవీయ పదార్థం మేసి మేసి బలుస్తూ ఉంది మహానగర కళేబరం

ఆరాస్త్రాల్లో ప్రహిస్తున్న కుళ్ళు ఆకుళ్ళలో కుములుతున్న అగ్ని, ఆ అగ్నిలో పడుతున్న స్వచ్ఛపశువుల సమూహాలు ఆ పశువుల నాసారంధ్రాల్లో నుంచే పుడతాయి భూకంపాల గ్రామాలు - పరుగులెత్తు తాయి ఝుంఝూ మారుతాల మందలు ॥

నిప్పు ఎక్కడ్నించి పుడుతుందో, నేలమీద నుంచి పుడుతుందో, జలాల్లో నుంచి పుడుతుందో ఎవరికీ తెలీదు.

ఈ నిశ్శబ్దం శాంతి అనుకోకు , నా కవిత నిశ్శబ్దాల కుట్ర, అశ్రువుల తిరిగుబాటు, అవమానితుల భాషా సమితి ।



ఇది శిశుక్రందం. నేను మీరాజకీయ దేవుడు నాగృహంలోనే నన్నుఖైదీ చేశిన ఒక కవిని.

గొంతెత్తి అరచినా గోడలు దాటలేని ఖైదీని - నేను చెప్పేది కవిత్వంకాదు ।

కవిత్వం కన్నీటితో చేతులు కలిపిన ఘడియ ఇది ఇప్పుడు ఏది కవిత్వమో ఏది కన్నీరో ఎవరు చెప్పగలరు

ఇది కవిత్వం కాదు ఇది రక్తంతో కన్నీటితో తడిశిన అక్షరాల గుంపులు తుపాకి దెబ్బకు బెదిరి చెల్లాచెదరై పోతున్న పక్షుల సమూహాలు ఆర్తనాదం ఆకాశంలో కలిశిపోతున్న మానవ అసహాయత

పశ్చిమాకాశపు ఒడిలో చంద్రరేఖలా పాతబస్తీ మీనార్లలో పడుకోఉన్న శిశువు కెవ్వున కేకవేశింది -" ఈ నొప్పిభరించలేను ఓమనిషీ ! దాన్ని గుచ్చకు నాగొంతులోకి "

" ఏయ్‌నిన్ను చంపాలి "-" అంటే ఏమిటి మనిషీ?" -" నోర్ముయ్ నువ్వు నా దేవుడి శత్రువ్వి"-"శత్రువంటే ఏమిటి మనిషీ ? బాధగా ఉంది గుచ్చకు" - " నువ్వుమాదేవుడ్ని నమ్మవు " - " దేవుడంటే ఏమిటి ? నమ్మకం అంటే ఏమిటి? నాకు మా అమ్మతెలుసు, నేను జీవించాలని మా అమ్మిచ్చే పాలు తెలుసు మా అన్నయ్య నా ఉయ్యాలకు కట్టిన చిలుక తెలుసు " -

మనిషి ఎత్తిన కత్తి ఎత్తినట్లే ఉండి పోయింది శూన్యంలో "ఇంకా ఏంతెలుసు ", అన్నాడు మనిషి ! " నాకన్నుల్లో మెదిలే ఆపూల పొదలు ఆ పొదలమీద మెదిలే తుమ్మెదలు గిన్నెల్లాంటి పూలు, కన్నుల్లాంటి తేనె మాధుర్యం పూలసౌందర్యం . " - ఇదంతా ఏమిటో నాకు తెలీదు నాపనిపూర్తి చేసుకొనీ నాకిచ్చిన లెక్క నీతోగానీ పూర్తిగాదు " - " మనిషీ, నాకొక్కటి చెప్పు నాలాంటి శిశువు మీయింట్లో ఉందా?" " ఉంది, కానీ ఇంకా వాళ్ళమ్మ కడుపుల్లోనే ఉంది " - "అయితేఅక్కడే ఉండమను మనిషీ ! బయటకు వస్తే ఆకలేస్తుంది మా అమ్మ వేళకు పాలివ్వదు ఎప్పుడో గానీ కనిపించదు కూలీకిపోతుంది అప్పుడప్పుడు నన్నుకూడా తీసుకుపోతుంది పాపం ఆపొలాల్లోకి"-

" అరే ! ఎందుకు చెపుతావివన్నీ నిన్ను చంపాలి శిశువా, ఎలాగ ! నిన్ను చంపడంనాకో సమస్యలా చేశావ్" " మనిషీ ఎందుకు చంపుతావు నీవు చంపుతాన్నది ఒక శిశువును కాదు పచ్చిమానవతని మల్లెపువ్వులాంటి న్యాయాన్ని " - " అవేమిటో నాకు తెలీదు శిశువా అవి చాలా పెద్దమాటలు నిన్ను చంపనిదే మాదేవుడికి మందిరమో మసీదో కట్టించలేము

" అరే మనిషీ ! నాకు నవ్వొస్తోంది మనుషులకే

ఇల్లులేని ఈదేశంలో దేవుళ్ళకు ఇళ్ళు కట్టించాలని ఆక్రోశిస్తావెందుకు ? ఇల్లు లేక తిండి లేక అలమటిస్తున్న ఈ అశేష ప్రజానీకాన్ని చూడు , మనకు దేవుళ్ళని గురించి దీర్ఘచర్చలు చేశే దీర్ఘకాలమూ లేదు అంత ధనమూ లేదు , మనవి పని చేశి బ్రతకవలసిన చేతులు అరే ! కత్తులు పట్టుకోవలసిన చేతులు కావుమనవి నాగళ్ళు పట్టుకో వలసిన చేతులు ! ఆలోచించు మనిషీ

"పాపా" అని కేకవేశాడు మనిషి ఆర్తితో - "పాపా నేను మనిషిని కాను నేను హంతకుడ్ని " - " మనిషీ ! చూడు చార్మినార్ ఏడుస్తోంది !"



విప్లవ భాషావిధాత కవిసేన మేనిఫెస్టోప్రణేత బుధజన విధేయ శేషేంద్ర నామధేయ కవివర్య ప్రణీత ఆధునిక మహాభారతస్య అనుబంధకావ్యం జనవంశమ్ లో ప్రజాకాండ సమాప్తం

# చంపూకాండ

## ప్రేమఖండం

ఓయి లతా ప్రవాసి ! పద
వోయి జిలేబి గులాబి తోటలన్
బ్రేయసి బాహువల్లికల
బేశల కావ్య మరందగానముం
జేయుచు ఖేలగా జనుము
జీవితమే ఒక పూలబాటగా
హాయిగ తీయగా ఒక ఖ
యాముగ నీదు హాయాము సాగుతన్

ఓయి సఖా ! సుఖింపు, మధు
రోహాలు డోలికలై చలింప చాం
పేయలతావితానములు వేణువులున్
విరబూయు కోనలో
తీయని నిర్ఝరీ పులినతీర
కుటీర పటీర శీతల
చ్ఛాయల కోయిలల్ సలుపు
శ్రావ్య రవమ్ముల నాలకించుచున్



తెలుగు వారికి కృష్ణాగోదావరులు, నల్లమల అడవులు, శ్రీశైల దాక్షారామ కాళహస్తులు, ధోవతీ ఉత్తరీయాలు ఎట్లాగో పద్యం అట్లాంటిది. ముక్కోటి దేవతల్లాంటి తెలుగు వారి నాల్కల మీద నాట్యం చేసే ఆ అప్సరస ఒడిలోకి మగతగా ఒరిగిపోయిన మృదుమధుర విలాస భాసురమూర్తి ఒక మిత్రుడు - సంపన్న గృహస్థుడు, సాహితీపరుడు, సరసుడు, సజ్జనుడు, కమ్మటి పద్యమంటె కలకండలా చప్పరిస్తాడు. రంగురంగుల పూల మీద విహరించే మధుకరమూర్తి. పద్యం అతని పెదవులు వదలని ఝుంకారం.

అతడి విలాస యాత్రల్లో ఒకప్పుడు కవి ఉండటం తటస్థించింది. ఒక అశ్వక్షేత్రంలో ఒక గులాబిని చూపించి తనదిగా ఒకమాట ప్రణయ రసనిష్యందిగా చెప్పమన్నాడు.

అప్పుడు చెప్పినవి -

*బేబీలు ఎక్కువాయెను*
*హాబీలును తక్కువాయె అతిదుస్తరమీ*
*గోబీ ఎడారి దాటుట*
*బీబీవై ఏలుకొమ్మ భేషా బొమ్మా*

వ్వా ! సంధ్యా ! అవి వింధ్యపర్వత నభోవ్యాసంగ
శృంగమ్ములో
రాసుల్ రాసులు పోసి తెచ్చిన మహారంగత్తు
రంగంబులో
శాసించెన్ భవదీయకుంభ కుచముల్ సర్వప్ర
పంచంబులన్
దాసీభూత సమస్త యౌవనజన ధ్యానైక రంగంబులై
కన్నుల్ గావవి నన్నులా గెడు
అయస్కాంతమ్ములేగానిచన్నులున్
చన్నుల్ గావవి నన్నుమిన్నులకు చేర్చంజాలు
నిశ్రేణులే
వన్నెల్ గుల్కి హొయల్ బయల్ పడు నడల్ భాసించు
నిన్ గన్నచో
భిన్నం బేమియుగావు నీవును అరబ్బీ జాతి
గుర్రానికిన్

సాహంకార మనోహరా కృతిగ ఆ సన్యాసి దేవుండు
నిన్
మోహాతీతముగాని ఈ జగమునం బుట్టించుటే
తప్పు, నీ
బాహాబంధములన్ బెనంగిన గదా భవ్యంబు,
లేకున్నచో

ఆహా మా యువక ప్రపంచములు స్వాహాగావె నీ ధాటికిన్

సింహాచలమ్ము లోచిక్కనితోటలో
వలచు అనాసవే వన్నెలాడి
సామర్లకోటలో జాళువా తోటలో
చెరుకు ముక్కవె నీవు చిగురుబోడి
అల రాజమండ్రిలో అపరంజి రుచులీను
పనస తొనవే నీవు పద్మగంధి
నెల్లూరి చేలలో పిల్లగాలులకూగు
వరి వెన్నువే నీవు వగలమారి
మురిసి మురిపించి మరపించు మురువు జూపు
భువన మోహినివే నీవు పువ్వుబోడి
పల్లెపల్లెల ప్రేమ తపస్విజనుల
కొంగు బంగారువే నీవు కోమలాంగి

ఈ కవితా మధువు పీల్చి నషా ఎక్కి ఖుషీతో ఆసంధ్య వింధ్య పర్వతమయి పోయింది.



ఒకప్పుడు కపి బెంగాలీ యువకుడుగా నటించవలసి వచ్చింది - ప్రపంచ రంగ స్థలం మీదనే, ఎక్కడో స్టేజీ మీద కాదు ఈయన ఎందరికో శిష్యుడు, కానీ ఎవరికీ గురువు మాత్రం కాదు. అలాంటి గురువుల్లో ఒక గురువు, తీర్థక్షేత్ర మాహాత్మ్యాలు లెస్సగా ఎగిరినవాడు. సిద్ధహస్తుడు, ఒకప్పుడు పెద్ద సందిగ్ధావస్థలో పడ్డాడు

ఒక మదగజయానను వరించి తరించి పోదామను కున్నాడు పాపం ! కానీ హరించుకు పోతున్నాడు ప్రేమ యాత్రలో ; చాలా దూరం ప్రయాణం చేశాడు. ఆ తర్వాత వచ్చిందొక సందేహం. కాలు ముందుకు సాగదు వెనక్కి సాగదు - తన హృదయంలో ఉన్న బంగారమంతా దోచుకుని వచ్చి ఎవరి పాదాల మీద పోశాడో ఎవరు లేకుంటే తనకు జీవితమే లేదనుకుంటున్నాడో ఆ వన్నెలాడికి తన మీద అంత ప్రేమ ఉందా ? కొన్ని కథలు పూర్వం ఆమెని గురించి విన్నవి ఎప్పుడూ మనస్సును రేచు కుక్కల్లా పీచు పీచు చేస్తూపీక్కుతింటున్నాయి.

సరే - గురువుగారి ఆజ్ఞానుసారం కపి బెంగాల్ యువకుడుగా నటించటడానికి నడుం కట్టాడు. పాత్ర ఏమి

టంటే - ఈ యువకుడు మద్రాసులో వకీలు పరీక్ష ప్యాసయ్యాడు. ఆఫ్ఘనిస్థానంలో ఏదో ఒక పెద్ద గజిటెడాఫీసరో లేక జిగటెడాఫిసరో చేస్తున్నాడు లా కాలేజీలో గురువు గారి తమ్ముడికి క్లాస్ మేట్. నెల రోజుల సెలవుమీద ఇండియాకు వచ్చాడు. ఆ సందర్భంలో గురువుగారితో కలిసి వచ్చాడు

గురువు బెంగాలీ యువకుడ్ని ప్రేయసికి పరిచయం చేశాడు, రెండు రోజులు ఆ యింట్లోనే అతిధిగా ఉంటాడని చెప్పాడు. అన్ని ఏర్పాట్లూ చేయించాడు గురుప్రియ గురువు యువకుడు కలిసిమెలిసి కాలంగడపుతున్నారు ; సినిమాలకు వెడుతున్నారు. షికార్లకు వెడుతున్నారు; ఒకరోజు ఏదో పని ఉందని చెప్పి వెళ్లాడు గురువు - రహస్యంగా కొన్ని ఉత్తర్వులు శిష్యుడికి జారీచేసి - శ్రీమద్రమారమణ గోవిందో హరి ... ఇక తెరలేచింది !

సాయంకాలం గురుప్రియ సరదాగా కబుర్లు చెప్పి కాలక్షేపం చేయించింది మన బెంగాలీ యువకుడి చేత ఆమె కొవ్వలి నవలల దగ్గర్నించీ కూచిమంచి జగ్గ కవివరకూ శృంగార సాహిత్య సముద్రాన్ని ఎడం చేత్తో ఆపోశనం పట్టింది ; శరత్తు నవలలు, కరుణ శ్రీ

పద్యాలు పాదాక్రాంతం చేసుకుంది; రాయప్రోలు స్నేహలతని, దువ్వూరి వనకుమారిని కరతలామలకం చేసుకుంది-భావకవితా కాల కులాయంలోని ఆవన్నెల విహంగి ; ఆ మాటల షిరంగి ఆ నడకల కురంగి -

మెల్లిగా చీకటిపడి దీపాల్లో కాంతి బలపడి రాత్రికి సర్వాంగాల్లో యవ్వనపు మిసమిసలుతెన్నగా ఎక్కాయి. చంద్రుడు కూడా మింటి కొమ్మెక్కి పుడమిని వెన్నెల గోళ్ళతో గిలిగింతలు పెట్టసాగాడు. ఆ కాంత ఏకాంత ఏమవుతుంది ? ఇంద్రియాల పట్టు సడలుతోంది. ఆమె పసిడి ఒడలి మీద ఏవో పువ్వు రేకులు సోకినట్లు నెమలి ఈకలు పాకి నట్లు అయిందేమో -" మీకు తెలుగెట్లా వచ్చు బెంగాలీ వారు కదా "? అని అడిగింది నిశ్శబ్ద మంచుగడ్డను భేదిస్తూ.

" అదేమిటి ఇంతసేపయిం తర్వాత ఇప్పుడు తోచిందేమిటి మీకీ ప్రశ్న ".

" ఏమీలేదు-నేనే గొప్ప మాటకారి నంటారు మీ గురువుగారు. అలాంటి నాకే ఇంత ముఖ్యమైన ప్రశ్న తోచనీకుండా ఏకబిగి కబుర్లు నడిపారంటే, మహాశయా, మేరేమీ తక్కువ వారు కారన్న మాట; గజకర్ణ గోకర్ణ ఘంటాకర్ణ టక్కుటమారాది విద్యలన్నీ నేర్చిన గజ

ఈతగాళ్ళన్న మాట-నిజం చెప్పండి మీరు తెలుగు వారా బెంగాలీ వారా ?"-

"ఏమండీ మిమ్మల్ని మాలక్షమ్మ అనుకుండా మంజు వాణి అన్నాననుకోండి మీ జగన్మోహినీ అవతారానికి ఏమయినా లోటవుతుందా ? చెప్పండి ".

" వారెవ్వా ! ఆడమన స్తత్వం బాగా తెలుసండీ మీకు !"

"ఓహో అట్లాగా?"

"మరి నేను చదివే పద్యాలన్నిటికీ గొంతుకలుపు తున్నారే"

" అదేమీ లేదండీ. మా నాన్న రైల్వే డిపార్టుమెంటు ఉద్యోగిగా చాలాకాలం ఈ ప్రాంతంలోనే ఉద్యోగం చేసి రిటైరయ్యారు. మేమిక్కడే పుట్టాము పెరిగాము".

" అయితే మీరు కవిత్వం చెపుతారా " అంటూ అరటి పళ్ళూ పాలూ తెచ్చి ముందు పెట్టింది

అరటి పండుముక్క వేళ్ళతో నోట్లో వేసుకుంటూ "ప్రయత్నం చేస్తాను. అశువు చెప్పేవాడ్ని ; ఇప్పుడొస్తుందో రాదోమరి - జైగురు దేవాయ నమః "అన్నాడు. అనేసరికి ఎదటి కిటికీ ఊచల్లోనుంచి చీకట్లో కలిసిన గురువు గారి మొహం కనిపించింది ! ఆ ముఖ మండలంలో ఆతురత, ఉద్రేకం, ఆందోళన తాండవిస్తున్న ఛాయలు కనిపించాయి. పళ్ళు బిగబట్టి పిడికిల ఝుళిపిస్తున్నాడు కిటికీ ఊచల కావల "దాపలమందారం". శిష్యుడికి తారెత్తింది. అదేమిటి గురువాజ్ఞ తూచా తప్పకుండా పాటిస్తుంటే అలా ఇదైపోతున్నాడేమిటి గురువు అని బెదురుతూ దగ్గునభినయించెను శిష్యుండు. ఉమ్మి వేయుటకో యన్నట్లుగా తలుపు తీసుకొని బైటికి వెళ్ళెను.

గురువు గర్జించాడు డగ్గుత్తికతో, "తొందరగా తేల్చు ఇటో అటో నీ వెధవ పరీక్షా నువ్వూ౽నూ - నాకగ్ని పరీక్షగా ఉంది ".

"తేలుస్తాగురో, ఇదేమిటి డబ్బిచ్చి టిక్కెటట్టుకు రావడం లాంటిది కాదు ".

"ఏడిశావ్ - ఆ ఏడుపేదో తొందరగా ఏడువ్, బయట మంచులో చస్తున్నాను నీకేం వెచ్చగా లోపల

చేరావ్. సాయంకాలంనుంచీ నుల్చునినుల్చుని కాళ్లు లాగుతున్నాయి. ఇంకా ఆ వెధవ సస్పెన్సులో పెట్టి చంపక అర్థంటుగా తేల్చు, మోస్ట్ ఇన్కాంపిటెంట్ బగ్గర్" అంటూ శిష్యుడ్ని లోపలికి తోసి బయట్నించి తలుపుమూసి వీధిఅరుగుమీద చతికిలబడ్డాడు గ్రువ్, శిష్యుడి చేతిలో లఘువు అయిపొయ్యానే అని ఏడుస్తూ.

ఇక లోపల -"ఏమిటండీ కవిగారు ఇంతసేపూ ఉమ్మేస్తూనే ఉన్నారా ఏమిటి ? గొంతులో ఏదైనా"

"గొంతులో వెలక్కాయ "అని స్వగతంగా గొణుక్కుంటూ శిష్యుడు లోపలికి వచ్చాడు.

"ఏమిటి ఎలా ఉందేమిటి ; మీ గొంతుతో చాలాపని ఉంది"

"ఏం పనేమిటి కొంపదీసి -"

"గొంతుతోనే లెండి భయపడతారెందుకు"అంది చింతామణి. మందహాసంతో అది చంద్రహాసంలా గుచ్చుకుంది కిటికీ అవతల గురువుగారి గుండెలో

"ఏమండీ గొంతుకు అమృతాంజనం రాస్తా బాగుంటుంది" అంటూ లోపలి కెళ్ళింది. ఈ లోపుగా

శిష్యుడు పాలు అరటిపళ్ళు ఖాళీచేసి కిక్కురుమనకుండా కూచొని ఉన్నాడు.

తిరిగివచ్చి "ఏమిటి ఒక్కక్షణంలోనే ఖాళీచేశారే" అంది నవ్వుతూ, మెల్లిగా అమృతాంజనం బెంగాలీ గొంతుకు కోమలాంగుళులతో పూయసాగెను. బయట గురువుగారి గుండె ఇటూ అటూ ఊగిసలాడసాగెను.

"ఏదీ మీ ఆశు కవిత్వం కానివ్వండి"అంది అమృతాంజనం కొంచెంమూతిక్కూడా పూస్తూ. శిష్యుడి దేహంనిండా వెయ్యి విద్యుల్లతలు కితకితలుగా ప్రాకాయి. కళ్ళుబైర్లు కమ్మాయి. కాని తన కవితా వ్యక్తిత్వానికి గిలిగింతలు పెడుతూ ఉత్సాహం కూడా పెనవేసుకుంది. వెంటనే ఆ విహంగి కరకమలం పుచ్చుకొని మీదకు లాక్కుంటూ ఇలా ఒక ఆశువు విశిరేశాడు -

*"విరుదుల్ నీ కనమానమైన బిరుదుల్ పీన స్వరూపం బులై*
*ఒరగం బండిన మందసా పనసపండ్లో లేక దిండ్లో యనన్*
*బరువై నీకిరువైపులం గులుకుచుం భాసింప సొంపారునీ*

*చురుకు గొల్పు మదేభయానమునకున్ జోహారు*
*భామామణీ*

"ఓహోహో ఏమి చెప్పారు భావకవిగారూ డొక్క చించేశారు" - అంటూ ఉండగా మరొకటి విసిరాడు కవి,

*"తరమే నీదు విలోకన ప్రభలకుందాశంగ?*
*కూర్రాంగ జుం*
*డురగంబులెదూకు బ్రాకు శత విద్యుద్వల్లికల్ గావు*
*నన్! విరి చెంగల్వల వోలె మోహనమ్మలై విప్పారి*
*యొప్పారు నీ*
*వరనేత్రద్వయి నాపయింబరపకే వామాక్షి కామాక్షివై*

గురుప్రియ దెబ్బతో సొమ్మసిల్లిపోయి తన మదగజ యాన శరీరాన్ని 'ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో' శిష్యుడి లఘు కళేబరం మీద వేస్తూ "కవీశ్వరా, ఇదే నీకు నా బహుమానం" అంటూ అధరం బాసింప, "హా శ్రీహరి" అని శిష్యుండనగా బయట కిటికీ కావల కటకటా యన్న చప్పుడు వినంబడె. క్షణంబున ప్రణయ జీవులిర్వురూ సర్దుకొని కూర్చునిరి.

ఆ జగన్మోహినికి గుండెల్లో పింజాం పింజాం అంటున్నా కండల్లో మాత్రం ఆవురావురు మంటోంది

'హాకలి'. దూరంగా లేచిపోయి కూర్చుంది. అప్పుడు కవిగారు మరొక పాశుపతాస్త్రం దంచాడు.

"అలుకా నాపయి పంచదార చిలుకా! హాల్వావు నీ వున్నచో
చలికాలంబు జయింతు సర్వ సుఖముల్ సాధింతు బాధింతు నీ
కులిశ క్రూర కఠోర ఘోరతర వక్షోరాక్షస ద్వంద్వముల్
కలకాలంబు వసింతు నీ చరణ రేఖా నాకలోకంబులన్!"

"అయ్యో పాపమే ఎంత బాగా చెప్పావురా న తండ్రీ! ఇంకోటి చెప్పు" అనగానే లంకించుకున్నాడ ఆశుధార

"తులుకుంబంగరు బొంగరంబుల బలెన్ గుత్తంపు జాకెట్టులో
కొల్వైయున్న సమున్నతస్తనములన్ కుంభించి హస్తద్వయిన్
కలయం బట్టి మథింపనీవె సుమనో గంధీ! తదీయాగ్రముల్
కలచెన్ చిత్తకవాట పాటనకళా కౌశల్య శల్యంబులై"

"ఏమండీ నామీద భలే చెప్పారండీ! అబ్బా భలేగా ఉందండి ఇంకోటి చెప్పండి నా బాబుగదూ" అంటూ గడ్డం పుచ్చుకుని బ్రతిమాలు కుంది.

అంతంగవి కుమారుండు మకరి దవుడలం జిక్కిన గజేంద్రుండై ఇట్లనియె శ్రీమద్రమా రమణ గోవిందో హారి!

*కోటి రంభలు వచ్చి కులుకు చూపించినా*
*కాలదన్నుదు గదే కమల గంధి*
*ఒక వేయి రాజ్యంబులూరకే వచ్చినా*
*ఉమ్మివేయుదుగదే ఉత్పలాక్షి*
*లోకమేకంబుగా దూకి బెదిరించినా*
*ఎదిరించి నిలుతునే ఇగురుబోడి*
*అలసూర్య చంద్రులే హద్దులు దాటినా*
*మాటకు నిల్తునే మధురవాణి*
*గంధ గజయాన నీదు బంగారు కొంగు*
*సోకినం జాలు నేను మజ్నూకు అన్న*
*చూచినం జాలు దేవదాసునకు మిన్న*
*నీవు లేకున్న బ్రతుకు చే నిండుసున్న"*

"నా ప్రాణాలు నిలవటం లేదురా మజనూ ఏంచెయ్య మంటావుర్రా కవీశ్వరా" అంటూ అక్కడ్నించి లేచిపోయి మరోచోట కూచుంది.

అంతట కపి మహాకవి అయిపోయి లేచి నుల్చుని సినిమాలో నాగేశ్వర్రావులా చేతులూపుతూ ఇట్లనియె-

*'అధునాతన కీచకుడను*
*ఆధరాధర యాచకుడను హా! మదిరాక్షీ!*

అనుచుండగా అర్థోక్తిలోనే అడ్డువచ్చి చింతామణి ఇట్లనియె

'మద్రాసీ ఏమిటండీ బాబూ నేను పదహారణాల ఆంధ్రురాలిని'

'వాహ్ ఏమి ప్రయోగము చేసితివి, నీవనింద్య గ్రామ్యం బవు. నిన్ను పిలక ఉన్న విద్వత్ కవికూడా ఆశ్రయించగలడు. మద్రాసీకాదు మహిళా మణీ! అది 'మదిరాక్షి'

ఆ రమణి అర్ధనిమీలితాక్షియైయున్న యత్తరుణంబున కవి

*అధరాధర యాచకుడను హా మదిరాక్షీ*
*రుధిరము పొంగెను ఊహా*
*మధుమాసము మోసులెత్తె మన్నింపగదే*

అనగానే "ఆహాహా", గుర్నూరూ! ఓ జిగురూ! ఇకతట్టుకోలేను ప్రభూ!" అంటూ సరభ సంబునవచ్చి యవ్వివహాంగి లఘంగియై మీద బడుచుండగా కవి కుమారు డుచితజ్ఞుండై - 'ఓహోహో తగ్గు రమణీ! కొంపమునిగి పోవును', అని తప్పుకున్నాడు. మరొకటి అన్నాడు -

*"తరుణీ నను త్రాచులవలె*
*కరచెడు నీ బాహులతల ఖైదీనై -నీ*
*సరసాలే చెరసాలగ*
*చిరకాలము బ్రతుకనిమ్ము చిగురాకు వలెన్*

ఇక చేయునదిలేక అక్కమల గంధి కామాంధకారంబు ముప్పిరి గొన కనురెప్పలు మూసుకుని "పంచాస్త్రోపనిష ద్రహస్య పరమ బ్రహ్మస్వరూపంబును" మనంబున ధ్యానించుచు కూర్చుని యుండ - కవి మరియు నిట్లనియె

*నీవెంట దిరుగు పాపను*
*నీవలలో జిక్కి వెడలనేరని చేపన్*
*నావలపు బాధ బాపన్*
*నీవే శరణమ్ము కొలుతు నీ చరణమ్మున్.*

" మహాకవీ నన్ను మరీ మషాళా చేస్తున్నావయ్యా ఊరుకోరాదూ ఎందుకిలా చావగొడతావ్ నన్ను?"

'*హా హా తగూ*" *అంటూ కవి మరొకటి దంచాడు.*
"*నానావు నీవు ఐతే*
*నేనూ ఒక డోనోవాను నే మీనాక్షీ*
*జానగు ఈ జగమంతా*
*తేనెల్లకై పరుగులెత్తు తేటులబాటల్*"

అంటూ ఉండగా కిటికీ కావల నున్న గురువు ఇక లాభం లేదని లోపలికి విరుచుకు పడ్డాడు.

అంతటితో నాటకం ముగిసింది - తెరవాలింది - తెల్లవారింది.



చదువుకునే రోజులకు ప్రేమ పాఠాలు చదువుకునే రోజులు పరాకాష్ఠ. చంద్రికలు మందమారుతాలు చైత్రవైశాఖ మాసాలు శరీర నిమ్నోన్నతాలు శిరోజ పరిమళాలు అన్నీ యౌవనం మీద కుట్ర చేశేరోజులు. ప్రేయసి తప్ప లోకంలో ఏదీ కనపడక పోవడం, హృదయం భగ్నంకావడం లాంటి నేత్రరోగ హృద్రోగాది అనారోగ్య లక్షణాలు ఉపమానాలుగా ఉత్ప్రేక్షలుగా మారి వయస్సును అలంకరించే జీవనరుతువు. అలాంటి ఋతువులో ఏ నెమిలినిగురించో సిమిలీలు అల్లుతూ ప్రేమాగ్నిలో పడి దగ్ధమైపోయిన క్షణం

*కలికీ! నీ విలకేగుదెంచిన శర*
*త్కాదంబినీమాలికా*
*విలసన్మంజులు చంద్రరేఖవో నిశా*
*విర్భూత శీత ప్రభా*
*సలిల స్నాత చకోర సుందరివో వ*
*ర్షాకాశ కేశవళీ*
*గళిత ప్రోజ్జ్వల దింద్ర చాపమవో*
*ఆకర్షింతు వర్ణింపవే.*

*హేమంతంబునరెక్కవిప్పినగులా*

బీపువ్వ లాగున్నదే
భామా! నీ తనురేఖ; మామక మనః
పంకేజ పత్రమ్ము లన్
ప్రేమార్ద్రమ్ముగ దాచుకొందునో, లస
ద్విద్యుల్లతామూర్తినై
కామోద్వేగ వశమ్ము నన్ జిదిమి యా
ఘ్రాణింతునో చెప్పవే

హుంకారంబుగ నీవు నిల్చిన, త్రిలి
జ్జోక్తి ప్రపంచంబునం
దోంకారంబును బోలియుందువు సఖీ!
యోషాజిగీషా ముహు
ష్టంకారం బొనరించు వేళల నధి
జ్యంబైన శుంభన్నిరా
టంక శ్రీ మకరాంక చాపము కని
ష్ఠంబౌను నీ శీవికిన్

అలతి గులాబిమొగ్గ మగు
వా! హృదయమ్ము తదంతరాళమున్
వలపను కీటకమ్మొకటి
వచ్చి యహర్నిశలుం గ్రసించె నా
చెలువు కృశించె సంచలిత

జీవనకాంతి నశించె నీ కృపా
కలిత కటాక్షమాలికలో
గాక యరణ్యములో శరణ్యముల్

నీ మోహాలస నేత్రముల్ విరిసి నా
నెమ్మోము గన్నంతనే
కామాగ్నింబడి కాలిపోవుదును నీ
కంఠంబు విన్నంతనే
శ్రీ మన్మంజుల పల్లవాభ్యుదయమై
జీవింతునో ప్రేయసీ
నీ మందార మరంద బాషలు హిమా
నీబందు సందోహముల్.

ఇంతీ ! ఓ మధుర స్రవంతి ! శశితా
నెన్నాళ్ళు తారా పదా
క్రాంతుండై విలసిల్లు నన్ని దినముల్
కాంక్షింప వేరేదియున్
సంతోషించిన చాలు నీ మృదుపద
చ్ఛాయా సమీపంబులన్
కాంతా మంగళకామినై ప్రణయశా
ఖా కోకిల స్వామినై.

ఒక మల్లిక తన మనస్సు కుసుమిత మల్లికా లతల్లో పోగొట్టుకుంది. కనక ఆయన ఆమల్లికకోసం ఒక మల్లెతోట వేశి పెంచాడు. సంధ్యాకాలాన్ని అందులోనే కూర్చుని గడుపుతాడు మధువుతోతడుపుతాడు. ఆమిత్రుడు తన భావాగ్నుల్ని కవిత్వీకరించ మని కోరగా, శబ్దమల్లికల్ని ఆశువుగా విశిరిన వైనం

*మల్లెలు పూచె బాలసుకుమార*
*సమీరము వీచె నిండుజా*
*బిల్లి దిశాంతరాళముల వెన్నెల*
*కాచె మనోవనస్థలీ*
*పల్లవ శయ్యలం బ్రణయభావ*
*శకుంతము నిద్రలేచె, నో !*
*హల్లకపాణి ! రావె, భరమాయె*
*వియోగ రసార్ద్ర వేదనల్.*

*అల్లిన రాగవల్లికల కాశ్రయమై*
*విలసిల్లు నీవు నా*
*పల్లవ కోమలంబయిన భావము*
*నుంతయెఱుంగలేకయీ*
*చల్లని పండువెన్నెల పసందు*
*వృధా యొనరింతు వేల నో !*

మల్లియ పూలరాణి బ్రతిమాలెద
వాలెద నీ పదమ్ముల్.

ఏ యనురాగమోహాలహరీ మహి
మాతిశయమ్మొ గాని నీ
వాయువు సోకిన్ బ్రణయభావ
కిసాల రసాల మూర్తివై
పోయి జగమ్మునే మరచిపోవుదు, నా
చిగురాకు రెమ్మలో
కూయవదేలనే వలపు కోయిలవై
భువనైక మోహినీ!

ఏ విరికోనలోన వికసించిన
మల్లికవో లతాంగి! నీ
తావికి మోవికిన్ మురిసి తావక
పాదకిసాలయద్వయీ
సేవ యొనర్తు రాగమయ జీవనమో
వనమో తదన్యమో
భావము లేలమాకు క్షణభంగుర
జీవిత పాంథశాలలన్

ఒకప్పుడు ఆమిత్రుడితో కలిశి వెళ్ళినప్పుడు ఈ పద్యాల్ని మల్లిక కి ప్రత్యక్షంగావిని పించగా మల్లిక

చూపులు పారవశ్యంలో మునకలు వేశాయిఆతర్వాట
ఏంజరిగిందో ఆపారవశ్యం లో తెలిశిన జాడలేదు.



యోగి ఐ తనలో యోగికి చెప్పిన మాటలు -
ఏ విషలగ్నమందు జని
యించితినో హృదయేశ్వరీ ! నిరా
శావహ కాలపాశవల
యంబుల జిక్కి విశీర్ణమైననా
జీవితమెల్ల నందనము
జేయగజాలిన నీ యపూర్వ సం
భావిత మాధురీ ప్రణయ
పల్లరి అల్లరిపాలు చేసితిన్.

తెల్లని చీరగట్టి నలు
దిక్కులునిండినచంద్రకాంతిలో
వెల్లువలైన మోహ భర
వేగమున్ నవఫుల్ల మల్లికా
వల్లికవోలె నా యెదుట
వాలితివో "అనురాయోగి!" నే

*ఢల్లిన గాధగా నవలగా కల*
*గా కనుపించు నంతయున్.*



గొలుసుల్లో కాళ్ళు ఇరుక్కున్న మావుడు గగనంలో ఎగిరే చిలుకల గుంపుల వెంబడి ఎగిరి పోతాడు. స్వప్నాల మందలు తోలుకుంటూ విషాదస్వరాలతో పరిసరాలు నింపుతూ భూతలంమీదనే సంచరిస్తూ ఉంటాడు. వేసవి నాటి ..చు వెదురు ముక్కలా ఆసందర్భంలో వెలువడిన స్వరాలు

*గొజ్జగిపూల సెజ్జపయి*
*కోమలదేహము వాల్చి ఊహలో*
*మజ్జనమాడు సుందరికి*
*మా కుసుమాంజలిజెప్పి వేగమే*
*కజ్జల బాష్ప బిందువుల*
*కాన్కలుతెమ్ము గులాబితోటకుం*
*బజ్జ నెసంగు చెంగలువ*
*బావికడన్ నివసింతు నెచ్చెలీ.*

భావ లతా నికుంజమున
పాటలు పాడిన కోకిలమ్మ యే
పూవులతోటకో ఎగిరి
పోయెను తీయని స్వప్నమైన నా
జీవన గేహాళీ తిమిర
సీమలు కోమల కాంతి రేఖకై
బావురుమంచు శోక రస
బంధురమై తపియించె నెచ్చెలీ.

శారద రాత్రులంగలసి
జంటగ నొంటిగ సంచరించు గ
న్నేరుల కోవలం జిలుగు
నీడల జాడలు మాసిపోయె, వాం
గారెడు నాదు వెన్నెల జ
గమ్ము నగమ్మయి క్రుంగిపోయె, నే
తీరున జూచినం బ్రతుకు
తెన్నులు బాష్పకణ ప్రపూర్ణముల్.

ఇలపై రాలిన పూలకై వగచి రే
యిం గారుమేఘాల దా
రులలో గ్రుంకినవంక జాబిలికి యా
క్రోశించి యాశించిన్

ఫలమేమున్నది, మూవిగున్నలకడన్
వాసించి యాశాలతా
వళులం దూగిసలాడు నా ప్రియసఖిన్
వారింపుమో మిత్రమా.

పోయినదానిగూర్చి తల
పోయుచు చెక్కిట చేయిజేర్చి వా
పోయెడు బాలకున్ మరచి
పొమ్మని చెప్పుము గమ్యమెంతకుం
డాయగలేక జీవిత యె
డారుల గ్రుమ్మరు పాంథ జీవికై
హాయని బాష్పబిందు వొక
టైనను రాల్పుమటంచు తెల్పుమా.



విధుర జీవన వీథుల్లో విసిగిపోయి,కాళ్ళకు ప్రయాణదాహం తీరక తిరిగి తిరిగి, చతికిల బడిపోయి ఆకాశదేవతను ఉద్దేశించి

వలమాన జ్వలమాన జీవన వనీ
వాసంత వేశంతమా

యెల బ్రాయమ్మున నున్న నన్ గని కళా
హేలా మనోవీధులన్
గలకంఠమ్ములు కూయగా తనువులం గ్రై
పెక్కగా భామినీ
కలభంబుల్ శలభంబులాయె విలసత్
కామానల జ్వాలకున్.

అధర మధూళి ధారలకు
ఆసలు మోసులువారి న న్నురో
కుధర యుగాగ్రభాగముల
గ్రుమ్మిన వారలెగాని, నామనో
మధుర లతాల వాలముల
మంజులభావ తుషారపూర వా
క్సుధలను గ్రుమ్మరించు సుమ
కోమల ప్రేమ లభింపదక్కటా.

కోవెలవంటి నా హృదయ
కుంజములో చెలువారు మవ్వపుం
జీవన మాధురీ రుచులు
చిందర వందర చేయువారె నా
త్రోవల దారసిల్లి రాక
తూలిక పోలిక భావరేఖకుం

దావలమైన ప్రేమమయ
తారలభింపకపోయెనక్కటా.

సురుచిర ప్రేమకై యెదురు
చూచి విశాల ప్రపంచ వీధులం
దిరిగిన జోళ్ళతో దిరిగి
ఆర్రులుజాచి వృధా నిరీక్షయై
చిరిగిన నావవోలె దరి
జేరక యూరక సాగరమ్మునం
దొరిగెదనో విలాస మధు
రోహలమేడగ కూలిపోదునో.

ప్రేమ సుధారసమ్మునకు
భిక్షువునై ఫలితమ్ములేక నన్
గామపిపాస పైకొనగ
గైకొనినాడ మదాంధ సింధురో
ద్దామల భామలన్, హృదయ
ధామ కళల్ శిథిలమ్ములాయె, నా
కోమల భావ సంపదలు
కోల్పడియెన్, బికువైతినక్కటా.

ఓ పరమేశ్వరా ! ఒక మ
హోజ్జ్వల ప్రేమ రసైకరాశినిం
జూపవు ఈ భయంకర ప
శుత్వము నాపవు గాంగనిర్ఝరీ
దీపిత శీత శృంగముల
దేలెడు వాయు తరంగడోలలం
దూపవు నా నిరీక్ష కెపు
డోయి సమాప్తము లోకరక్షకా!



## ఉద్యోగ ఖండం

మన కవి దురదృష్టవశాత్తు ఎప్పుడూ ఆఫీసర్ల చేతులో బాధపడుతుంటాడు. వాళ్ళు ఆయన దృష్టిలో అధికార దుర్మదాంధులు ఆధునిక రాక్షసులు, అధికారులనీ, అధిక+ అరులని సవర్ణ దీర్ఘసంధి విడదీసి ఆ తుచ్ఛుల్ని ఉచ్చరిస్తుంటాడు. ప్రాణం విసిగి ఒకసారి వాళ్ళ మీదికి చేసిన దండయాత్రలో ఆయన వాడిన శరపరంపరలు శతఘ్నులు :-

లక్షాతోంభయి కుంభకోణములు నిర్లక్ష్యంబుగా సల్పుచున్ కుక్షిన్ నింపెడు కుంభకర్ణులును భూగోళంబు గోళంబుగా భక్షింపగల బ్రహ్మరాక్షసులు శుంభద్గండ భేరుండముల్ పక్షీంద్రుల్ తమ జీర్ణశక్తి కివిగో బాబూ నమస్కారముల్- అరయన్ మీ రధికార శేఖరులు మీ రాకాశమందుండి యీ ధరపై బడ్డ మహానుభావులు, ఘనుల్ తామేగదా భూమిలో పెరవారల్ ఋషికల్పులైన కవితా పీయూషులైనన్ సరే సరిపోవం గలవారలే ? చవట లా సర్వజ్ఞ ప్రజ్ఞానిధుల్

ఒక్క వెధవకు తెలీదో కెన్ని వంకలో
డాబుగా పెద్ద ముస్తాబుజేయు
అధమాధములు బెట్టు అర్జీల కల్లాడు
తగ్గిన వారిపై దాడి చేయు
విజ్ఞులైనను సరే వెంట్రుకగా జూచు
ఘనుడు తానేయంచు వినుతి జేయు
వివరింపు మేదేని విద్యయెకటున్నచో
అన్నచో ఇక పలాయనము చేయు
నాటివై రాటి వాచాల ధాటిగాదు
నేటి యధికారి వీర బాహాట ధాటి
తరమె వర్ణింప కవికుల ధాత్రకైన
తాతకైనను వాని ముత్తాతకైన

ఓరోరీ అధికార దుర్మద వితండోద్దండ చండాలుడా
నీరాజత్వము నీ నిరంకుశ దశన్ నీ గర్వసర్వస్వమున్
నీ రేఖాలవమేని నిల్పక నినున్ నిర్మూలముంజేసి ని
స్సారుంజేయు దినంబు వచ్చె నికపై చాలింపు
నీవేషముల్

ఒక శాస్త్ర ప్రవణత్వమా మధురకావ్యోల్లాస
రాసిక్యమా
సకలామ్నాయ పురాణలక్షితమహాత్సంస్కార

సౌరభ్యమా
అకలంకోజ్జ్వల శేముషీ విభవమా ఔదార్యమా
వీర్యమా
ఇకఏమున్నది ఏమి చూచుకుని మీకీ
సర్వగర్వోన్నతుల్

నీటగు వేషముల్ పరమ నిష్ఠ ధరించి ప్రపంచ వంచనా
నాటక మాడుచే కడు ఘనం బనుకొందువుగాని
మూర్ఖ! నా
గోటికి సైతమీ వెధవ కోటులు బూటులు సాటి
రావు నీ
వేటికి నేటికిం దెలియకిట్లు చరింతువు జంతువుంబలెన్.

పావన దీపమైన చదువా వెధవా రవలేదు పూర్వపుం
జేవయు నిన్ను వీడి నడిచెన్ విడిచెన్ విభవంబు
శూన్యసం
భావన జూచి నేడొక నవాబనుకొందువదేమిరా ఒరే
నీవొక పీన్గు వన్న కరణిం ధరణిం బడియుండు
ముండవై.

వ్రాతయందు నీవు ధాతవు గాకున్న
మేతయందు దున్నపోతుగాదె

*లోక మెరుంగుగా నీ కెంత ప్రీతియో*
*నీతి యందు మంచి నేతి యందు.*

కినుకన్ ధారుణి దద్దరిల్లు గతి ఘీఘీయంచు ఘీంకారముల్ చెనకం జేయకు భీకర ప్రళయరాశీభూత భేతాళుడా రణదుద్యోగి బకావతార ! ఘృత ధారాసారపూరంబులన్ వినుతిం జేతును శాంతి జెంది సకలా భీష్టంబు లీడేర్పుమా.

ఇంతలో ఒక ఆఫీసరు 'ఒక్కవెధవకు అన్నచోట గణభంగం జరిగిందన్నాడు.'ఏడ్చావ్ అదినీగుణ భంగం మూలంగానే వచ్చిం, దన్నాడీ కవి.



మన కవి సాధారణంగా పంచా లాల్చీ ధరిస్తాడు. ఒక ఆఫీసరు ఒకనాడు ఆఫీసర్ల క్లబ్బులో ఈ దుస్తుల్ని ఆక్షేపించి ఆపహాస్యం చేశాడు. అప్పుడు కవి వాడికి వడ్డించిన సంభావన

*తుండమున్నంతనే దోమ శుండా దండ*
*మండితోద్దండ వేదండ మగునె*

ఎఱకలున్నంతనే ఈగరఘుంరఘూసమీ
రోదగ్ర గండభేరుండ మగునె
కంఠమున్నంతనే కాకి పల్లవ శాఖి
కారూఢ పిక రాజ్య కాంతుడగునె
గమన మున్నంతనే గాడిద రమ్యధా
రా మనోహర హయ రాజ మగునె
జ్ఞాన దీపాంకురము లేని మానవుండు
పిలక యున్నంత మాత్రాన పెద్ద యగునె
గుంజు నలుసంతయును లేని ముంజి కాయ
ఏమి తలకాయ గురునాథ నామధేయ !



ఒక పంచాయతీ ఆఫీసరు మన కవిని తెగసతాయిస్తూ ఉంటే వాడి కిచ్చిన డోస్

సకల పంచాయితీ సంచిత ద్రవ్యంబు
హవ్యంబుగా మ్రింగు అగ్నిహోత్రు
మకరంద మాధురీ మహనీయ నీతులు
వేయి రీతుల కూయు వాయుదేవు
సర్పవృశ్చికలగ్న సంజాత ఘాతకుల్

పాతకుల్ కొలుచు పాప స్వరూపు
సరసవిద్యాలబ్ధ సంస్కారగంధంబు
బంధంబుగా నెంచు పరమలుబ్ధు
ఉభయ బాహా పరిగ్రహ విభవ మందు
సకల లోకైక భీకర సవ్యసాచి
నపర గజినీ మహమ్మదు నభినుతింతు
ఉన్న పుణ్యంబు కొంచెము నూడి పోవ

అలబృహస్పతి వేద నతని కిచ్చుటగదా
తలకాయలో గుంజుతక్కువాయె
బలి చక్రవర్తికే పంచి యిచ్చుటగదా
ఔదార్య మావగింజంత దాయె
కమలజునకు విద్య కట్టబెట్టుటగదా
పశువుగా నీవిట్లు బ్రతుకుటాయె
ఘన కబంధుడు కాలగతుడౌటచే గదా
కబళించుటే నీకు కార్యమాయె
అవుర నిను గూర్చి వర్ణింప నెవరి తరము
ఇంతమేటివి నీముందు ఎంతపాటి
కర్ణుడైనను ఆకుంభకర్ణుడైన
కోవిద విరోధి ! సర్వదుర్గుణ పయోధి !



ఆఫీసర్లు ఒక వైపు రాజకీయ నాయకులు మరో వైపు. వీరుభయులదీ ఒకే లక్షణమూ ఒకే తత్త్వమూ ఒకే దత్రైక్పథమూ ; ఒకే దాన్ని పంచుకోడానికి పుట్టిన దాయాదులు ఈ ఉభయ జాతులున్నూ - వీళ్లని తలచుకుంటే ఈ కవికి ఎంత క్రోధమో ఎంత సత్యాగ్రహమో చెప్పడానికి వీల్లేదు. వీళ్ళు నాగరక లోకంలోకి దారితప్పి వచ్చిన క్రూరమృగాలని ఆయన భావం - ధనిక వర్గం వీళ్ళ వెన్నెముక. అందుచేత ఇలా అంటాడు :

*ఊరూరంగల గ్రామ దేవతల కే యుద్యోగి పూజారియై*
*భూరిప్రీతి ఘటింపడో అతడు తద్భూత*
*ప్రకోపంబునన్*
*ఘోరంబైన యశాంతిచే నలిగి యాక్రోశించు టే గాక*
*దు*
*ర్వార క్రూరము లూర్ధ్వలోక శిఖలం భస్మంబు*
*గాకుండునే*

*అప్రయోజకులైన యీ ప్రజానీకంబు*
*ఘనతర క్షీర సాగరము గాగ*
*ఎల్లదిక్కులతాండవించు నజ్ఞానంబు*
*బలమైన మందరా చలముగాగ*

జాజ్జ్వల్యమాన ప్రజాస్వామ్య సూత్రంబు
త్రాడైన భుజగాధి రాజు గాగ
మహిత కోపాటోపమద మత్సరంబులు
గగన మంటెడు తరంగములు గాగ

చటుల కవికాల రాక్షస జాతులైన
రాజకీయులు నుద్యోగు లాజివోలె.
ఉభయ పార్శ్వంబులంజేరి యుగ్రధాటి
చిలుకు చున్నా పధికార సిద్ధికొరకు

ధనమదమత్తులైన దురితాత్ముల రక్త నదీ
ప్రవాహముల్
పెనగొని ధారుణీవలయ వీధులు సర్వము
ముంచునాడుత
ఘనతర మాంసఖండములు కాకులు గ్రద్దలు
మేయునాడు నా
కనుపమ శాంతి లభ్యమగు నంతియకాక
తదన్యమున్నదే

కనబడుచుండగా యెదట కన్నుల కున్నత
సౌధయూధముల్
కనక మయ ప్రభావ పరికల్పిత భోగవిలాస వాసనా-
జనిత మద ప్రలాపములు శల్యములై

వినిపించుచుండగా
మనము సముజ్జ్వలజ్వలన మాలి కలంబడి
క్రుమ్మగకుండునే.



పొంగుల్ హంగులు లేని భారత ప్రజలు భూదేవి
పూజార్హులై
శృంగౌన్నత్య ప్రతీకలైన విలసచ్ఛీతాచల చ్ఛాయలన్
గంగాకృష్ణలు నర్మదా తపతులున్ కావేరి గోదావరుల్
రంగత్తుంగతరంగ శీకరములన్ రంజింపగా ఘూర్జరీ
బంగాళాంధ్ర కళింగ ముఖ్య ముఖరత్ భాషావళుల్
పల్కుచున్
సంగీతమ్ములు పాడు ముద్దుపులుగుల్ జాతీయతా
శాఖలన్

నదులన్ని తుదకు తాముదధిలో నైక్యమై, వినువీధి
తాకగ వెడలినట్లు
రంగురంగులపూలు రమణీయ చైత్రమై, పుడమిని
వలపులో ముంచినట్లు
చైత్రమాసాదుల చారుశోభాతతుల్,

కాలపురుషునిలోన కలిసినట్లు
శుకపిక షట్పద శ్రుతులన్ని ఏకమై, విశ్వవేణువు
వెల్లివిరిసినట్లు
వేషభాషలు ప్రాంతీయ భేదములును, ఐక్యమై పోయె
భారతీయతను కలసి
భారతీయత సాంధ్యగభస్తి సోకి, శబలకాంతులు చల్లు
తుషార శిఖరి -

తరలి సరయువునుండి దక్షిణాంబుధిదాక చాపమెత్తిన
రామచంద్రుసరణి,
ప్రాగ్జ్యోతిషమునుండి పశ్చిమాంబుధిదాక, వేణువెత్తిన
కృష్ణ విభునిమనికి
కాశ్మీర బదరికా కాంచీపుర ద్వారకావేష్టి తోర్వి
శంకరుని నెలవు,
కాశీగయాప్రయాగాది సుక్షేత్రముల్, ఋషిగణమ్ములు
అనిమిషుల తావు.
ఇది పవిత్రదేశమ్మిది త్రిదివభూమి, ఇది సనాతన
భాగీరథీ ప్రవాహ
ధౌత భూఖండ, మిది భారత ప్రజాళి,
ప్రాణసంపదవోలె కాపాడవలదె.

తమసానదీతీర తరులతాదులలోన
కూసెను వాల్మీకి కోకిలమ్ము
ప్రాలేయగిరిగుహాభాగమ్ములందుండి
నినదించె వ్యాస కంఠీరవంబు
కేరళ ప్రాంతీయ గిరికుంజములనుండి
సాగె న్నద్వైత ఝంఝామరుత్తు
తుంగ భద్రానదీతోయవీథులనుండి
పలికెను వేదార్థభాష్య శుకము
సరసరమణీయ సాహిత్య శాఖలందు
కాళిదాసాదికవి విహంగముల గుములు
పాడె పదునాల్గు లోకాలు పరవశింప
ఇచట నీ ప్రియభారతోర్వీతలాన

శిక్షించు కైలాస శిఖరాధి రూఢుండు
ఈసడించినచో నుదీచ్యదిశను
గర్జించు పురిలో జగన్నాథ నాథుండు
పగదలంచితివేని ప్రాచ్యదిశను
కోపించు రంగండు కొల్లాపురీలక్ష్మి
ద్వేషింతువేని ప్రతీచిదిశను
కన్నెఱ్ఱజేయును కాంచీ జగన్మాత
యాగ్రహించితి వేని యామ్యదిశను
దేని ద్వేషింప గలవిది దేవభూమి

*తరతరాలుగ పూజించు దైవతములు*
*నదుల పర్వతముల నరణ్యముల వెలసి*
*ప్రజల పాలించుచుంద్రు కృపార్ద్రదృష్టి*



## రాజకీయ ఖండం

ధనికులమాయోపాయాలు తప్పించుకొని ధైర్యంగా నిలిచేశక్తి ప్రజల్లోలేదు. అందుచేత సజ్జనులు నిస్సహాయులై పడిఉన్నారు. ఇట్లాంటి దుర్మార్గ కాలంలో కవి ఖడ్గం ధరించి దుష్ట శిక్షణకు పూనుకోవాలి అధైర్య పర్యంకంలో ఉన్న ప్రజలకు ధైర్యం కల్పించి చైతన్యవంతుల్ని చెయ్యాలి. లోకానికి దారిచూపించాలి. విజ్ఞానమూర్తి అయిన కవికర్తవ్యం అదే, అయితే ఆ కార్యానికి సంప్రదాయ సిద్ధమయిన శృంగార రసం పనికిరాదు. లలితపద మిళితమైన కావ్యధోరణి చాలదు ఈ కాలపు కవిత్వం పురుషత్వ పటిమా జటిలంగా ఉండాలి. ఖడ్గధారా·సమానంగా ఉండాలి. హాస్యరసం అంతశక్తిని కవిత్వానికి సమకూర్చుతుంది. అందుచేత

హాస్యాన్ని ఆశ్రయించాడు ఈ కవి. ఆ బుద్ధితోనే దశావతారాల్లో కల్కిమూర్తిని అభిమాన దైవతంగా గ్రహించాడు. అగ్న్యాది దేవతలను ఆవాహనచేశాడు కావ్యయజ్ఞంలో, ధనమదోన్మత్తులను, అధికార దురహంకార పూరితులను మారణ హోమం చేయడమే ఈ కావ్యయజ్ఞానికి ఫలం. అందుచేతనే కావ్యారంభంలో దేవతాస్తుతి ఈ క్రింది విధంగా చేశాడు

*శ్రీమన్మంగళకల్కిమూర్తి పరిశుష్కీభూతధర్మావనో*
*ద్దామక్షాత్ర పవిత్రకీర్తి ఘనధారాఘోర ఖడ్గమ్మునన్*
*భూమిాజీవ పరిశ్రమాహరణ సంభూతార్థ*
*గర్వాంధులన్ గ్రామగ్రామ కబంధులన్ బిలిచి*
*సత్కారంబుగావించుతన్*

శుష్కించిన ధర్మాన్ని ఉద్ధరిస్తాడని, సమస్త మంగళ ప్రదుడని సాధుజనులచేత కీర్తింపబడే కల్కిమూర్తి, భూలోకంలో చెమటోడ్చి పనిచేసి బ్రతికే శ్రామికుల కష్టఫలాలని అపహరించి తద్వారా సిద్ధించిన భాగ్యం చేత గర్వాంధులై ఊరూరా వెలసిన కబంధులను. పిలిచి, తన వాడి ఖడ్గంతో సత్కారం చేయునుగాక అని ప్రార్థన.

తర్వాత కవి అగ్ని దేవుడి ఆవాహన చేస్తున్నాడు. అసితాధ్వుండు, ధనంజయుండు సకలాశాకాశ కోశభ్రమత్ వసుధా వస్తుసమస్త భక్షకుడునౌ దావాగ్ని దేవుండొగిన్ హసితాత్మీయ యశః ప్రశస్తులు నవీనాయాత మాంధాతలన్ గొసరుంగౌగిట గ్రుచ్చి మెచ్చుత కృపాకూపారమేపారగన్.

అసితాధ్వుడు అంటే నల్లనిత్రోవలో వెళ్ళువాడు కృష్ణ వర్త్మ అని అమరకోశం. అగ్ని దేవుడికి నామాంతరం. అట్లాగే ఆయనకి ధనంజయుడు అని మరొక పేరు, ధనమును జయించువాడు. అయితే అసితాధ్వుండుధనంజయుడుఅనిప్రక్కప్రక్కనచెప్పడం ఒక వ్యంగ్య స్ఫూర్తికోసం, నల్లత్రోవలో వెళ్ళి ధనాన్ని సంపాదించువాడు అని ధ్వని. భూమండలంలో ఉన్న సమస్తాన్ని భక్షించేవాడు. అగ్ని అట్లాంటిదేవుడు. మన నవీనాయాత మాంధాతలను అంటే కలికాల పరిపాలకులను కృపాతి రేకంతో కొసరి కొసరి కౌగలించుకొనునుగాక. ఎందు చేత అంత కృపాతిరేకం అంటే, తాను సర్వభక్షకుడనే కీర్తిపొందితే అదెంత మాత్రం అని అగ్ని దేవుడ్నే అపహసింపజాలినంత కీర్తిని ఈ కలియుగ అధికారులు గడించారు గనక వారిని అంతగా మెచ్చుకోవడం.

ఆ తర్వాత క్షీరసాగర మథనాన్ని తీసుకొని చమత్కరించాడుకవి

*శైలముదెచ్చి, వ్యాళమువిషంబున జచ్చి, పయోధిద్రచ్చి*
*జే జేలుసృజించినట్టి సిరి చేతికివచ్చి త్రిలోకపూజ్యతం*
*గ్రాలెడు నా పురాంతకమురాంతకులందు - ఘనుండు ధూర్తగో*
*పాలుడు నమ్మకొన్న నిజభక్తజనంబుల నుద్ధరించుతన్.*

క్షీరసాగరమథనం కుండలో పాలు చిలకడంకాదు పాలకడవను చిలకడం మనుష్యులకు సాధ్యమైనపని. కానీ పాలసముద్రాన్ని చిలకడానికి దేవతలూ రాక్షసులూ పూనుకుంటేనే అవుతుంది. వారుకూడా కొండంత కవ్వము తెచ్చి భూమిని మోసే పామును కవ్వపుతాడు చేసి దాని విషజ్వాలల్లో నలిగి క్షీరసాగరాన్ని మథించారు. అంతపనికి అంతటి వారు కావాలి, అంతటి పరికరాలు కావాలి. ఇది ఒక బృహత్కార్యం, అయితే ఇంత బ్రహ్మాండమైన కృషిదేనికి ? లక్ష్మికోసం, అమృతంకోసం అని చెప్పడం వర్తిగ్యాస్, ఉన్న తవర్గాల లాభంకోసం. సామాన్య వర్గాలను రెచ్చగొట్టటపు ఎడు దేశభక్తి అనీ జాతిఅని సంస్కృతి

అనీ వాయుగుంభన చేసినట్లే క్షీరసాగర మథనశ్రమకు ఆమృతం ఫలితం అన్నారు అనాటి పెద్దలు. శ్రామికులు నిజమే అనుకొని అసలు పాయింటు అయిన లక్ష్మిని మరచిపోయారు. మొత్తం మీద కృషి ఫలితాలను పంచుకోవడంలో తెలివి తక్కువగా పేచీలు పడడం మూలాన శ్రామికులు తీర్పుకోసం పెద్ద మనుష్యులను ఆశ్రయించవలసివచ్చింది. ఆ పెద్దలు పద్యంలో చెప్పిన పురాంతక మురాంతకులు - అంటే శివకేశవులు. పురాంతక మురాంతకు లనడం దేవాంతక నరాంతకులనే వ్యావహారిక ప్రయోగ స్ఫూర్తికోసం. ఆ పురాంతక మురాంతకుల్లో యింకా ఘనుడు ధూర్తగోపాలుడు, అంటే మురాంతకుడు. ఆ ఘను డేంచేశాడంటే - దేవాసురులకు తీర్పు చెప్పడానికి వచ్చి అమృతమనే పేరుచెప్పి అసలు పాయింటైన లక్ష్మిని తాను కొట్టేశాడు. మిగిలిన కుక్కలు గుర్రాలు గాడిదలు ఏవేవో ఉన్నాయే వాటిని దేవతలకు రాక్షసులకు పంచిపెట్టాడు భాగానికి వస్తాడేమోనని పురాంతకుడైన శివుడికి గరళాన్ని అప్పజెప్పాడు. వాడు దాన్ని తిని గింజుకుంటూ కూర్చున్నాడొకప్రక్క. ఈలోపుగా మురాంతకుడు తన పని తాను చక్కబెట్టుకొని వెళ్ళిపోయాడు. మోసం కనుక్కున్న రాహు కేతువుల్ని దొంగవెధవలని చెప్పి శిరచ్ఛేదం చేశాడు అందరి

అంగీకారం మీాదనే. ఇన్ని మతలబులుచేసి లక్ష్మిని చేజిక్కించుకున్నందు చేతనే అతను త్రిలోక పూజితుడయ్యాడు. అమాయకుల్ని మోసంచేసి, సరిసమానులకు విషం పెట్టి అడ్డులేకుండా చేసుకొని, అక్షేపించేవాళ్ళని చట్ట రీత్యా శిరచ్ఛేదం వగైరా హత్యలు చేసి ఒకడు ధనం గడిస్తాడు. ఊరకే ధనం వస్తుందా ? ఎన్ని అకృత్యాలు చేసినా వాడు డబ్బుగడించితే చాలు అవన్నీ తుడుచుకుపోతాయి. వాడ్నే లోకం ఇంద్రుడనీ చంద్రుడనీ భజనచేస్తుంది ; త్రిలోకపూజ్యు డవుతాడు. వాడు ఇంద్రుడూకాడు, చంద్రుడూ కాడు. కపీ కాడు, శాస్త్రజ్ఞుడూ కాడు ; ఏవిధమైన తెలివి తేటలుగానీ గొప్పతనంగానీ వాడికి లేవు కానీ లోకం వాడ్ని గొప్పవాడ్నిగా పరిగణిస్తుంది. అందుచేతనే ఒక ఆధునిక రచయిత కొన్ని పదాలకు చమత్కారంగా నిర్వచనాలు యిస్తూ ధనం అంటే ఏ ఘనతాలేని వెధవకు ఒక ఘనత యిచ్చేది, అని నిర్వచనం చెప్పాడు.

అదట్లా ఉంచుదాం పైవిధంగా తీర్పు చెప్పిన పెద్దమనిషిని నమ్ముకుంటే ఆయన ఎట్లా ఉద్ధరిస్తాడు? అదిగో ఆ దేవాసురులను ఉద్ధరించినట్లే ఉద్ధరిస్తాడు 'నిజభక్తజనంబు' అని తాత్పర్యం.

ఆతర్వాత వీరభద్రుడ్ని స్తోత్రం చేస్తాడు

*అనముపొంగెడు దక్షునిన్ సపరివారాటోప*
*రూపంబుగా*
*కసిదీరన్ నురుమాడి ఆడినమహాకల్పాంత ధారధర*
*ప్రసరాకారుని వీనులం జెనకుతన్ బ్రత్యక్ష రక్షోసమి:*
*త్యసమాకంధర బంధురాంధ తమసాహంకార*
*హుంకారముల్*

అంటే గర్వాంధుడై విర్రవీగే దక్షుడ్ని చావగొట్టిన వీరభద్రుడి చెవుల్లో ఈ ప్రత్యక్షరాక్షసుల అహంకార హుంకా రములు పడునుగాక, అంటే వీరభద్రుడు గర్వం అణచడానికి అవతారం ఎత్తాడు గనుక ఈ ప్రత్యక్ష రాక్షసులు అంటే ధనికులు అధికారులు అయిన ఉద్ధత వర్గాల అహంకారం వింటే వాళ్ళను కూడా దక్షుడ్ని చీల్చి చెండాడి నట్లు, చీల్చి చెండాడుతాడని కవి ఆశయము

శృంగార రసప్రధానమయిన సంప్రదాయ ప్రబంధాల్లో మొదట "శ్రీవక్షోజ కురంగనాభమెదపై చెన్నొంద" లక్ష్మితో సరసాలాడే విష్ణుమూర్తి లేక గౌరితో మేలమాడే ఈశ్వరుడు కృతి భర్తకో కృతి కర్తకో శుభములు చేకూర్చుగావుత అనీ కావ్యారంభం చేస్తారు. కానీ హాస్యరస ప్రధానమయిన ఈ అపూర్వ ప్రబంధంలో అట్లా కాక తీసుకొన్న దేవతలు ఖడ్గధారి

అయిన కల్కిమూర్తి, జ్వలించే అగ్నిదేవుడు, కాల భైరవుడు ఇత్యాదులు. వారంతా దుర్మార్గుల్ని శిరచ్ఛేదం చేయడమే గానీ వారి సతీమణులతో సరసాలాడడం గాదు, మనకాకావలసింది. అదే వర్ణించాడు కవి ఈ నూత్న ప్రబంధంలో, ప్రబంధం పేరు "కబంధకల్యాణం"

*అంతా సలక్షణంగానే నడిచింది. సుకవిస్తుతి కుకవి*
*నింద*
*ఇత్యాది కావ్య సంప్రదాయాలు నిర్వహించే*
*ప్రయత్నాలు*
*కూడా జరిగాయి - హాస్యరస ప్రబంధం గనక*
*ఆద్యుడైన జగ్గకవితో*

అయితే అదిపురిటిలోనే సంధి కొట్టినట్లు కొద్ది దూరం నడిచి అంతటితో ఆగిపోయింది. ఎప్పటికయినా ఆ కావ్యాన్ని పూర్తి చేయాలని మన కవికి జీవితంలో లక్ష్యం -

*సుకవి స్తుతి ప్రారంభం -*
*మును జగ్గాంకకవీంద్రునెంచి యవలం బూర్వాంధ్ర*
*నిర్ణేతలై*
*ఘనులౌ నన్నయ ముఖ్యులంతట నిదాఘాంతంబు*
*నందోచుక్రొం*

*జినుకుందోయమ్ములై ఇలం దనుపు శ్రీశ్రీ*
*విశ్వనాథాదులం*
*బ్రఙు తింతున్ మహనీయ వాఙ్మయ కళా ప్రాగల్భ్య*
*సంసిద్ధికై*

*తర్వాత కుకవి నింద-*
*కాకవి లోకము గనుజే*
*కుంకవిలోకమ్ము గనుక కమ్మ నివేళన్*
*సోకను వాక్కుల సైతము*
*కేకలు దశదిశల నింపు గేయాసురులన్ - అని*

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నేనొక హాస్యరస ప్రబంధంబు నిబంధింపం బూని లోకవృత్తంబును చిత్తంబున సమాయత్తంబు జేయుచు కవితా తపస్సమాధి నిమగ్నుండనై యున్న యవసరంబున రాకానిశాకర కిరణ సందోహదేహియు మహదాంధ్రపీయూష భాషాశేషాహియునైన శ్రీమత్కొట్టర్వన్వవాయపద్మాకర దివాకరుండగు తిక్కనేతి విశ్రుత నామధేయ మహనీయుండు సాక్షాత్కరించి దీవించి వత్సా! భవ దుత్సాహంబు కడు ప్రశంసనీయంబు, కవనము నల్లునప్పుడు త్వదీయాంతస్స్ఫురత్ తాళగతి మాధురీ వశంబున తర్జనీ మధ్యమాంగుళులను

పచరించుచు శిరఃకంపంబు చేయుచు తనువెల్ల తన్మయత్వంబున నటించుచు నుండువాడవు నీ కవితాకలభ మనితర సులభము. కవిత్వంబు కేవలము లలిత పదమిళితంబును కాంతా సమ్మితంబును గారాదు. కంఠీరవ సదృశంబును ఖడ్గ ధారాఘోరంబును పురుషత్వ పటిమా జటిలంబును గావలెను. దుష్టభూయిష్ఠంబైన కలియుగంబున కిదియ పరిగ్రాహ్యంబని సెలవిచ్చినం దెలివొంది కరకమలంబులు ముకుళించి యవనతుండనై బ్రస్తుతించితి ... ప్రకృతకావ్య రచనా విధానమునకు మేలు బంతిగా గై కొన్న శైలీలక్షణం బెట్టదనిన

*కరి భీకర గ్రాహ కంఠలుంఠనవేళ*
*హరిధరించిన చక్రఖుర మరీచి*
*కుంభినీధర సముజ్జృంభ మాగెడునాడు*
*గోత్రారి దాల్చిన కులిశధార*
*పృథివీశ నాశనాభీలకాలంబున*
*భార్గవుండెత్తిన పరశు హేతి*
*కాలకేయాది రాక్షస వధావిధినాడు*
*గాండీవి దీసిన కరకుకోల*
*స్మృతి పథంబుల ఝళిపింప జేయవలయు*
*వసుధ కలికాల రాక్షస వర్గదుర్గ*

*భేదనోదగ్ర ధాటి గుంభింపవలయు*
*తత భయంకర కవితాశతఘ్ని అగ్ని.*



ఒక నాయకాసురుడు తనమాట వినలేదని మన కవి మీద కన్నెర్రజేసి భుజం మీద కండువా వేసుకుని ఛలో చార్మినార్ అని రైలెక్కాడు వాడి రైలు కదిలిపోతుంటే వాడికి చదివించిన మంగళాష్టకం -

*వద్దోయీ ఇక పొమ్మటంచు ప్రజలే వాదించి*
*బాధించినన్*
*అద్దం బందునవోలె నీదు సరుకంతా యెంతో నీ*
*యాత్మకే*
*సుద్దంబైకనుపించుచున్న నుభవత్ శుష్కప్రతాపంబు*
*నా*
*వద్దం జూపెదవేల ? చాలు ఇక పోవయ్యా*
*ప్రజానాయకా !*

*అసలే నీవొక గడ్డిపోచవు వృథాహంకారమేగాని నీ*
*పసలోకంబునకెల్ల తెల్లముగదా బ్రహ్మాండ నాధుండవో*
*అసమాన ప్రతిభాధురంధరుడవో అన్కొందువా గర్వదు*

ర్వ్యసనం బేలర వాయుగుంభన కళా వ్యాపార
పారీణుడా

చేతం బత్రిక ఖడ్గమై మెరయ లాల్చీదాల్చి భస్మాసుర
భ్రాతా ఈతడనంగ పామరజన వ్రాతంబు
విభ్రాంతులౌ
రీతిన్ నీ వరుదేరు వేళల భవద్గ్రీవంబు భావింపగన్
బ్రాతఃకాల సముద్యదుగ్ర భుజగ ప్రాయంబు
ఖాయంబుగన్

కొంచెం బేనియు లేవు సద్గుణము లేకోశంబునన్
జూచినన్
మంచిం జేయుట కుద్యమింపవు మహామాయావివై
కొంపలన్
ముంచే కార్యములై నచో దిశలు మార్మ్రోయన్
భలో చార్మినా
రంచున్ మూపున కండువా వెలయగా రైలెక్కు
దొక్కుమ్మడిన్



## సాహిత్యఖండం

కాలేజీలో చదువుకునే రోజుల్లో కవీ తన స్నేహితుడూ కలిసి ఆశు కవిత్వం అభ్యాసం చేసేవారు. ఇద్దరూ ఒకే దగ్గిలో నివాసం. ఈ కవికి రాత్రి పదిగంటలు కాగానే నిద్ర ఆవరించేది. స్నేహితుడేమో ఇంకాలైటు వేసుకుని చదువుతూ ఉండేవాడు. అప్పుడు కవి అనేవాడు, "ఏమయ్యా పది ఐనదింక పడుకో" - స్నేహితుడనేవాడు, "ఏడ్చావులే ఊరుకో" ఇలా నడిచేది వాళ్ళ ఆశుకవితాభ్యాసం సర్వకాల సర్వావస్థల యందూ. ఎవరైనా వాళ్ళని, "ఎందుకండీ ఈ ఆశు కవిత్వం ఏదయినా ఒక మంచి పుస్తకం రాయగూడదా "అంటే "వ్రాయటయన్న ఎంతపని వ్రాయగలా రముగాని" అని ఒకడు అంటే "కాని ఆదాయము లేక వ్రాయుట వృధాయని ధీయనిశంబు దెల్పుటన్" అని రెండో వాడనేవాడు. "వ్రాయుట మానినారము" అని మొదటివాడు వాక్యం పూర్తిచేశేవాడు.

ఇద్దరూ కలిసి ప్రొద్దున్నే కాఫీ హోటలుకు బయల్దేరే వాళ్ళు, హోటలు అల్లంత దూరాన ఉండగానే ఒకడు పీసపాటిలా గొంతెత్తి.

*'అదిగో హోటలు కాలభైరవ వరాహాపూ్యహా*
*కోలాహాలా*
*స్పదమై భక్షక మక్షికాతుముల*
*దృశ్యాద్వారదుర్దాంతమై*
*మదమాతంగ తురంగ సంగర ధరా*
*మధ్యంబుగాదోచునా*
*సదనంబునన్ దరియంగ జొచ్చుకొనగా శక్తుండనే*
*మిత్రమా.*

వెంటనే రెండోవాడు లంకించుకునేవాడు

*"నేనుండంగ ప్రచండ ఖండన కళా నిష్ణాతుడన్*
*బాలకా*
*లోనన్ నీకు భయంబదేల పద కల్లోల*
*ప్రపంచంబునన్*
*లీనంబై పెసరట్లు గారెలును ఇడ్లీల్ చీల్చి చెండాడు, నీ*
*జాను వ్యాప్తములైన బాహువులతో సవ్యాప*
*సవ్యంబుగన్"*

ఆ విధంగా కురుక్షేత్ర యుద్ధంలో కాఫీ అధ్యాయం ముగిసేది.



ఒకనాడు మిత్రుల్లో హాస్యధోరణిలో ఆశువు నడుస్తూ ఉంది. అప్పుడు మన కవి తనవంతుకు చెప్పినవి

భామలు దోమలు -

భూధవుడైనా సరియే
వేధించును పగటి వేళ విడువక ఈగల్
మాధవుడైనా సరియే
బాధించును రాత్రి వేళ భామలు దోమల్

రేలంగి -

పోలింగు లేని యెన్నిక
ఆలింగన సుఖము లేని అంగన పొందున్
రేలంగి లేని చిత్రము
ఏలింగము లేని గుడియు ఎందుకు మహిలో



ఒక గీర్వాణ మిత్రుడికి ఉగాది శుభకాంక్షలు చెప్పవలసి వచ్చింది. అప్పుడు ఈ కవి ఇలా చెప్పాడు

చైత్రాగమ ద్విగుణి తోత్సవ మత్సరేణ
గాయంతి తే శుకపికద్విజ ఋత్విజోద్య
బాలప్రవాళ చలదగ్ని శిఖాముఖేషు
క్షిప్త్వా సుమాని సమధూని హవీంషి కృత్వా

ఒక విద్వాంసుడు శ్రీమత్ ఛేషేంద్ర శర్మా జగతి విజయతే మండనం పండితానాం అని కవిని ప్రశంసిస్తూ శ్లోకాలు పంపించాడు కవికరిగిపోయి అప్పుడు చెప్పిన శ్లోకాల్లో ఖిలమై పోయినవి పోగా మిగిలినవి

ధన్యోస్మి విబుధోత్తంస !
భవత్సూక్తి సమాదృతం
ఆషాఢ శీకరాసారైః
అరణ్యానీవ మన్మనః

అలమేకస్తవ శ్లోకః
రస వార్ధి పిచండిలః
అహోసౌభాగ్యమేతస్యా
సాక్షాదైరావతః స్వయం

మదీయ కావ్యసంసారః
ప్రత్యూహోపహతోముహుః

*సేవ్యతావృత్తి బద్ధోహం*
*పంజరే కుంజరో యథా*



నాందీ ప్రస్తావన -

చొప్పదంటు సుబ్బావధాన్లు లఫంగు లక్ష్మావధాన్లు ఇద్దరు సహోదరులు తెలుగు సాహిత్య రంగంలో మారీచ సుబాహువుల్లా ఏలుతున్నారు. వాళ్ళు రాహుకేతువులవలె ప్రతిభకు గ్రహణ కారకులై పీరవిహారము చేయు చుండగా కరటక దమనకులు, శ్రావణ భాద్రపదములు అను నామధేయములు గల కవుల జంట కవిత్వంబున రాజ్యంబుచేయు చుండె - అట్టియెడ

*పదముల పాలి రావణులు భావము పాలిటి*
*కుంభకర్ణులున్*
*సదమల చాతురీ కలిత సాహితి పాలి కబంధులున్*
*మహో*
*వదనులు శూన్య మస్తకులు వాఙ్మయ రంగము*

నాక్రమింపగా
కదలెను సాధు వర్గమదిగాంచి యశఃప్రతిసీరవెన్క-కున్

నీతికి నీడలేదు నవనీత మనస్సుకు తోడు లేదు వి
ద్యాతిశయమ్ము మిక్కిలి యనర్థము - వాఙ్మయ
మండలమ్మునన్
చాతక పక్షులం దరిమి చంద్రుని మ్రింగిరి
రాహుకేతువుల్
నా తెలుగుం బ్రజాగళము నాటికి నేటికి మారె
నెంతయున్

తిమిర కుటీర సీమలకు దీపము దెచ్చెడు వాడు
గుండెలో
అమలిన ప్రేమ వల్లికల కల్లిక వెట్టెడు వాడు శేముషీ
కమల వనమ్ములం జెరచి కల్మష పంకము పైకి దెచ్చు
దు
ర్దమ మహిషాసురాధముల దర్పమడంచెడు వాడు
కావలెన్

అందుకనే -

మందల్ మందలు పండితా హ్వాయ మహామారీచు
లీలోకమం

*దెందుం గన్నను ఇందరెందు కనినే నీ*
*దండయాత్రార్థమై*
*డెందంబాగ్రహ బంధురంబగుట నేడే నా కలంబెత్తితిన్*
*వందల్ వందలు దూక మత్పద సదావందారు*
*వాగ్బృందముల్*

ఇంతలో తెర లేస్తుంది -

ఒకనాడు నారదుడు ఆర్మోణీ వాయించుకుంటూ ఆకాశ మార్గాన పోతూఉండగా పొరపాటున పిలక మబ్బుల్లో ఇరుక్కుంది. అరరే తన్మయత్వంలో కొంపమునిగిందే ఇదెలా వదిలించు కోవడమా అని ప్రయత్నించి ప్రయత్నించి విసుగేసి ఒక్కసారి గట్టిగా లాగాడు దెబ్బతో ఆ పిలక్కాస్తా ఊడి, తానేమో జారి, భూమండలం మీద పడ్డాడు. ఎక్కడా ? చెరువు గట్టున - చూస్తే దూరాన చింతచెట్టు కింద చొప్ప దంటు సుబ్బావధాన్లూ లఫంగు లక్ష్మావధాన్లూ ఏమిటో పోట్లాడు కుంటున్నారల్లే ఉంది. ఇద్దరి పిలకలూ తెగ ఎగురు తున్నాయి. అరే! మన తెగవాళ్ళు, గొప్పస్తోత్ర విద్యాప్రవీణులు, మన కులంలోనే ముసలంపుడితే ఎలాగ అనేసాను భూతితో దగ్గరకెళ్ళి "ఏమిటోయ్ ఇలా దెబ్బలాడు కుంటున్నారు" అన్నాడు

"ఓహోహో తమరా దేవరుషి నారదుల వారు ; మీ తంబురా వగైరా, చూస్తే, సందేహ మక్కర్లేదు" అన్నాడు లక్ష్మావధాన్లు.

"ఔనౌను-తంబురా ఉందిగానీ ఆ వగైరా ఏమిటి, అది నా దగ్గర్లేదే?"

"అసలు మీ దగ్గర ఉన్న విశేషం అదే నండీ" అంటూ ఉండగా

"తమరిప్పుడే దిగినట్లున్నారు" అంటూ దగ్గర కొచ్చాడు సుబ్బావధాన్లు తను దూరంగా ఉంటే రెండోవాడి కెక్కువసోకుపు దొరుకుతుందేమో అన్న భయంతో -

"ఏడ్చావ్ చెరువుగట్టు నా ఎర్పోర్టనుకున్నా వాఏమిటి?-అసలు గొడవేమిటో చెప్పు"

వెంటనే లక్ష్మావధాన్లు తోసుకొచ్చి, "ఏమీ లేదు మహాశయా వీడున్నాడే మా సుబ్బావధాన్లు మొన్నొక కవి సమ్మేళనానికి వెళ్ళాడుట; వాడి మొహాన వత్తి గుడ్డముక్కొకటి పారేశారట. ఒక నయాపైసా అయినా వాసన చూపించ లేదట - నే చెప్పాను, పోసీరా ఆగుడ్డముక్క వాళ్ల మొహాన పారేసి దాని ఖరీదెంతో అదే

నీ మొహాన పారెయ్ మని అడక్కపోయ్యావూ, అన్నాను - వాడేమంటున్నాడంటే ఇక మీదట కవులుగాని వాళ్ళనీ ..." అని చెపుతూ ఉండ గానే నారదులవారు అందుకుని

"అంటే కవులేమిటోయ్-ఏమిటదీ, మీ భూమండలం మీద ఏదైనా అంటువ్యాధా ఏమిటి?"

"కాదండీ బాబో-కవులు-కౌస్"

"ఏడ్చావ్ కౌసేమిటి నీ మొహంఅదింగ్లీషా తెలుగా-నీవెధవ బ్బాషా నువ్వూను"

"కవులు-కవులు; వాల్మీకి కాళిదాసూ అలాంటి వాళ్లు"

"ఓహో అలాంటి వాళ్ళు మీ కింకా ఉన్నారేమిటో"
"ఓహో తమరికి తెలియని దేమిటి, త్రికాలజ్ఞులు"
"ఆ సరే-కానీ"

"**కవులు** కాని వాళ్ళను సమ్మేళనాలకు **ఇహాపిలవరట్ష** మన గతేమిటీ అంటాడు మావాడు. **నాకూ దిక్కుతో**చటంలేదు. పెద్ద ఉపద్రవంవచ్చి పడ్డాది. ఏం చెయ్యమంటారు గురో-మీ జాతి వాళ్ళం,

గీతపనివాళ్ళం, కోతపనివాళ్ళం - తిండికే కరువయ్యేలా ఉంది చివరికి".

"ఓరి వెధవ ప్పీనుగుల్లారా కవులుగాని వాళ్ళు అంటూ ఎవరన్నా ఉన్నారుట్రా? అసలు మన చొప్పదంటు వాడ్ని వాళ్ళెప్పుడూ పిలుస్తూ ఉంటారుగదా వాడు చిన్న తనంలో ఎప్పుడో రాసిన పద్యాలు ఎప్పుడూ చదువుతూ ఉంటాడు గదా-వాడి కిప్పుడేం వచ్చిందిరా-ఒరేయ్: అన్నరే గానీ-అసలు ఈ వెధవ కవిత్వానికి కవి అంటూ ఒకడు కావాలా ఏమిటి? అదిగో (దూరానికి చూపిస్తూ) అల్లా మంగలాడ్ని తీసికెళ్ళి ఒక మహా కవిని చెయ్యనా? చెయ్యనా ఏమిటి? చెప్పు ఆ చంకలో పొది అవతల పారేస్తే ఆ రింగుల జూత్తూ,వాడూ,వాడికేంతక్కువరా-మీ తెలుగు దేశంలో వాడ్ని ఎదిరించే వాడే ఉండడు".

"బాబ్బాబు, అదెలాగుండీ, అది మాక్కాస్త చెబుదురూ"

"ఏ ముందోయ్ ఆంధ్ర ప్రభో ఏదో ఒకటి, ఒక దిన పత్రిక తీసుకో-అందులోదే ఒక వార్త తీసుకుని తోకల్తోకలుగా కత్తిరించి వాటిని కిందా మీదా చేసి రిఆరేంజ్ చెయ్. అర్థముందా లేదా చూడకు. చూచావో,

చస్తే నీవు కపివి కాలేవు ఈ యోగాభ్యాసం చేస్తే ఎవడైనా సరే, ఏడాది తిరిగే సరికి, మహాకపి కాకపోతే నా పిలక తీసి నీ మొలకతికిస్తా"

"అమ్మ బాబోయ్ అదెలాగండి దానికి అర్థం పర్థం ఉండక్కర్లేదుటండీ"

"ఒరి వెధవ ప్పీనుగుల్లారా ఆర్చిబాల్డు మెక్లీషు ఏమన్నాడురా? ఆ పుస్తకం తీసి చదువ్".

"బాబూ అందులో ఈ ట్రిక్కులన్నీ ఉన్నాయేటండీ"

"ఛీ వినునాటయిమయిపోతోంది -మెక్లీషు ఏమన్నాడంటే, ఏ పొయెం నీడ్సునో మీనింగు అన్నాడు".

"అన్నాడూ- మహారాజులా అంటాడు - వాడికేం బాబూ చచ్చేది మేమేగా"

"మరి కనీసం ఏదో ఒక అందమన్నా ఉండక్కర్లేదండీ"

"లేదండీ-ఈనాడు కవిత్వం భయంకరంగా ఉండాలండీ-భయం-భయం అంటే ఏమిటో తెలుసా - తెలుసా (అని గట్టిగా అరిచాడు ఉరిమిచూస్తూ)

"తెలుసు బాబోయ్" అని ఇద్దరూ కేకవేశారు ఏకగ్రీవంగా

"అదీ మా దేవలోకంలో ఈనాడు ఫేషన్ - చూడూ - చూడూ - ఇలా చెప్పాలి ఉదాహరణకు విను"

"గుహల్లోని మానవుడు
మహల్లోకి వచ్చిందాక
చరిత్రను పరిశీలిస్తే
పేజీకోక యుద్ధం
రాజీ ఒక అబద్ధం
నిహతుల బంధువ్రాతం
పొందిన హృదయాఘాతం
వికలాంగుల విలాపగీతం
ప్రతిపదంలో అంతర్ఘాతం
ప్రతివాక్యం రక్తం స్నాతం"

ఇదీ లాభం లేదోయ్ - మరింత స్ట్రాంగ్‌గా రావాలి"

ఒకడు మెల్లిగా బెదురుతూ బెదురుతూ "మరే, కాంతా సమ్మితమన్నారు గదండి."

" ఎవరండీ - ఎవడోయ్ ఆ అన్నవాడు ? వాడి డొక్కచింపుతా మీరోజుల్లో వాడ్ని మళ్ళీ ఆ మాట కూయమనుచూద్దాం వాడి కెన్ని దమ్ములున్నాయో"

"పోనీండి బాబూ మాకెందుకా గొడవ? మేమంతా ఉదరనిమిత్తం బహుకృతవేషం - అయితే బాబూ కాంతా సమ్మితంగా ఉన్నదాన్ని భయంకరంగా ఎలా చెయ్యడమండి ఆ కిటుకేదో చెబుదురూ - మమ్మల్నెవరూ పిలవడం లేదు. ఆ కిటుకేదో కాస్త ఉపదేశం చేద్దురూ బాబ్బాబు-"

"కిటుకా - అల్లా దారికారా- లేకపోతే మోడరన్ కవ్వైలా అవుతావురా చవటహో! పొట్టకాడికూడు కాస్తా పొగొట్టుకుంటావురా తండ్రీ - నేర్చుకో- కవిత్వంమంటే గయ్యాళి. తెలుసుగా గయ్యాళి - నీకు తెలియక పోవడమేమిటి- దాంతోనేగా సంసారం చేస్తున్నావ్- మరోగయ్యాళితో కలిసి కాపురం చేయడమే, కవిత్వమంటే - నీ కవిత్వం గయ్యాళిలా మీదపడి రక్కాలి తొక్కాలి ఉమ్మేయ్యాలిబూతులుతిట్టాలి; హాహా కారాలు ఆర్తనాదాలు చెయ్యాలిరా నాన్నా - ఏం అలా

చూస్తున్నావ్ - గయ్యాళి కాంత కాదేమిటి ? ఫక్తు బ్రహ్మరాక్షసిలా ఉండాలి తెలుసా - అలా గని ఏదో నోటి కొచ్చిందల్లా రాస్తూపోతే కూడా చాలదు. దానికి కొందరున్నారు, పెద్దలు, "పెద్దనవలె గద్దనవలె ఎద్దన వలె కుందవరపు కౌ చౌడప్ప" అన్నట్లు ఈ కవిగాళ్ళందర్నీ నిలబెట్టి కుక్కల్లా డ్రిల్లు చేయించే వాళ్ళు - అదొక సాహిత్య పంచాయతీబోర్డు".

"శవ పంచాయతీ అంటారేమరి అదేమిటండీ"

"ఛీ శవపంచాయితీ ఏమిటి నీ మొహం - ఇదంతా పెద్దలు కూర్చునే బోర్డోయ్ ఆ పెద్దల చూట్టూ ఓపిగ్గా తిరగాలి మీరు. ఒక్కో చుట్టుకు కడుపు చూచుకోగూడదు - ఓపిగ్గా తిరగాలి - అలా తిరగ్గా తిరగ్గా చివరికి వాళ్ళు కటాక్షించి ఓ వెంట్రుక పీకి మంత్రించి మీ మొహాన పారేస్తారు, అదే -

ప్రెయిజై భూరి నభోంతరాళములకున్ భేరీ మృదంగ ధ్వనుల్ రైయిజై నీవు పితామహాది బిరుదశ్రేణీ పరాకాష్ఠయౌ సయిజై సర్వ విమర్శకాధముల పంచాంగంబులం జేరి మే కయిపోవే సకలాంధ్ర జాతిముఖ రేఖా బ్రహ్మదేవుండవై.



ఒక విమర్శకారుడు అసూయాద్వేషోరగ విషదంష్ట్రా దష్టుండై కవిని వ్రాతపూర్వకముగా అవమానించగా వానికి వ్రాతపూర్వకముగానే కవి చదివించిన సన్మాన పత్రము -

*కవితల్ వ్రాయుట చేతగాని వెధవన్*
*గర్జన్మహాసింహామం*
*చవిలంఘ్య ప్రతిభాధురంధరుడు వీడంచుం*
*బ్రశంసింతువో*
*చవటా నీకు అధీతి నీతి ప్రతిభా సౌజన్యముల్*
*పూజ్యముల్*
*కవికంఠీరవ మోంద్ర పెట్టు నటరా కౌపీనవాస ప్రభూ!*

*గుండెలోన నీకు కొత్త లోకము లేదు*
*పాత గడ్డి తినెడి బ్రతుకు నీది*
*పిలకదీసి నీవు పేంటు ధరించితి*
*వింత మాత్రమునకె ఎంత పొగరు !*

ప్రజలారా ఈ పగటి వేషగాళ్లు యమ్మెబిరుదాంకితులుసాహిత్య సామాజిక భూస్వాముల పాదములకు అంకితులు స్వార్థకళంకితులు అయిన ఈ విమర్శక నామధేయుల నిజస్వరూపము తెలుసుకోండి వీళ్ళు వర్గ భజన పరులు. సోషల్ క్లయింబర్స్. వీళ్ళ భజన గీతాలు

రెండే - ఒకటి, "భజనచేసే విధము తెలియండీ జనులార మీారు " - రెండు," భజనపరులకేల దండపాణి భయము మనసా " - వాడ్నిచూడ గానే వాడి శిరస్సు ఖండించండి, వాడ్ని పోల్చుకొనుటకు గుర్తులెట్టి వనగా -

*అన్యుల విద్వత్తు నపహరించి ధరించు*
*తనదిగా ఝళింపించి తాండవించు*
*గగనభాస్కరుడేని కాంద్రించి ఉమ్మేయు*
*అల్పదీపాలకు అంజలించు*
*సాహిత్యమును లాభసాటి బేరము జేయు*
*కులగోత్రములు జూచి విలువగట్టు*
*తెలుగులోకము దాటి వెలుగులోనికి బోవ*
*డాత్మ విశ్వాసమే అతని కోట*
*అక్షరము రాదు మెదడు లేదంత కన్న*
*చదువుపై గాదు ఆసక్తి పదవిమీాద*
*అధము డయ్యు విమర్శక వేధవ పైకి*
*రాజుగాదోచు వట్టి భట్రాజువాడు !*

*కవిగాని ఖలుని పొగడును*
*కవి చంద్రుల మోమునేని గాంచక విడుచున్*

*వివరించి చూడనంతయు*
*కవితల మొలక్రింది గడ్డికాదె విమర్శల్*



కుతుబ్‌షాహీలు నిర్మించిన భాగ్యనగర్ ఇప్పుడు ఆంధ్రుల రాజధాని. అందులో ధనరాజ్‌గిర్ వంశము కవి పండిత పక్షపాతము నకు ప్రసిద్ధి చెందినది

ఆయన పుత్రి ఇందిర బహుకావ్యకర్త్రి. అదే సందర్భము -

*సరదాలోలురు కావ్యశీలురు కుతుబ్‌షాహీలు*
*మోహాలస*
*స్ఫురదిందీవర చారు నేత్రలును ఏషోకైన*
*సాయాహ్నమా*
*ధురిలో గన్న మనోహరోహయొగదా*
*ద్యోమార్గముందాకుగో*
*పురమై నేటికి రాజధాని పురమైపోయెన్*
*విశాలాంధ్రకున్.*

మూసీ చంచల నిర్ఝరంబు మెడలో
ముత్యాలహారంబుగా
హూసేన్ సాగరవారి పూరము మెయిన్బొయ్యారపున్
రైకగా
వాసిం భాగ్యపురీల లామ కవితా
వైలాస్యలాస్యాంఘ్రివి
న్యాసంబుల్ పచరింప దేలుదుము నేడా నంద
మందాకినిన్

ఆ వెలువారు భాగ్యనగరాంగన మంజుల సాహితీ
విలా
సోచిత వేళలం బ్రజల చూపులు చేపలవోలె దూకగన్
రేచిన కోర్కెదాల్చు కబరిన్ ధనరాజగిరీంద్ర వల్లికిం
బూచిన మల్లెపువ్వు, వలపుల్ నలుదిక్కుల
బుక్కిలింపగన్

పారం పర్యసమాగత ప్రథిత గోస్వామీయ విస్పార
సంస్కారప్లావిత, సాహితీ మధుపరాజీ కంజ కింజల్క ని
హారోదార మరందధార, సుజన వ్యాహార తారావళీ
హారాలంకృత కీర్తి కంధరయు రౌప్యస్వచ్ఛ
చారిత్రయున్

కమ్మని పల్కుతో విగతకల్మష సాదర మాధురీ వరీ
యమ్మగు తీరుతో నెసగి యాంధ్ర సరస్వతి తోట
కందచం
దమ్ములు గూర్చె నిందిర వదాన్య, మహాకవయిత్రి
యామెనె
య్యమ్ములు మర్వరాని తలి రాకుల పాకలు తేనె
వాకలున్.

ఆభావాల గారడీలో వసంత విపినంగా మారుతుంది హృదయం అప్పుడు - చెట్టుచెట్టూ సంగీత నిలయం ! పుట్టపుట్టా రంగులవలయం ! వాహ్

చూచినంచనె వలపుతోచింది చెలియా
కలుసుకున్నామంటె ఖాయమవుతుందే
కాకుంటె నా మనసు గాయమవుతుందే ...........

పిలుపులో నీ కంటిమలుపులో ఉందో
తలపులో జాబిల్లి తెలుపులో ఉందో
ఎక్కడుందో వలపు యెలా వచ్చిందో...........

మలయానిలము చేయు మాయయో యేమొ
కలికి వెన్నెలచేయు గారడీయేమొ
జలజాక్షి నీ యింద్రజాలమేనేమొ ...........

మల్లెతీగలజంట లల్లుకున్నా రీతి
మేను మేనూకలిసి కానలో బ్రతికినా
కలకాలమూ మధుర గాథగా నిలవాలి .........

రావె రావే రావే చాందినీ
ఆ పొన్నచెట్టుకాడ, ఆ గున్నమావి నీడ నే నుంటా
నేను రానూ పోరా మావయా
చిలకమ్మ చూచిందంటె, కాకమ్మ చెప్పిందంటె ఓ
తంటా
చాకిరేవుకాడ తప్ప లోకమంతా కన్నుమూసి
మద్దినాల ఎండలోన మగతగా పడున్నాది
రావే రావే
చకోరి నిన్నే కోరి నీకాళ్ళచెంత చేరి
తరిస్తా వరిస్తా రావే
చింతనిప్పు చల్లినట్లు పుంతలన్ని మండుతుంటె
చిగురుటాకులాంటి చిన్ని కాళ్ళు రగిలిపోతయిర బాబు
నేను రాను
రావే రావే మేరీచాందినీ
జిలేబి లాంటి దానా గులాబి రంగు దానా
నాదానా రావే
సన్నజాజితోటలోన సాగవచ్చినావంటె
తామరాకుతోటి నీరు తయారుగా ఉంచుతానె రావే

హామేషా నిన్నే చూస్తూ తమాషాతెన్నో చేస్తూ
తరిస్తా, రావే

గాంధర్వయోగి శ్రీద్వారం వేంకటస్వామి నాయుడుగారి ప్రశస్తి

ఒక గంధర్వుడు బంధముక్తుడయి నీలోన్నీలి
తాకాశవీథికి వెగెన్
నవభావ రాగమృదు చాంద్రీసాంద్ర పత్రమ్ములం
దొక స్వేచ్ఛా రమణీయ హేల కొలువై
యొప్పారగా, పారగా
సకలోర్వీతలమందు బాష్పజల
వర్షాకాలకూలంకషల్

నునుసోగ వెన్నెల నూలుపోగులతోడ
అల్లిన పక్షమ్ము లాడుచుండ
వెంగావి లేయెండ చిలుకరించెడు కనుల్
దూరంపు కోనలు దూసుకొనగ
పసిడి చేరులవంటి బాహుదండమ్ములు
పైకెత్తి వినువీధి పట్టుకొనగ
తరుణ హిరణ్మయ తనువుపై దాల్చిన
చేలమ్ము గాలిలో తేలియాడ
చుక్కలన్నియు చకితలై చూచుచుండ

ఎగిరిపోయెను మంజుల హేలతోడ
ఏకమైనట్టి శాశ్వతలోకమునకు
తరుణ మోహనమూర్తి గాంధర్వయోగి.

స్వచ్ఛస్నేహానికి అద్వితీయ ఉదాహరణ శ్రీ పొన్నలూరు కోటారెడ్డి ప్రశస్తి

పున్నమనాటి రేయి విరబూచిన
కన్నె గులాబి గిన్నెలో
వెన్నెల తూలికం దడిపి విశ్వ
విధాత దిగంత సీమలం
జెన్నగు మేలు బంతిగ వచించి
రచించిన యట్టి సర్వలో
కోన్నత మూర్తినా హృదయ కోటర
వాసికి సాటి యుందురే.

మాటలు గావు మా హృదయ
మంజుల కుంజములందుజల్లు ప
న్నీటి వెలంది తేట, లది
నెయ్యముగాదు సరోజపత్రికా
పాటలకాంతి పుంజములపై
బరుగెత్తు మరంద ధార, వే

యేటికి సాధుతోయధి జనించిన
పూర్ణ శశాంక మూర్తియే.

వేయుగులాబికన్నె లర
విచ్చునుగాక సహస్ర కోకిలల్
కోయని కూయుగాక ఒక
కోటినిశీథులు పండువెన్నెలల్
గాయునుగాక నా హృదయ
కంజము రంజిలబోదు తన్మృదు
చ్ఛాయల కోయిలంబలె
ప్రశాంతి వసింజెడు వేళలంబలెన్.

తనసౌహార్దము సత్క్రియాచరణ
విద్యావద్యమేగానియే
క్షణికామోదవినోదకాల కలనా
జన్యంబుగా, దా మనిన్
వనసీమల్ పులకించి పూచి
వలపుల్ వ్యాపించి దీపించిన
ట్లునయంబు న్ విలసిల్లు గాత
మని నే నాశింతు నెంతేని యున్.

కలిమిజూచి నేను కట్టుబడ్డదిలేదు
బలిమిజూచి బెదరి పారలేదు

చెలిమి నన్ను బట్టి సేవకునిం జేయు
చిగురుగుత్తి నాదు చిత్తవృత్తి.

పుంభావ సరస్వతి అయిన శ్రీవేదం వేంకట రాయశాస్త్రి గారిని గూర్చి చెప్పిన పద్యమాల -

శ్రీమహానీపాణి సరసీజము నం
గఱమూని పాండితీ
సామజరాజమెక్కి బహుచాతురితో భవభూతికాళిదా
సామరు కాది దివ్యకవి చంద్రుల నోరిచి యాంధ్ర
సాహితీ
సీమలు పెంచె వేంకట విజేత దృగంత దిగంత జైత్రుడై

నైషధ సామ్రాజ్య నానామణీగణ
శ్రీకొల్ల గొట్టి భాసిల్లు నాడు
ఉద్భట కృష్ణ రాయోక్తి దుర్గంబుపై
దుర్ధర్షధీఘటుం ద్రోలునాడు
ఓరుగల్లు ప్రతాపోజ్జ్వల విభవంబు
హాస్యలీలం జూఱలాడు నాడు
గీర్వాణ శుద్ధాంత కృతికాంతలందెచ్చి
చెలులుగా నాంధ్రికింజేర్చు నాడు
కలిత సాహిత్య మండలాఖండలుండు
ఘనుడు వేంకట రాయండు క్రందుకొల్పు

వాణి ధాటికి కింకవి శ్రేణి విరిగి
పరుగులిడెగాదె కాననాంతరము లంటి -

సరసుల పాలి కల్పలత ఛాత్రుల కొంగు పసిండి
సాహితీ
సరణికి మేలు బంతి వనజాసను రాణికి కొల్వుకూట
మం
బరధురి తోడబుట్టువును పండితమానుల
ప్రాణగోద్ధమున్
సరిగలదే దిశాదశవిశాల యశుండగు శాస్త్రివాణికిన్ -

కెరలి వసంతమందు పులకింపగ మంపగు కొండ
కోనలం
బరుగిడు కన్నె కాలువలు పచ్చని తోటల గున్న
మావులం
దిరిగెడు గండుకోయిలలు తీగెల నూగెడు
చిల్కబోదలున్
విరిసిన పూవు దేనియలు వేదము వారి
వచోవిలాసముల్

కమ్మని జాను తెన్గున నిగారవు క్రొంజిగురాకు
కెంజిగిం
జిమ్మ నవీనకల్పనలు జేసి సరస్వతి తోట కందచం

దమ్ముల గుస్తరించు కవితారస దోహలుడైన శాస్త్రి ధీ
ముమ్మర మెన్నగా వలపు మోపరి మేపరి కేని శక్యమే.

కొల్లగు గాత తద్యశము క్రొన్నెల వెన్నెల వానజల్లులై
చల్లని చందనాంబువుల జాలయి శారదనీరదం బులై
మల్లియపూలతో టలయి మవ్వపుతేట తెనుంగు
బాటలం
దెల్లెడ బ్రాకి యల్లు కొనె నెల్లరి యుల్లము లుల్లసిల్లగన్

ఆ కవి సోమయాజి కవితామృత సాగరవీచి
మిన్నులం
దాకిన నాడు, నీ కవి యనంత మనీష వచః
ప్రపంచమం
దేకసితాపత్రముగ నేలిననాడును మాపినాకినీ
ప్రాకటకీర్తి వల్లికలు బ్రాకె విశాల దిశా పథమ్ములన్

ప్రతి భాధాటి బృహస్పతిం ద్రిదివ సారంగీ
దృగాలింగనా
గతికిం బుచ్చి మణీఘృణీ మహిత నాగాధీ శ
భోగంబులన్
క్షితిపాల్ జేసి యఖండ వాఙ్మయకళా శ్రీ సార్వ
భౌముండు మా
స్మృతి దేశంబులకేగు దెంచె త్రి జగజ్జేగీయ
మానోన్నతిన్

చిరమధురంబులై పలుకు చేడియ కాలి పసిండి
యందెలం
బురికొని మేలమాడెడు ప్రభూత జయధ్వజ కింకిణీ
ధ్వనుల్
దరిసెనవే రసజ్ఞ జనతాంబుధి చంద్రు నకై రచింపుడో
కరకమలంబులార కసుగందని మల్లియపూల దండలన్



కదాచన కవినా కస్యాపి అన్యభాషాకావ్యస్య స్వేన కృతస్య ఆంధ్రానువాదస్య ఆదౌ గదితాని పద్యాని కతిపయాని -

ప్రథమతః కవే స్తోత్రపాదానాం శ్రీమతాం సుబ్రహ్మణ్యానాం చరణకమలేషు ఇదమనువాద కావ్యం సమర్పితం - తస్యసందర్భస్య పద్యాని

అమరాను బంధము

ప్రణయాపాంపతులీరు కండ లెమ్ము కల్ భావింపగా
మీదు మై
గొనబుందివెలలోన గైకొని గదా క్రొందీ వెనుంబోలె
నా

యునికింగూరిచె విశ్వశిల్పి; యిక నెట్లొ
హింతుభేదంబు నో
జనకా నా ప్రతి రక్తబిందువును సంశ్లాఘించు మీ
నామమున్

అరవిరి నేగు శేనగవులందము జిందెడు మోము, తేని
యల్
గురిసి ముదంబుగూర్చు పలుకుల్ పచరించుట,
లంతకన్న మీ
యరమర లేని ప్రేమయును ఆకనువిందగు రూపు
చందమున్
మరువగ నౌనొకోమరతుమన్నను ఎన్నిదినాలు
చన్ననున్

చెరియొకనేలయంచునకు చిక్కిన, హాయన వేయి
తోయధుల్
ఇరువుర వేరు జేసిన, ననేక దినంబులు దొర్లిపోయినన్
దిరములుగాని పుట్టువులు దీరిన, దీర వనారతంబులై
ఎదుగవు కాలదూరముల నీయమర ప్రకృతి
ప్రబంధముల్

సరసకులావ తంసము, విశంకట శాంతగుణంపు
గాంతి, పె

ల్లురలెడు మేలి దివ్వె, పాడవూని చరించెడు
మిన్నువాక, నా
యొరిమెను కొల్లగొన్న యితడొప్పు నటం చెదనెంచి
యిచ్చితిన్
గరువపు ప్రేమకీ చిగురు కైతను చెన్నగు చిన్నెగా
నిటుల్

కబ్బ మిచ్చితి గై కొమ్ము కన్న తండ్రి
ప్రేమ మున్నీరు నీవు నీ పేరు పుడమి
కొమ్మ రెమ్మల పూవులం గుస్తరించి
తావి కడలొత్త దిరముగా దనరుగాత

అధ - కవేరుపాధ్యాయం పూజ్యం ధరణికోట వేంకట సుబ్బ యాఖ్యం అధికృత్య స్తవః

కింకవిముఖతామరసై
ణాంతుడు పావిత్ర్యరాశి నానావిధమత్
ఛృంకాంధ కారభానుడు
వేంకట సుబ్బాఖ్యవిబుధు వేమరు దెలతున్

సాహితీ సౌధంపు దేహాళికడనుండ
బురికొల్పెలోనికి బొమ్మటంచు
కవితావసాన సత్కావ్య సూనము లేర్చి
మూచూడు మని కేల బుణికి యిచ్చె

అర్కోదయంబున తర్కశాస్త్రము నేర్చి
యదియెల్ల నేర్పె సాయంతనమున
ఆధ్యాత్మికాలోచనానంద చంద్ర శా
లంద్రిప్పి తలపుల సంద్రమిచ్చె

అతడు సారస్వతా వసధాంతికవన
వాటికంబ్రోద్దు వుచ్చెడు తోటమాలి
బహుళ రసపానపీన సంపన్న హృదుడు
మన్నమస్సుమ విసర సంభన్న పదుడు

అతడు ఘనశాస్త్ర శిఖర నిష్యందసింధు
గాహకేళీ చికీర్షా ప్రకర్షయుక్త
గంధబంధురసింధురఘటలఱేడు
వానికిం జోడు పండితు లందు లేడు

ఈ రూపాన ఫలించె నేడఖిల సాహిత్యావనీ చక్రవి
స్ఫారప్రాభవ వైభవా భరణ శోభాభాసురాతీవదు
ర్వార శ్రీగురు దేవ దివ్య కరుణా ప్రాగ్భార మందాకినీ
ధారాంభస్సులు, వారి, నాహృదయ కేదారం
బుదారంబుగన్

కియంతః "విమర్శకాః" తథా "రాజకీయ నేతారః"
కావ్యానాం గుణదోషజ్ఞాన శూన్యాః కేవల

పక్షపాతినః కింబహునా మత్సర గ్రస్తాః ఇమంకవిం
అవజ్ఞా మకుర్వన్ తాన్ ప్రతి కించిత్

యమునాంబులు గంగాతో
యమునం గప్పురము గంధమం దొంటెడుతో
యమునన్ వేలుపు నుడితో యమునన్ దెల్గులను
గూర్చి యల్లెద గవితల్

రాలిన పూలపై జలము రాలుచు కన్నుల వారె
డారులం
బోలిన జీవితాలకయి మూలుగు డెందము వారలంచు
మీ
కేళుల బెట్టినాడ నెదగేల్మోని మాలిమి నేలుకొండు యీ
లాలితి రాశినో రసికులా, మదీయ కవిత్వ వల్లికన్

ప్రసవపథాలలో దిరుగు భావపుగూనలు
ఇక్షుఖండపుం
బసదన మీయ జాలెడు సమాసములున్, మది కెంత
హాయియున్
గొసరిన కొద్ది జేకురుచు గొల్లగ
మాదుజీలుంగ్గుకైతలో
రసిక శిఖావతంసములు రండు గొనుండు మరంద
భాండమున్

గుజ్జంబులబలెయానమందునహోరంగుందాల్చి
డెందాలకు
న్నజ్ఞాకల్గొలుపంగటాక్షములు మాహార్యంగి
కావ్యాంగనే
జుజ్జంజేసిరసాసవంబుగడిదింజొక్కింపగానూగవే
యుజ్జ్వాతల్ రసికాళి మానస చయం బుయ్యాల
జంపాల్లలై

లలితాలంకరణోజ్జ్వలంబును రసప్రాచుర్య.
ధుర్యంబునున్
కలభోద్దామ సమానగుంభనకళా ఖ్యాతంబునౌ
గావ్యపుం
బెళుకున్ మెచ్చరు పద్యశిల్పమహిమా పీయూష
విద్వేషకుల్
గలహంసాళియ మెచ్చునేర్చు గద గంగాభంగ
సాంగత్యముల్

చూడన్ నాయక నామధేయులు ధనాచూడావలేప
ప్రభా
వాలోకక్షయులున్ కవీంద్ర సుకుమారైణేయ జీవాల వే
టాడన్ మానస మొప్పు వ్యాధనిచయంబైదం

యుగీనాసురుల్
నేడున్నారలనాడె గాదు దివిజానీకం బనేకంబుగన్

నేనేదో విరచింప బూని యపుడే నీహార శోభాసము
ద్రానన్ లేఖిని బట్టితిన్ మొగిళులారా స్వచ్ఛతారానివే
శానన్ జేరకుడీ, విమర్శకరకా సారంబునారంభమం
దేన్నాపై గురియుంపబునకుడు వందే యందు ముందే
యిటన్

శ్రీరాకేందు యశ్శ్చిరంతన తనూ
రేఖామయూఖాఢ్యులౌ
ప్రారబ్ధ న్మహదాంధ్ర కావ్య సృజలుం
బ్రసార్పరవాణీజగ
ద్వారంధరవ్యగురుక్రియాధ షణులున్
దైవారుతన్ నాదు సం
స్కార స్ఫూర్జిత శబ్ద పీఠముల మ
త్కా-వ్యాధ్వరాధ్వర్యులై

గురు వరేణ్యులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని గూర్చి స్తోత్రమ్

కవితామ్నాయ రహస్యముల్ దెలియగా గాంక్షించి నావేని పా
మ్మవనిన్ నీ వెవనిన్ దలంపక తదేకాసక్తితో జేరుమా
కవి సమ్రాట్టగు విశ్వనాథు ప్రతిభాగంభీర వారాన్నిధిన్
శివకోటీరఝురీ తురీయ వచన శ్రీసన్నిధిన్ బెన్నిధిన్

ఎవని యాకృతి మించు హిమశైలశిఖరమై
కవులలో పుడమి మానవులలోన
ఎవని భారతి వెల్గు నైకైక దీపమై
జగములం దాగామి యుగములందు
ఎవని మన్గడ యొప్పు శ్రవణ పీయూషమై
కథలలో సూరి వాక్సుధలలోన
ఎవని స్థానముగ్రాలు నవనవోన్మేషమై
ఋషులలో నిఖిలాని మిషలలోన
అతడు కవియును ఋషియు దేవతయుగాడు
కవులు ఋషులు నుదివిజులుంగలసి మెలసి
మ్రొక్కు సాక్షాత్ పరబ్రహ్మ మూర్తి గాక
విశ్వనాథుండు కేవలావిర్భవుండె

పూర్ణాహుతికర్తా, ప్రియమిత్రుడు ఆయన లేఖకు ప్రతిలేఖ

*నరులేగాదు సురాసురాద్యఖిల త్రింశత్కోటి*
*బృందారకుల్*
*సరియే తన్మహనీయ వంశలతికా సంజాతమల్లీ వికి*
*స్వరకింజల్క కిశోర మూర్తికి సమస్త గ్రంథ సందర్భని*
*ర్ఝర విద్యామహనీయ కీర్తికిని శుంభత్ కొండ*
*మాచార్యకున్*

*మాటలు గావు మాహృదయ మంజుల*
*కుంజములందు జల్లుప*
*న్నీరె వెలంది తేట లది నెయ్యముగాదు సరోజ పత్రికా*
*పాటలకాంతి పుంజములపై పరుగెత్తు మరందధార, వే*
*యేటికి నీవు మాకయి జనించిన పూర్ణ శశాంకమూర్తి*
*వే*

*సఖుడా! యెంతయొ కాలమేగెను*
*భవత్సాన్నిధ్యముంబాసినీ*
*ముఖరేఖల్ కనులందు దోచికవితా మోహాంబుధిన్*
*ముంచియే*
*శిఖరాగ్ర మ్ముల కో తరల్చు రచనా జీమూత*
*వాతూలముల్*

ముఖరించున్ హ్మృదయాంతరాళకు హారీ మూర్ధన్య దేశమ్ముల్న్

ఒక అసాధారణ కావ్యవినోదప్రియుడైన మిత్రునిగూర్చి

ఓ నవలా మనోజ ! సుమనోహర వాఙ్మయ భోజ!
అర్థిసం
తానమహీజ! సాధుజనతా వినుతాంచిత తేజ !
పుష్పితో
ద్యాన వనీ విహార పరితర్పితచిత్త సరోజ ! కావ్య ధా
రానిభగోగినేని పురరాజవి రాజిత ! వేంకటే శ్వరా !



ఒకప్పుడు . ముట్టుకుని విడిచిన కావ్యకృతి, కచదేవయాని

అభినవ ప్రబంధ నిర్మాణాయత్త చిత్తంబునం గవితా తపస్సమాధి నిమగ్నుండనై యర్ధనిమీలిత నేత్రుండనై యున్న యవసరంబున

అధునాదినాగత ప్రధనాయమానజీ
వన భూరికల్లోల వనధి దాటి
కీటక పాఠక క్రీడా సమారూఢ
రమణీయ తాళ పత్రములు దాటి
గత పురాతన కాల గర్భకు హారాంతర
జీర్ణతంతు ప్రతిసీరధాటి
సౌందర్య రసహీన సందేహ సందోహ
దోహద చిత్తావధులను దాటి
తుహిన భాగీరథీ సింధుతోయములును
విమలకోమల ఘన తపోవిపినములును
కలిత గాథా మనోజ్ఞ రంగస్థలములు
కోటి సూర్యుల కాంతితో గోచరించె

కంటింగంటికి పండువైతగు నభో ఘంటా పథీన
వ్యథా
ఝుంటాకాలసలాల సానిల మహార్ఘోలాళి నీలాల
కున్
గంతాలంబిత పారిభద్ర కళికాకంకేళికా మాలికున్
గుంఠీ భుత పరప్రభావ సుమనో గుర్వంగనాబాలకున్

వలపించె కెలకులం గొలకులో మదకరటి
పుక్కిటినీహారపుష్కరములు
కురిపించెతేనెలం గోనలం దిరుగాడు

కొండవాగుల గాన గుంభనములు
సవరించె మంజిమల్ నవతృణాంకురభూమి
విరిసిన సారంగ విభ్రమములు
పచరించె హారి విండ్లు బాల వాతూలముల్
వెదజల్లు చల్లని విప్రుషములు
ఈ మనోహర వనసీమలెల్ల హృదయ
గుహాల లోపలి చీకటి గూళ్ళలోని
కోరికలు లేని యాశా చకోరికలను
మేలు కొల్పెను రెక్కలం గేలు కొల్పె

నానావిధానూన సూనాళిరసపాన
పీనాళి కులగాన వేణి మొరసె
చూతావనీజాత జాతాంకుర ప్రీత
చేతః పికీ వ్రాత గీతి పరచె
బాలానిలాలోల నీలాలకాజాల
హేలావతీ ఖేల లీలమొరసె
ఉత్తాల గిరిసరి దుల్లోలకల్లోల
సంగీత భంగీతరంగ మెగసె
వాయువులు నుషస్సులును దివస్సులొరసి
ఓ షధీసింధు సంధ్యలు భాషలెన్ని
మహానిధ్వని యించు నవియన్ని గుహలు వీడి
గురిసె మధువును భూమిపై విరిసె కాంతి

కొన్ని అసంపూర్ణ అవయవాలు :-

గొజ్జంగిపూవుల సెజ్జపై బన్నుండి
మధురోహ నొనరించు మజ్జ నంబు
చిగురాకు దొన్నెలో జిలిబిల్లికైతల
గమ్మ దేనియ ద్రావి సొమ్మసిల్లు

...........నిదాఘయామినీ
ఫుల్ల నవీన మల్లికల పోలిక మాలికలై శరన్న భః
ప్రోల్లసితా భ్రముల్ బరగె భూరిమనోహర వాస్తు
శిల్పముల్

కొంచెము వంకగా చికిలి కుంచియ తోవిరచించినట్లు
శో
భించు కనుంబొమల్...................

చిటికెన వ్రేలి గోట విరచించిన కస్తురి బొట్టు
చెమ్మటం
జిటిలి విలాసినీ భ్రుకుటిసీమలు డిగ్గి

కలమా నిన్ను త్యజించి నిల్వ గలమా ! గాఢంబుగా
సాగుమా



ఒక కవిమిత్రుడ్ని ఉద్దేశించి ప్రేమతో రాశిన లేఖ

అందినది లేఖ సమ్మద
మందినది మదీయ చిత్తముద్దీప్త శుభ
స్యందనమై శిష్య ప్రియ
వందనమై యిటకు తఱలి వచ్చుట చేతన్

శ్రీకర మల్లెమాల కులశేఖర! బాంధవమిత్ర లోకచా
మీకర! సాహితీ సుమసమీక రక్షైక గుణాకరా!
సుధా
శీకర వాగ్విలాస బుధ చిత్త వశీకర! రమ్య భావర
త్నాకర! నీకశేష శుభమస్తు దిశా ప్రశస్తి గన్

మా శిష్యుండు మహోన్నతా శయుడు
శుంభత్కావ్యపీయూషభా
షా శేషాహి రస ప్రసిద్ధ రచనా సందర్భ గర్భీకృత
క్లేశజ్ఞాన రహస్య వేత్త యని యుల్లేఖించి యుష్మత్కళా
ప్రాశస్త్యంబును నల్వురున్న యెడలన్ వాకొందు నో
మిత్రమా

కమ్మని కాకినాడ చిరుగాలులు గందపు నీటి జాలులై
యిమ్మగు బ్రొద్దులం గొదమ యెండలు విచ్చిన కల్వ
దండలై

బొమ్మల వంటి కొమ్మలకు బుగ్గలు లేతగులాబి
మొగ్గలై
ఘుమ్మని పించుగాని రుచిగొల్పవు నీవిట లేక
పోవుటన్

మిత్రులు ప్రీతి పాత్రులు నమేయమనోహర
వస్తుదర్శనీ
నేత్రులు మీరు లేక ఒక నెయ్యము తియ్యము
లేకలోకమే
సత్రము వోలె దోచును రసార్ద్ర కళామయ
సీమవోలెనే
మాత్రము దోచకున్న దసమానము తావకమైత్రి
మిత్రమా



అనుముల మహాకవికి అంజలి

అనుముల అన్న తెల్గు కవులందరి కగ్రజు
డామహాకవిన్
అనుపమవేద శాస్త్ర మహితార్ణవ రాశిని
పుణ్యపూరుషన్

ఎనిమిది కోట్ల యాంధ్రులము ఎంతయు
పూజయొనర్చి సప్తతిన్
వినమిత శీర్షతన్ జరిపి వేడుక జేతము రండు ధన్యులై

అన్నా నీ నాలుక పై
ఎన్నో వేదంబులున్న వెన్నో కావ్యా
లున్నవి నన్నల్ప జ్ఞుని
అన్నా యని పిల్తు వెట్టియంభోనిధివో

ఇదిగో నాదు సహస్ర శీర్షములు నీ హ్రీంకార
ధూపమ్ము లో
పదపంకేజ ద్వయి మోపి మ్రొక్కెద క్షమింపన్ వేడు
శేషేంద్రుడన్
మధురాంధ్రీయ కవిత్వ శిల్ప రచనా మార్గమ్మునన్
బ్రహ్మవై
మృదు మాధ్వీకము పాకమై వెలయు స్వామీ !
కృష్ణ మూర్తి ప్రభో !

జీవన వార్ధి వీచికల జిక్కి చికాకుల కోకిలమ్మనై
నావనదేశముల్ దొరుకు నా యని ద్రిమ్మరి
దూరదూరముల్మావిడి తోపులన్న గరిమన్ బరువెత్తి
రవంత శాంతియున్
బ్రోవగ రాని జీవనము బొందిన మోక్షము లేని జీవినై

కవినై గగనాంభోధర
పవినై క్రోధా తిరేక పాషండగుణ
చ్ఛవినై హింసాకాముక
రవినై తపియించు చుంటి రహాగుజరుల్లో

జో హస్తంబులు వ్రాసి వ్రాసి విసిగెన్ జుంబిష్ ఖతం
హోగయీ
రాహత్ కొంచెము జిందగీకి దొరకన్ రాదాయె ఈ
ఉమ్రలో
మోహంబేదియు లేదు దేని పయినన్ మోక్షార్థినింగాను
తత్
సోహం జాబులు వ్రాయు ఓపికయు శూన్యంబాయె
నో మిత్రమా !



ప్రియశిష్యుకు విజయాత్రేయకు

ఢిల్లీలో కొన్నాళ్ళును
ఢిల్లీ తదనంతరంబు ఢిల్లీ కంటెన్
కల్లోలమైన బొంబై
వెల్లువలో గడిపి పిదప వెడలితినిటకున్

రెన్నాళ్ళుంటినో లేదో
నన్నయ భట్టారకుండు నడిచిన వీథుల్
చిన్నవి నాపాదంబులు
క్రన్నన నడువంగ సాగె రాజమహేంద్రిన్

ఈ కారణంబు చేతనె
నీకృతి మృదురసిక హృదయ నిస్తుల శయ్యా
పాకాది యోగ్య యయ్యును
ఏకాంతపుబల్లమీద ఇట పడియుండెన్

విజయాత్రేయా !

కలకంఠంబుధరించి కావ్యమయ శాఖాకోకిల స్వామివై
విలసత్ పండిత కుండలీంద్రజగతీ విద్యా విహార
స్థలుల్
పులకింపన్ విరచించు నీమధుర సమ్మోహార్ద్ర గీతా
వళుల్
తెలుగుందోటల పాటలాధరలపై దీపించి వ్యాపించు
తన్



ఒక మంచికవి కవిత చదివి పొందిన ఆనందం ఇలా ఉంది

మీ పే జీల్లో తాగవచ్చు
దోశిళ్ళతో ఆధునికతని
స్వచ్ఛజలంలా
మీవాక్యం అనే దిగంతరేఖ మీద
ఉదయిస్తుంది కవిత
కాషాయ రశ్మితో
శేత సూర్య బింబంలా
రాత్రి వచ్చిన రహస్యపు వానచినుకుల్ని
పువ్వుల్లా ఏరుకుపోయింది
ఉదయం చెరిగి పోతున్న
నాకల



### ఆమ్రపాలిక కర్త అయిన ఒక మిత్రుడికి రాశిన లేఖ

*రసజిగ్రహిషా ఋషియై*
*విసృమర త్రైలింగ కల్ప వృక్షచ్ఛాయా*
*వసదమృతాంధః ప్రభువై*
*యొసగును శరభాఖ్య శర్మ ఇద్ధయశుండై*

*సఖుడాతండు మదీయ హార్దిక మహా*
*సామ్రాజ్యసింహాసనం*
*బఖిలంబున్ గాని యాక్రమించి, నను నేయానంద*
*వైహాయసీ శి*
*ఖరాగ్రంబులకోతరల్చె నతడే చిక్రోడమై శాఖలన్*
*ముఖరించెన్ భవదామ్ర క్రమ కవితా మూర్ధన్య*
*దేశమ్ములన్*

*.నాకుందమ్ముడు పూల నెచ్చెలి వసంతస్నాత*
*చూతావనీ*
*శాఖాకోకిల శ్రావణాభ్రపిల సచ్ఛాంపేయ రోచిస్సు శ్రీ*
*రాకాచాంద్ర మసీ నిశీథియనుచున్ రమ్యాక్షరప్రౌఢితో*
*వాకొందున్ శరభయ్య నార్ద్ర కవితా స్వాదిష్ఠ*
*తూలంకషన్*

కవయొక చందమామ తనకావ్యము వెన్నెల
పూసుకున్న వ
స్తువులజగత్తు వాఙ్మయ మధువ్రతుడైన
కృతీశమౌళియో
నవరస పశ్యతో హరుడు నమ్రుడ నేనిక నేమి
చెప్పుదున్
ధవళిమ వెల్లిగొన్న కలధౌతమయంబు సమస్త
మిచ్చటన్



ఉభయులూ పరస్పర గురూజీలు - ఆగురూజీ రాశిన లేఖకు ప్రతిలేఖ

చది వితిని మా మనోహర
హృదయాంతః పేటికాచ్ఛ హీరాయితమౌ
సదమల కవితా లేఖను
యెదలో కడుసంతసించి ఇట్లను చుంటిన్

చివురుల్ వేసిన మావిశాఖలు గురూజీ లేఖ లీపోస్టులో
కవరుల్ మోయునవే, ఒకానొక శుకీ కంకేళికా పుష్పవ
న్నవచంచూపుట కోటికా ఘటిత చంచద్వ్యాన

యోగ్యమ్ములా
కవితా మందసుగంధబంధుర రజః కల్హార హారావళుల్



రెండయి పోయెను మాసరమ్ము లయినన్ స్మృత్యంత
రాళమ్ములన్
గండూషించుచునుండె నేటికిని మీగంభీర కంఠధ్వనుల్
డిండీరమ్ములు పూర్వకావ్య పథశౌండీర్య ప్రభా
గుచ్ఛముల్
పాండిత్య ప్రతిభాసుగంధిలములో ప్రఖ్యాత
కవ్యగ్రణీ !

ఇన్నాళ్ళాయెను జాబువ్రాసె మరి ఏమీ పల్కడీ
మానవుం
డన్నాచిత్రమటంచు మీరు మదిలో నాశ్చర్యమున్
జెందుచున్
ఉన్నారంచు దలంతుగాని దయతో
నూహింపప్రార్థించెదన్
ఎన్నో చిక్కులు మానవుండనినచో ఈ జీవి
కింకెన్నియో

ఒకదుష్టుడు కోరగా వ్రాసిన పాటల ముక్కలు లేక శిథిలాలు

*ఈ వాన అందాల గాలి వాన*
*అంధకారం లాంటి అలకలన్నీ దిద్ది*
*సూర్యబింబంలాంటి చుక్క లిఖియిద్దాము*
*వేరడేసి కళ్ళ గారడీ లన్నిటికి*
*హద్దుగా కాటుక దిద్దుదామే రండి*
*ఈ వాన అందాల గాలి వాన*



*భూమి నించి రంగు రంగు పూల నెవరు పిలిచారు*
*పూలగిన్నెలో తేనెలు పోసి ఎవరు పోయారు*
*తేనె సోనలే పండ్లుగ తీర్చి ఎవరు దిద్దారు*
*పండ్లకెవరు గింజను ఒక పరమార్థం వేశారు*

*నెమలి కొరకు గగనంలో నిలిపి రెవరు మేఘాలు*
*గగనానికి ఇంద్రధనుసు కానుక ఎవరిచ్చారు*
*బ్రతుకు పితికి విజ్ఞానం మనిషి కెవ్వరిచ్చారు*
*మనిషి నుంచి కాంతి పితికి మహాత్ముడ్ని చేశారు.*

తొలకరి మేఘంలా వలపు కవిలో తొలిచినుకులు చినికి పోయినప్పుడు వచ్చిరాని ప్రేమభాషలో చెప్పిన తొలినాళ్ళ శ్రావణ మేఘాలు

శ్రావణ మేఁగుదెంచెను విశాల నభమ్ముల మేఘమాలికా
రావపరంపరల్ శ్రవణ రమ్యములై వినిపించె, మాధురీ
భావము లంకురించి మధుపాత్రను జేసె
మదంతరాళమున్
నీవదనారవింద మొక నిస్తుల శోభవెలార్చె నెచ్చెలీ

మాలతి తీవె పూచిన సుమాలను రాలిచిగాలివీచెనీ
లాలకలుం ద్వదాస్యమున లాస్యము చేసె వినీల
వీథులం
దాలలితంపు మేఘములొయారముగా జనుచుండి
చిన్కుము
త్యాలను రాల్చి పోయె చెలియాభవదీయ కపోలసీమపై

కళకాలమ్మును మాసిపోని ప్రణయాఖ్యానమ్ములం
దెల్పి క్రొం
దల పుంబూవులు విప్పి చిత్తమున నెత్తావుల్
బుగుల్కొల్పినీ
వలపుం దీపియ జిక్కి సౌఖ్య మని ఈ వాలారు
పన్నీటికా

న్కలు పంపించెను వర్షదూతికచెలీ! గైకొమ్ము
ప్రేమాంజలుల్



ఒక మిత్రుడు అష్టావధాని, ఆయన్నిగురించి

బులుసుకులాబ్ధిసోమ ! రసపూర్ణ వచోనిచయైక
సీమ! ని
ష్కలుషగుణాభిరామ! కవికల్పమహీరుహ గోగినేని
పూ
ర్వ్యలసితధామ ! ఆశులహారీ విహారీ కృత
యావదాంధ్ర భూ
వలయ లలామ ! మిత్ర జనవాంఛిత వేంకట రామ!
క్షేమమా!

ధారగ జోరుగా త్వదవధాన విధాన మఖండగౌతమీ
పూరమువో లెకృష్ణ వలె పొంగులు వారెడు
దాక్షిణాత్యకా
వేరిఝరింబలెన్ దుముకు వేళ యనర్గళ శబ్ద బాణ తూ
ణీరుడు వీరుడీతడని నిన్ను దలంతుము మిత్ర
సత్తమా !

తెలుగు నేల నాలుగు చెరుగులూ తిరిగి ఊర్రూతలూగే మదితో తల్లి మృత్తికను తలుచుకుంటూ

*తెలుగుందేశమునం జనించితిని ఇందేనేను దోగాడితిన్*
*తెలుగుం గొమ్మల కోకిల మ్మనయినా తెల్గున్నుడుల్*
*బల్కుదున్*
*తెలుగుందేశపు గాలి బీల్తు దెలుగుందేశం పు*
*కూలంకషా*
*జలముల్ద్రావుదు తెల్గు నేల పయినే చాలింతు నీ*
*దేహమున్*

*ఇది నా పూర్వులనేల ఇచ్చటనె వారెన్నో యేళ్ళు*
*జీవించిరీ*
*నదులం గొండల గానలం బితికి నానాభోగ*
*భాగ్యమ్ములం*
*బొదలంజేసిరి వీరులై కృషికులై భూలోక దేవేంద్రులై*
*బుధులై పండితులై కవీంద్రజగతీ మూర్ధన్యులై ధన్యులై*

*అటు సింహాద్రిటు వేంకటాద్రిగల యీ యాంధ్రక్షమా*
*మండలిం*
*బటు శైలాగ్రము లంతరిక్షములపై స్పర్ధించు*
*నర్ధించుచున్*
*దట వృక్షమ్ములు శాఖలన్ బొదివిముద్దాడున్*

మహానిర్ఝరీ
స్ఫటికస్వచ్ఛ సుగంధిలా ధరములన్
వర్షించుమేఘావళుల్
నటదుద్యన్నవ సస్యబాలికలపై స్నానాంబు
పూరంబులన్

అటు సింహాద్రిటు వేంకటాద్రిగలయీ యాంధ్రక్షమా
మండలిన్
చటులా స్ఫోటిత మేఘ సీమలగు శ్రీ
శైలాగ్రభాగంబులన్
నిటలాక్షుండు జటాకటాహతటినీ నిర్ఘోష ధాటీ సము
ద్భట నాట్యోత్కట కేళి సల్పు నిరు సంధ్యాకాల
కూలంబులన్

కాని ఈ నాడు తెల్గు దేశాన గుండె
లెండలంగాచె మృగతృష్ణ లెగయుచుండె
అందచందాల వెన్నెల లస్తమించె
కాలచక్రాల పరుగులో ధూళిమిగిలె



## ఇది విరోధినామ సంవత్సర ప్రశస్తి

గంధాంధక్షితిపాల జాలము భుజాకండూతిచేరెందరి
స్కంధావారములాయె పీడితజన
స్వాతంత్ర్యవిచ్ఛేదకుల్
సంధింగూటమి కట్టినారలు శుభాలందేల్తువో లేక యు
ద్ధేంధానంబుల ముంతువో తమరి పేరే భీతి
గల్పించెడిన్

అయ్యా నైక యుగాతిపీడిత మనుష్యా
నీకమందుద్భవం
బయ్యెన్ నూతన చేతన ప్రభలికన్
న్యాయోదయార్థంబుగా
కయ్యంబుల్ కొనసాగు యక్షపతి భక్త శ్రేణికిన్
భూమిలో
కు య్యాలించెడివారలుండ రెచటం గొంతెత్తు
చుంగ్రోల్చినన్

కనదాదిత్యకిశోరకాంతి కెనయౌ కర్మజ్ఞ భుక్కేతనా
రుణిమ ప్రాభవ వీచికా నికరముల్ లోకప్ర సేకంబులై
జనతా మోద కరంబులై తరలి రా సాష్టాంగ
దండబులం

దనరం జేయక యుద్ధ బెట్టుటకు సాధ్యంబే
క్రపాణంబులన్



ఇయం పుత్రీం దూరగతాం విచింత్య రచితా గీతికా

రావమ్మ రావమ్మ నా చిట్టి తల్లీ
రావమ్మ రావమ్మ నా పొట్టి తల్లీ

ఆకసం మన మధ్య ఆవులించిందమ్మ
భూదేవి మన మధ్య పొందు బాపిందమ్మ
రావమ్మ ..

కాలమేఘంలేని నీలిబాటల వెంట
చిఱుగాలిగుఱ్ఱాలు చెరచెరాలాగేటి
తెలిమబ్బు తేరెక్కి తేలిరావే తల్లి
రావమ్మ ..

తారలన్నీ యేరి దండగా గ్రుచ్చాను
పండు వెన్నెల జిలుగు పరికిణీ తెచ్చాను

నా ప్రేమ వెల్లువల నాపలేకున్నాను
రావమ్మ



ప్రేమ, పెళ్ళి రెండొకటి !

ఇల్లంటే గోడలు కాదు
పెళ్ళంటే పరాయి యింట్లో
బ్రతికే ఒక కోడలు కాదు

ప్రేమించే నా నాథుడి మది
ప్రవహించే కృష్ణా నది
ప్రేమ కెలా హేతువు లేదో
మనసు కలా సేతువు లేదు

వింతయినది ఈ వేదాంతం
వినగలిగితె ఆసాంతం
జాణతనం ఎరగని కాంతల
జీవిత మొక విషాదాంతం

మొదట చూపిన ప్రేమ జ్వాలకు
చుట్టూ తిరిగిన హోమజ్వాలకు
అర్థం మరి ఇంతేనా

ప్రేమంటే మంత్రాలా
భార్యలు మన బరువులు మోసే
మనసులేని యంత్రాలా



విప్లవ భాషా విధాత కవిసేనమే నిఫెస్టో ప్రణేత బుధజనవిధేయ
శేషేంద్ర నామ ధేయ కవి వర్య ప్రణీత ఆధునిక మహాభారతస్య
అనుబంధ కావ్యం జన వంశమ్‌లో చంపూకాండ సమాప్తం

# యుద్ధ కాండము

ఓ భారతీయ ఆస్థి పంజరాల్లారా!
మీ చేతుల్లో జెండా లెగు రుతున్నా
మీ ముఖాలు ఏడుస్తున్నట్లే ఉన్నాయి
నేశారు మీదేశపు జెండాను
మీకష్టాలతో మీ కన్నీళ్ళతో
మీ శరీరానికొక చొక్కా ఇచ్చుకోలేకపోయినా
మీ దేశానికొక జెండా యిచ్చారు
రక్తబిందువులు రాల్చారు ఆకాశం
ఉల్కల్ని రాల్చినట్లు
మీరే ప్రజలు
దేశమనే పాత్ర లో భాషిస్తున్న జలాలు
ఘోషిస్తున్న సముద్రాలు
మీ విజయం కోసం స్వప్నాల్ని అంకితం చేశాను
మీ స్వప్నాలకోసం నా స్వప్నాలన్నీ బలిచేశాను
మీ కోసం పాడే కాగితాలెన్నో సృష్టించి
గుంపుల్లోకి ఎగరేశాను
విఫలత్వం అనుభవిస్తూ విసుగుతో
నడుస్తున్నాను
ఎప్పుడన్నా విన్నారామీరు

పొలాలు అరవడం రస్తాలు అరవడం
మీరు నిద్రిస్తున్నా అవి అరుస్తూనే ఉన్నాయి
చూడండి ఈ దేశం ఎలా చిరిగిపోయిందో
ఒనా ప్రజలారా! మీరందరూ
అగ్ని పర్వతాలు కావాలని
అడుగు తున్నాను



ఒరే సోదరా
ఈ లాడ్ స్పీకర్ల గొంతుల దండయాత్రల్లో
ఎలా నిద్రిస్తున్నావురా, వెధవా
మశీదుల్లో మైకు మందిరాల్లోమైకు
పెళ్ళికిమైకుపండక్కిమైకు
హోటల్లో తోటల్లో దశదిశలా తానై
ఓండ్రపెడుతున్న మైకాసుర గర్జన!
రాగమై ఆత్మని మేల్కొల్పిన ఆశబ్దమే
రాజకీయ రోగమై మనిషి పశుత్వంలో
ఒక భాగమై ఈ నాడు వేటాడు తోంది మనల్ని
ఇది శబ్దంకాదు ఇదొకదౌర్జన్య శిక్ష

రూపాయి చూస్తే తెరుచుకునే నోళ్ళన్నీ లౌడ్‌స్పీకరు ద్వారా ప్రవహించి మనగ్రామాల్లోకి మన పట్నాల్లోకి మన ఇళ్ళలోకి మన గుళ్ళలోకి వంటగదుల్లోకి పడకగదుల్లోకి గజినీల్లా దండాయాత్ర చేస్తుంటే నిస్సహాయులంగా పడి ఉన్నాం.

ఏకాంతం కోల్పోయిన నిర్జీవనరాకృతులం క్రూరకఠోర శబ్దసమూ హాల్లోపడి కొట్టుకు పోతున్న బలిపశువులం

*సోదరా నీవు నిద్రోపాసివి !*
*మనిషి మనిషి మాట వినడంలేదు*
*లౌడ్ స్పీకరు మాట వింటున్నాడు*
*అందరూ మైకును పొందలేరు తెలుసా !*
*శబ్దశిఖరాగ్రంఎక్కేవీరుడుమననాయకుడొక్కడే*
*మన నిద్రాభంజనడు*
*మన శాంతి స్వప్న భక్షకుడు*
*శబ్దాల గాలివాన వీస్తోంది*

●

పలుకలేదు విధిని పల్లెత్తుమాటేని
కనలలేదు కాని కాలముపయి
ఈసు బూనలేదు కాసున్నవారిపై
గాసి యనక లేమి మోసినాడ;
కాని యొక్కనాడు కాళ్ళ చెప్పులు లేక
దారి నేగుచున్న తరుణమందు
కనులనీరు గ్రమ్మె; కాని కాళ్ళేలేని
వాని జూచి చింతమానినాడ

అంభోదులు ప్పొంగి యాత్మ బాహువులెత్తి
స్నేహాశీకరములు చినుకుచుండు
జాబిల్లి కబరిలో సవదరించిన బాల
నీలమేఘము వానజాలు గుటియు
చివురించి పూచిన చిక్కని యడవులు
కలికితేని యజల్లు చిలుకరించు
ఉడుతల వలె కొండయొడినుండి పరుగెత్తు
సెలయేళ్ళు నదులతో చిందులాడు

గిరులు దీవించు విప్రులకరణి లేచి
ధరణి మోయును క్షమియించి తల్లివోలె
పుడమి రసమయసృష్టిలో పుట్టి నేను
గాసిబడుచుంటి నిదియేమి కారణమ్మొ ?

తలదాచుకొనుటకు నెలవు జేనెడు లేదు
అనయంబు నాదేశమనుట యేల?
కడుపు గాలుచునుండ కనికరించరుగాని
నాజాతి యను భ్రాంతి నాకు ఏల ?
మనిషిగా తలయెత్తి మసలనీయరు గాని
నాదు సంస్కృతి యని మిన్నంట నేల?
నామాట గ్రామ్యమై నగుబాటు పాలాయె
నాభాషయన్న యానంద మేల?

నన్ను బోలిన యావదావన్న జనులు
నాదుజాతిగ భావింతు నాదరమున
నంతియేగాని దేశమ్మేదైన నేమి ?
దాసుడనుగాను మూఢవిశ్వాసములకు

దివ్యమై దిగివచ్చు భవ్యభాగీరథి
నీరు నీకొంగు బంగారు గాదు
అమరవీధుల నేలు హిమగిరిశ్రేణులు
మనయింటి యావులమంద గాదు
తరులతాబంధుర దండకారణ్యమ్ము
నీదొడ్డిలో బీరపాదు గాదు
గగన సంవర్తియౌ ఘనభూమివక్షమ్ము
భరతదేశంబు నీపంచగాదు

స్వార్థభావాలు లోకాన జల్లుదేల ?
కొంచెపుంబుద్ధి నిన్నావరించె గాని
చీమ కడనుండి ముక్కంటిభావ వరకు
చిల్లిగవ్వయు నీ తాతముల్లెగాదు.



అమిత్రక్రూర జగమ్మునన్ జన
సమూహంబెల్ల యల్లాడగా
కమనీయార్థపిపాసలో ప్రణయ
శాఖా కావ్యమీ మాంసలో
సమయం బెల్ల వ్యయంబొనర్తురు

మహా సాహిత్య జిజ్ఞాసువుల్
విమలంబైనది చూడకుందు రిక
నావేదాంతముల్ కాల్పనే

ఒక కన్నీటి కణమ్ము చాలు రసపూ
రోదార సాహిత్యముల్
ముకురింపంగ, ననేక కృత్రిమ సుమ
స్ఫూర్తి చ్ఛటావాటికా
నికటాంతః పుర జీవనస్థితులు

వర్ణింపంగ పొంగారునే
ఒక సాహిత్యరస ప్రసారకణమే
నుత్పన్నమై యెన్నడున్

వ్యథచేదీనులబాధకొక్కటయినన్
బొప్పమ్ము రాకున్నచో
పదబంధమ్ములు బంధుర ప్రణయ
భావస్పంద సందోహముల్
మృదులమ్ముల్ పదివేలు కూర్పుమది
సాహిత్యమ్మె రాహిత్యమై
నిదురం బోవును గాక కాలకుటిలో
నిర్గంధ బంధూకమై

చదువుట గొప్పగాదు ; ఒక సాగర
మంత విషాద సాహితీ
కదన పదార్థ సంకలిత గ్రంథ
సమూహము వ్రాసి పెద్దయై
బ్రదుకుట గొప్పగాదు ; చివరం
బర మార్థము నిత్యజీవన
ప్రథన సమన్వయంబగు తెరంగున
తాను చరింపకున్నచో

ప్రేమను గూర్చి గ్రంథములు పెక్కు
రచించుటకన్న పీడితశ్రామిక కోటికై బ్రతుకు సర్వము
పర్వముపోలె మంజుల
ప్రేమ సుధాలవాల మొనరించుట
భావ రసార్ద్ర సాహితీ
స్వామికి లక్షణం బగును ; చాలవు
శబ్దసమూహ మోహముల్

పుస్తకమ్ములు చూడ మస్తకమ్ములు పోవు
జగతి జాడ చూడజాలరందు ;
మనుచరిత్రలందు మహిమ యేమున్నది ?
కనుడు చదువుడు మనుగడ చరిత్ర

ప్రాశస్త్యంబులు శీతశైల శిఖర
ప్రాంతమ్ములన్ మెట్టకే
కాశిలో గయలో ప్రయాగలో మహా
గంగాఝరీ తోయముల్
దోసిళ్ళంగొని త్రాగినట్లుగ జగ
ద్వ్యోతంబుగా నున్న యా
రాశీభూత మనుష్య గాథకయి యే
లా గ్రంథ సందోహముల్

నానాపంక కళంక సంకలిత పు
ణ్యక్షేత్ర జాలంబునన్
గానం జాలవు పూర్ణసత్యమును ; నీ
గ్రంథంబులన్ వీడి శో
కానం దేలు ప్రపంచ మానవ మహా
కాసార తీరంబుల్
జానౌ జీవన గంగ ద్రావుమవి
విశ్వప్రేమ పీయూషముల్



మిన్నులు హుంకరింప
ఘన మేఘ పరంపర లట్టహాస వి
ద్యున్నవదీధితుల్ గొలుప
తోయధి భీకర గర్జచేయ
ప్రచ్ఛన్నములై పయోదముల
చాటునకుం గ్రహతారలేగ
నభ్యున్నతమూర్తివై నడచి పోయెద
వెచ్చటికోయి పాంథుడా !

వైషమ్యమ్ముల చూడగా బ్రతుకు
త్రోవల్ శోకఘూకంబుల

న్వేషించున్ హృదయాంధకార గుహలన్
విద్వేష రోష స్ఫురత్
కాషాయ ద్యుతి ప్రజ్వలించు
మరియుం గాకోల కూలంకషా
ఘోషంబుల్ వినిపించు
విశ్వజగతీ ఘోరాటవీ సీమలన్

నీతి వెలుంగలేదు
నవతనీత మనస్సు వసింపలేదు వి
ఖ్యాత మనీష నిప్పులము
స్వార్థ పిశాచ నిశాచరోగ్ర
సంఘాత ప్రచండ తాండవ
మఖండిత రీతిగ సాగుచున్న
ఈజాతి మతాది సత్వకుల
సంకుల పంకిలమైన సీమలన్

విరియగ విస్ఫులింగములు
వేయి శిరస్సుల నాగువారిలో గిరికొని
యుండు, గండుబులి కింశుక
రోచులు పుక్కిలించుచున్
తరువుల చాటునన్ మసలు
ధైర్యమరీచులు దారి చూపగా

తరలుము పాంథుడా!
కఠిన ధర్మ పథంబుల ఖడ్గపాణివై

కోపములేకగొప్పయనుకోక
దురాశకు లొంగిపోక, యే
యాపద వచ్చిన్ ధనమదాంధుల
భీతికి పారిపోక, నీ
లోపములేక దీనజన లోకముపై
దయబూనివెన్కసం
తాపములేని జీవన పథమ్ము వరించి
తరించు మెంతయున్

ధనము గతింపనీ
గగనతారలు ధారుణిమీద రాలనీ
తనువు నశింపనీ
ప్రళయ తాండవమై ధర క్రుంగిపోవనీ
మనసు చలింపనీకు
మభిమానము మానముకోలుపోకు ; మీ
ఘనతర భాగ్యవంతు
లధికారులు మార్కొనిరేనియుద్ధతిన్

అదియొక ధర్మదీక్ష పరమార్థ
మహోన్నత శృంగసంగతిన్
బ్రదుకు నపేక్ష విశ్వసమరమ్ము
జయించుట కాత్మశిక్ష, ఆ
మృదుహృదయ ప్రసూన కుహరీ
విహారీకృత వహ్నికీల
తా నదరదు దేనికిం బెదర
దారదు, మారదు, హోరుగాలికిన్

వెరవకుమోయి విశ్వపదవీమద
విద్వేష దుగ్రధాటికిం
బరవకుమోయి ధర్మమయ
పావక రోచులు భ్రూకుటీర
కోటరముల ప్రజ్వలింపగ
ఘటాపటలీ పటు జాగ్రదగ్రహో
పరశువు కేల బూని యొక
భార్గవ రాముడవై చరింపుమా!



వరద వచ్చుచిందోయి వరద వచ్చింది
గగన ఘంటా పథం కదిలివచ్చింది

నిషధాచలందాటి తుహినాచలం దాటి
వసుధా తలంమీద బుసబుసలు కొట్టుతూ
భంగ సంఘాలతో పాదమెట్టింది
పాత కోటలు తాకి పగల గొట్టింది

వినువీథి భేదించు వీరతాండవ ధాటి
విశ్వకంధరకోటి విజయ ఘోషల తోటి
ప్రళయ మేఘాలలో పంతమాడింది
యెల్లదిక్కుల మీదవెల్లివిరిశింది

కొండ గోగులకోన కుసుమించిన రీతి
చిగురెండు వెల్లువలు చిందులాడిన రీతి

నల్లగొండ మీద నాట్యమాడింది
ఆంధ్రదేశాకాశ మావరించింది !-



తమచుట్టుం జఠరాగ్ని హోత్ర శిఖలు
ద్దండ ప్రచండంబులై
భ్రమియింపంగమహాసమున్నతసిత
ప్రాకార కుడ్యమ్ములన్

సుమనోమంజుల మంజరీవనములో
శుద్ధాంత గర్భమ్ములో
తమిదీరం భుజియించువారు నరులో!
దైతేయులో! అంధులో!

అసువుల్ వాతుర నోరులేని నిసువుల్
హా ఆకలోయంచు, దు
ర్వ్యసనాయాస నిరాశలం బడి జనం
భాగర్భ నిర్భాగ్యులై
పశువుల్ వోలె శ్రమించి చత్తు రిచటం
భావింపగా దారుణం
బసలీలోకము లోకమా! విషభుజం
గానీక వల్మీకమా!

రుధిరంబుల్ మధురంబులై, పటుక్షుధా
రోచుల్ సుధాపీచులై
బదిరాంధుల్విహరింపమేరుగిరులం
భల్లూకలోకాధిక
వ్యధితానేక మనుష్య బాష్పజలముల్
వారాశియై పొంగుచో
నుదయించున్ సముదగ్ర విప్లవముతా
నుచ్చైశ్రవంబో యనన్

శ్రమియించే శతకోటిమానవుల కా
శాజ్యోతి లేదా ? విష
క్రిమి బాధామయ కాళరాత్రికి
ఉషః శ్రీరేఖ జన్మింపదా ?
సమసౌభాగ్య దినంబు వచ్చి జగతీ
సంగ్రామ రంగమ్ములన్
రమణీయోజ్జ్వల శాంతి సౌఖ్యమయ
సామ్రాజ్యంబు వర్ధిల్లదా ?

ఎందుకు రాదు విశ్వ జగతీ
మహాతీ శతకోటి తంత్రులై
ముందుకుపోవురోజు ? చర
మోగ్రనిమేషము భూనభోంతర
స్పందిత కంఠనాళమయి
సాంద్ర తమోమయ పీడితప్రజా
కందరగాఢసుప్త భుజ
గమ్ములమేల్కొలుపున్విముక్తికై

రండి అభాగ్యులార, బధిరాంధక
పీడితులార, రండి యీ
పండినచేలు పల్లెలును
పట్టణముల్ గిరినిర్ఝరాది భూ
మండల మెల్ల మీయది !

యమాయక శృంఖల ద్రెంచివైచి,
యాఖండలమూర్తి దాల్చుడు
జగమ్ము జయించుడు వజ్రధారులై

ఝురులై రక్తముపారనీ, శత సహ
స్ర ప్రాణముల్ కూలనీ,
మురిపెంబొప్ప, కుటుంబముల్ చితికి
నిర్మూలంబులై పోవనీ
వెరపుంజెందక ముందుకే గుడు సమా
విర్భూత ప్రాతఃప్రభా
భరితంబైన నవప్రపంచమదె, యాహ్వానించె
ప్రాంచద్గతిన్.

కులగోత్రమ్ములు మాకు లేవు, ధనిక
క్రూర క్రియా పీడిత
జ్వలిత ప్రాణిచమూ సమూహ మొకటే
సత్యంబు, ఊహాభుజా
ర్గళముల్ విప్పిన విశ్వమూర్తియయి శం
ఖారావముం జేయుడో
దళిత శ్రామిక జీవులార! భువన
ద్వారంబు భేదిల్లగన్.



మనుజకథామథనంలో
వెలువడినవి ఏవంటే
సమాజం అరణ్యం
భుజబలం శరణ్యం
పరమార్థం హిరణ్యం

ఆగర్భ శ్రీమంతుల
కాహుతయిందఖిలసుఖం
వారసత్వ సూత్రాల్లో
వగచుతోంది వసుంధర

నిండు పండు లాంటి నేల
నిలువునముక్కలు చేసి
నెమరు వేయుచున్నారు
భవనాంతర సీమల్లో

అడుగు నేలకును సైతం
శాసనాల కంచె గట్టి
నిలువనీడ లేని దశను
నెలకొల్పారంతటను

కాస్తమనం యోచిస్తే
దేశద్రిమ్మరిండ్ల తెగకు

చెందకున్న వారెందరు
ఇది నాయిల్లంటూ
ఆచంద్రార్కం ఇదియే
నా ఊరని నేలలోకి
వేళ్ళుబారి విలసిల్లే
వారెందరు వసుమతిలో

సిల్కు తెరల కిటికీల్లో
పకపక నవ్వేస్తున్నా
రాగర్వ శ్రీమంతులు

శాసనాల అద్దంలో
నరరూప స్వార్థం తెగ
జూచి మురిసి పోతోంది
అందులోన చూచుకొనుట
కేమున్నది దానిమొహం

సొంత ఆస్తి పుంతల్లో
వ్యాపించిన ముళ్ళపొదలు
అంతు లేని చట్టాలు

ఈ కట్టు దిట్టాలు
ప్లీడరు బేరపుగదిలో
పెద్ద పెద్దలాబుక్కులు
గాజు బీరు వాల్లోనుంచి
గుట్టలు గుట్టలు గాపడి
గ్రుడ్లు మిటకరిస్తున్నవి
వేడివేడి నిట్టూర్పులు
విడుస్తున్న లాయరు
శాసనాల పొదల్లోన
సంచరించు సరీసృపం

ఎల్లలేని జగమొస్తే
యేమవుతాయీబుక్కులు
యీఅన్యాయవణిక్కులు
సంకురాత్రి చలిమంటన
సహాగమనం చేస్తాయి

కులమూజాతీదేశం
అనిఒక మిథ్యావేశం
కలిపించా రది మోసం
ఒక్కరంగుతోవెలిగే
ఉదధి మేఖలాగోళపు
పటమంతా పాడు జేసి

చిక్కిరిబిక్కిరిగీతల
చేత నింపి వేశారు
మానవ ఏకత్వాన్ని
నిలివున చింపేశారు

ఉదయించెను ఉదయించెను
యుగయుగాల మొద్దునిద్ర
కుద్వాసన చెప్పు దినం

లేచినిలిచి మేను విరిచి
ద్యావా పృథ్వీ మార్గం
ఆక్రమించి ఆవులించి
పలికించును ప్రజామూర్తి

అతిసమీప మరుదెంచెను
సర్వధరా సంతోషం
పీడిత జనపీయూషం

కుంభవృష్టి కురిపించే
దుర్ధర్ష ప్రచండాబ్ద
సందోహపు దండయాత్ర

ఈ వెల్లువ కల్లోలంలో
ఈ గోడలు ఈ మేడలు
ఈ నీతులు ఈ బూతులు
ఈ జాతులు ఈ దేశాల్
ఈ పీడిత జనపాశాల్
ఫట్ ఫట్ ఫట్మని
చెల్లా చెదరైపోవును
తుదు మట్టంగా కూలును

మృత యుగం నిర్గమించి
కృత యుగం అవతరించి
నిర్వాసిత సమున్నత
నిర్మల ధరణీ స్థలిపై
సుఖశాంతులు వర్ధిల్లును



కరిభీకరగ్రాహ కంఠలుంఠన వేళ
హరిధరించిన చక్రఖరమరీచి
కుంభినీధర సముజ్జృంభ మాగెడునాడు
గోత్రారి దాల్చిన కులిశధార
పృథివీశ నాశనాభీల కాలంబున

భార్గ వుండెత్తిన పరశు హేతి
కాలకేయాది రాక్షస ఘోర వధనాడు
గాండీవి తీసిన కరకుకోల
స్మృతిపథంబులఝుళిపింపజేయవలయు
వసుధ కలికాల రాక్షస వర్గదుర్గ
భేదనోదగ్రధాటి గుంభింపవలయు
తత భయంకర కవితా శతఘ్ని అగ్ని.



మీ ఆధునిక జీవన శిల్పి లౌడ్ స్పీకర్, మీ లీడర్
అహోరాత్రాలు వమనంచేసే నాగరకత భుజించి
భరత నాట్య భంగిమల్లో వంగి పోతున్న
ఓ ప్రజలారా ! నా స్నేహితులారా ! ఒక్కటి
నామాట వినండి
కంఠాలు అమ్ముకుని శబ్దాల పాశవిక శక్తుల
ఊరేగింపులో జెండాలు పుచ్చుకుని పోతున్న
వయస్కులు యువకులు శిశువులు
స్త్రీలు పురుషులు అందరూ వినండి
మిత్రుడు మార్గదర్శకుడు వేదాంతి అన్నీ అయిన
మీ శబ్ద బ్రహ్మ మీ మీదికి విడుదల చేసే
కఠోర క్రూర అఖండ శబ్ద బ్రహ్మాండదండ యాత్రల్లో

కొట్టుకు పోతున్న అమాయకుల్లారా రండి
నిశ్శబ్దం ఒకటి ఉందని మరచిపోకండి
శాంతి నిశ్శబ్దపు అడుగులతోనే నడుస్తుందని
తెలుసుకోండి
శబ్దం సంహారిస్తుంది మనిషిలో ఉన్న ఎన్నో
పటు శక్తుల్ని
నిర్హేతుక ధైర్యం దాని కవచం - ఎన్నో గొంతుల్ని
లౌడ్‌స్పీకర్ కంఠం ఒక్కటినొక్కి వేస్తుంది
వివేకాన్ని వధిస్తుంది ఆలోచించే వ్యవధి ఇవ్వదు
నా వేణువు మనిషి శరీరాన్ని కాదు ఆత్మను
లేపుతుంది
శరీరాన్ని ఏ ముసుగుధారి కవి అయినా లేపుతాడు
ఆత్మను నేనే లేపాలి
శరీరాన్ని లేపినా మళ్ళీ కళ్ళు మూస్తుంది
కానీ నిదురించే ఆత్మ కళ్ళు తెరిస్తే
ఇక నిద్ర అన్నది లేదు
జాగృతి క్రూర హస్తాల్లో నుంచి మనిషి
ఇక జారి పోలేడు పారిపోలేడు
వేణు రంధ్రాల మీద నర్తించేవి నా అంగుళులు....
బాధ చెక్కే నిశ్శబ్దశిల్పం నాముఖం....
కేవల నిశ్శబ్దోపాసిని, నా వాక్య వేణువులూదే
మాధురి లో పారవశ్యం చెందండి
మీ సహస్ర నాడుల్లో ఉన్న శక్తుల్ని శబ్దం

సంహరించి ఒక పరాజిత యుద్ధంగా మార్చిన
మానవత్వాన్ని వెయ్యికాళ్ళ మీద నడిచే
దుర్గంలా చేసుకోండి
జెండా వ్యాపారులు మీకు చేస్తున్న
అపార నష్టాన్ని గుర్తించండి.



ఉదుధులీది ఉత్తాల
హిమాద్రులెక్కి,
ఉడువీధుల కధిగమించి,
ఉప్పొంగిన ఉత్సాహం
మానవ మహా సమూహం;
పరిణామ ప్రవాహధారా
ప్రత్యక్షస్వరూపదేహం
ఆహా! ఈనాడేమో
ఆకాశం అంటలేక
అడగారిన అంబుధి కెరటం
లాగై, వేసవికాలపు
వాగై, శుక్లపాడ్యమీవేళా
శశిరేఖకు విడుచు నూలు
పోగై, అడగారిందేమో!

పరమార్థ ప్రస్థానానికీ,
పరిపూర్ణ నరత్వానికి
పరిక్రమించి పరాక్రమించిన
పరిణామ ప్రచండవేగం
కంఠేకాలుని జడలో
గర్జించే నిర్ఝరిలాగున
నిర్జీవ తమస్సమాధి
గర్భంలో దుర్భర వ్యథలో
కార్యవిహీన క్రుధలో
క్రుంగిపోయి కూర్చున్నది

మానవత్వ విద్రోహం
మా స్వేచ్ఛా పత్రాలను
విచ్ఛేదం చేస్తుంటే
అంతరాత్మ ఆక్రందన
అడవిలోని వెన్నెల్లా
అణగి మణగి పోతుంటే
మా తియ్యని కలలన్నీ
మటుమాయం అవుతుంటే
విహాయ నేత్రుడ్నయి
సహాయ హీనుడ్నయి
దీనుడ్నయి

ఆధైర్య పర్యంకంలో
భ్రమాజనిత పంకంలో
పడిపోతూ దిగబడిపోతూ,
ఎదుర్కొనే నైతికశక్తీ,
తిరగబడే ధైర్యస్ఫూర్తీ,
ఉదయించక మది యించుక
జారిపోయి, కాంతిరేఖ లారిపోయి
కూర్చున్నా............

అయ్యో నే నీ దశలో,
ఈ నిశలో నిలువలేను
నా సర్వస్వాయువులను
బాధామూషిక దంష్ట్రలు
పటపట కొరికేస్తుంటే
దేహం మహోగ్రకీలా
వ్యూహంలో, నిరుత్సాహంలో
చిటచిట నశించుతుంటే
ఈ దశలో, ఈ నిశలో
నిలువలేను, నిలువలేను.

ఓ దివ్యజ్యోతులార!
ఏదిక్కులనున్నారో
ఋషులై, అనిమిషులై

వియదధ్వంలో ధ్రువులై
విలసిల్లే తారలార!
త్రిభువన దీపాంకురమై
వెలిసే సుధామయోక్తికి
వీనులు వీక్షిస్తున్నయ్........

నా నాడుల్లో రక్తం
ఉత్తుంగ తరంగితమై
ఉప్పొంగుచు ఉరకలువేసే,
నాహృదయం నవవసంత
ఉదయంలో పరుగులెత్తి
నే నుజ్జీవం పొందే,
సందేశం యివ్వండి

నే నెవరో గుర్తించి,
భూవలయం, నభోనిలయం,
దశదిశాంతాలు నిండి,
కాలాంత ప్రచండవేళా
సముజ్జృంభ శంభూద్భట
విశ్వమూర్తినై వెలిసే
సందేశం యివ్వండి

దానవ సందోహశిక్ష,

ధర్మ దేవతా రక్ష,
వరించి ధరించిన
ప్రజా భుజాదండానికి
సముద్దండ గాండీవం
సంసిద్ధం చేయండి

వినువీధులు భేదించే
విశ్వ ప్రియ శంఖారావం
వినిపిస్తే, మీ మూర్తులు
కనిపిస్తే
మా ధనువులు, మాతనువులు
ధర్మ కురుక్షేత్రంలో
చరితార్థం చేస్తాము
నిమిషకాల మాత్రంలో
చరిత్ర సృష్టిస్తాము.

●

ఝురులం దభ్రచరత్ త్రివేణీ
గిరులన్ శైత్యాచల శ్రేణీయున్
నరులం దన్యహితార్థ మాత్మ
బలిదానం బిచ్చు మృత్యుంజయుల్
స్మరణీయుల్ గ్రహతారకా
వసుమతీచంద్రార్క పర్యంతమున్

సురతేజోమయతత్కథా
సరణి సుశ్లోకంబు లోకంబునన్

ఇల్లున్ వాకిలి తల్లిదండ్రులు ధనం
బిల్లాలునుం బిల్లలుం
బల్లీ పట్టణదేశజాతి వివిధ
ప్రాపంచికాహంక్రియా
వల్లీజాలములెల్ల ద్రెంచుకొని
విశ్వజ్యోతి రారాధనా
మల్లీపుష్పములైరి లోకహితముం
బాటించి మృత్యుంజయుల్

మమకారంబులు లేవు మాతృజనకుల్
మావాడు వీడన్నచో
భ్రమయైపోవు, విశాల మానవ కథా
పాథోధికల్లోలితా
ధ్వములంబోయెడువారు, జీవితము
సత్యజ్వాలికామాలకున్
సమిధంజేయు నశాంతిరూపు ; లదె
యాశాసూత్ర మీధాత్రికిన్

ముందుకు సాగు సృష్టికోక
మూర్తి ఘటించి సమస్త మానవ

స్యందనముం గదల్చి సమ
రాగ్ని సమూహాములం జరించి సం
క్రందన సీమకేగిన ప్రగాఢ
తపస్వులు కర్మవీరులా
కందని కీర్తికాయులు
జగమ్మున మృత్యువులేని జీవనుల్

లోకము శోకసాగరము
లోబడి ధైర్యము కోలుపోయి ద
ర్వీకర భీకర ప్రభుప
రీతముగా బడియున్న గాటుపుం
జీకటివేళ లేచి నవ
జీవము వోసి సమస్తలోకమున్
నాకము వైపుగా నడుపు
నాయకులా పరిణామ సాయకుల్

బలియై పోవుటకే జనించిరి, ధరం
బంగారు పండింపగా
కలలంగాంచి మహోద్యమ స్ఫురణకున్
గర్తృత్వముంబూని, యీ
యిలలో కారణజన్ములై మనుటకే
యేతెంచి రాయంచిత
జ్వాల దగ్ధుల్, సుఖశయ్యలన్ మధుర

చర్చల్ సేయగా వచ్చిరే

ఇచట చరాచరమ్ము లుద
యింపకమున్ను విదూరతారకల్
విచికిల కాంతులం గగన
వీథుల దోచకమున్ను విశ్వసం
కుచిత నిశీథిలో తిమిర
కోణములో గల ఆదితేజ మీ
రుచిర తనూలతల్ దొడిగె
లోక పురో పరిణామ ధోరణిన్

వారలె బాహుదండము లవారితమౌ
పరిణామ శక్తికిన్
వారలె పోరి బాధపడి
ప్రత్తురు చత్తురు వారలిచ్చు ఆ
తోరపు రక్తపూర్ణ బలితో
జ్వలితోజ్జ్వల జీవ నిర్ఝరీ
పూరము గట్టుద్రెంచుకొని
పోయిపడున్ జగతీ తలమ్ము పై

ఇక నుదయించు వారి శక
మే; సుఖమేదుర భావిజీవికా
ముకుళము విచ్చి సౌరభస

మూహాము మోహాము వెల్లి గొల్పగా
చకచక సాగిపోవును ప్ర
జావళి కోవెల్లవైపు రీతిగా
తుకతుకలాడు గుండియల
తో నవజీవన లోకసృష్టికై

ఎనయ నధర్మ రాక్షసి
యనేక శిరస్సుల యుగ్రమూర్తి కిన్
ఘనతరమైన యర్థ మధికారము
రెండు ప్రచండ బాహువుల్
జనుల గళమ్ములన్ నులిపి
సత్యముకున్ నిగళమ్ము వేసి తా
ననయము వీరతాండవ వి
హారము సేయును విశ్వవీధులన్

ఒకకాలన అధర్మ రాక్షసి
మహా ఉద్దండగాండీవమై
సకలాక్షాత్రతలమేలుగాక
పటుహింసా పీడిత స్వాంతయై
అకలంకమ్మగు సత్యదేవతయె
క్రిందౌగాక తద్భీకర
భ్రుకుటీకోటర దావపావక
శిఖల్ భూలోకముం గాల్పవే

నిరతమ్ముం దురితమ్ము సేయు తలపుల్
నిర్నిద్రగృధ్రమ్ములై
చరియింపంగ శిరః స్మశానమున
రూక్షంబై "యధర్మంబు" యే
జరయున్ మృత్యువు లేనివారి నెటులో
సంహారముం జేయ ను
ష్కరయత్నంబు లొనర్చు వ్యర్థమను
విజ్ఞానంబు లేకుండుటన్

రాలెడు పండుటాకుల పరంపరలో
చివురించు రెమ్మలో
ప్రాలెడు సంజలో మృదుకరమ్ములు
విచ్చెడు ప్రత్యూషస్సులో
నీలిమలో భ్రమించు ధరణీ స్థలి
యంతట నిండియున్న ఆ
కాలగతి స్వరూపులను కాంచి
వధించుట యన్న శక్యమే

చావు బ్రతుకుల మధ్య సాంధ్యరాగమ్ముగా
అవతరించి విరించి యైనవారు
అణుగర్భ జాతమై అఖిల బ్రహ్మాండమ్ము
వాణికి ఒక వీణ యైనవారు

ప్రకృతి అంతర్గత ప్రథమ సూత్రాలకు
ఆఖ్యాత లుద్గాత లైనవారు
పరుగెత్తు దుర్వార పరిణామ శక్తికి
అసమాన బాహువులైన వారు

నరుల వానర తరుల నిర్ఝరుల గిరుల
సాగరమ్ముల నంతరిక్షాది సకల
దిశల నశరీరులై లసత్ దివ్యకిరణ
చరణులై నిండియున్నారు శాశ్వతముగ



జనతా ఘోష పరీతమై
సమరగర్జా జర్ఝరీభూతమై
కనకస్ఫీతమదాతిరేక
ధనిక క్రవ్యాద బాధావళీ
ఘనజీమూత సమేతమై
వగచు లోకద్వార తీరమ్ములన్
చనుదెంచెన్ నవరంగవల్లి
కలతో సంక్రాంతి కాంతిచ్ఛటల్

రాజుల్ పోయిరి, రత్న కాంచనమణీ
గ్రైవేయ ఘంటావళీ
రాజత్ కుంజర మంజరీముఖరిత
ద్రాఘిష్ఠ కోష్ఠంబులొ
రోజుల్ పోయెను పీడితంబయిన
యీ లోకంబునం దేక శాఖా
జిజ్ఞాస జనించె విశ్వజగతీ
కల్యాణ సిందూరమై

పల్లెపల్లెలలోన భ్రాతృత్వ సామ్రాజ్య
విజయ ధ్వజంబులే వెలయు గాక
వాడవాడలలోన వర్ధమాన ప్రజా
సంతోష ఘోషలే సాగుగాక
దేశదేశాలలో ద్వేషదావానల
జ్వాలికామాలికల్ సమయుగాక
ఖండఖండాలలో కమనీయ
సౌజన్య జన్యప్రశాంతి యెసంగుగాక
గగనగంభీర రోదసీగర్భకుహర
విహారదజ్ఞాతలోకాల వెలయుచుండు
జీవకోట్లకు సౌఖ్యసంసిద్ధిగోరి
హృదయహృదయాల ప్రార్థనల్ పొదలుగాక!



భూగోళం
అహోరాత్రాలూ చరఖాలా జ్యోతిశ్చక్రంలో
వడికేనూలు కాలం
జీవిత సర్వస్వాన్ని మూడుముక్కల్లో చెపుతావు
కాలానికే అర్థంచెపుతావు, నీవు కవివి!
అయితే కాలం నిన్ను కూడా మూర్ఖులందరితో పాటు
పోగు చేసుకుపోయి
మృతస్మృతుల చెత్తకుప్పల్లో పారేస్తుంది
ఓ శేషేన్! నువ్వుమాత్రం వెయ్యి జ్యోతుల్ని
బుజంతడుతూ
నడిచిపో
పౌరాణిక డోలికలో పెరిగింది కవిత్వ శిశువు
దాన్ని చూచి బెదిరింది మనిషిలోని పశువు
శిశువుకాదు తనకోసం జన్మించిందొక పరశువు

మనిషిని తమ చేతులతో
మలచిన పూరాణ కర్తలు
లోకాలను సృజించారు
లోకాలు త్యజించారు
ఆ ఊహాబ్రహ్మాలయుగమే
స్వాహా ఐ పోయింది

పోయింది స్వప్న విద్య
పోయింది స్వర్ణవిద్య
తర్కవాదదంష్ట్రల్లో
జగం నలిగి పోయింది
మానవాత్మ సంశయాల
వెనక అస్తమించింది
మర్మలోకరహస్యాల
మహిమ కోలుపోయింది

వాళ్ళే మన అందరి
గుండెల్లో బ్రహ్మాండాలను
జెండాలుగ ఎగరేశారు
ఉక్తుల్లో శక్తుల్ని
ఉత్పాదన చేశారు
శబ్దజ్యోతులు భువన
త్రయిలో వెలిగించారు

పంచేంద్రియ బంధాల్లో
పడి ఉండని లక్షణాల
చూర్ణంతో ప్రతీకల
శరీరాలు చేశారు
అంతర్గత నిద్రాణ
అనుభూతులు మేల్కొల్పే

పరిమళాలు రేపారు

ఆ పరిమళాల తుఫానుల్లో పడి మనం ఏవో అవ్యక్తమధుర జిజ్ఞాసారసతీరాలకు కొట్టుకు పోయాం......

తమవిశాల పక్షాల మిద మన
ప్రాణాలను మోసుకు పోతూ
సీమనుంచి సీమాంతర సీమకు
అంతరిక్ష వక్షోంతః స్థలిలో
మహిత భూర్భువః సువర్లోకములు
మనకు పరిచయం చేశారు
మనలజ్ఞాకుంఠిత ఊహాలు
దూరాలకు విశిరేశారు

వారి అంతః ఖగోళంలోత
ఊగునక్షత్రాలదుత్తులు
పరుగులెత్తే ఉగ్రఉల్కా
పతనకాంతి ప్రళయ ఝంఝలు
మన మనోమయకోశసీమల
ఘన పునాదులనే పెకల్చును

వారి జీవన తంత్రమంతా
కావ్య తంత్రంగా మరల్చును
ఓం ఇదం నమఋషిభ్యః
పూర్వేభ్యః పూర్వ జేభ్యః
పథికృద్భ్యః

వారి మాటల్లోకి దిగి న
ర్తించు వాఙ్మయ దేవజాతులు
వారి శాఖలు చేరిపాడే
పక్షులను స్వర పరబ్రహ్మాలు
వారినీ లిమనుంచి మనపై
మధువులను వర్షించు గాలులు
మన తనూదహారంతరాళ
స్నాయు వులనే తెంచి వేయును

అవచనీయ తురీయచాంద్రీ
ప్రవాహాల్లో ముంచి వేయును
వారి ప్రాణ సముద్రభాషా
ఘోషరేపే అలల్లోంచి
ఆత్మ వెండి జలాలలోతు
ల్లోంచి లేచును చందమామలు
ధగద్ధగమను సూర్యనారా
యణ జ్యోతిర్మండలాలు

వ్యోమ సీమా దిద్దిగంత
ర్వ్యామి తారా కుటుంబాలు

ఒక మహాద్భుత సృష్టి అది మిలి
యన్లకాంతి ఛ్ఛటలతో ఉద
యించు ఊహాబ్రహ్మ తేజము
దాని కిరణ సమూహ తునకలు
దాని రౌప్య రజస్సు ధూళి
ఎగిరి పడి చైతన్య మండల
ఊర్ధ్వలోకా లాక్రమించును
రెక్కలొచ్చినవాక్కులై
భూగోళ మంతా సంచరించును

వారి అంతర్ద్రవ్య భాండా
గారతాళపు చెవి - ప్రతీక
వారి శబ్దంలో రుతించే
మర్మ జలపాతాల ఐంద్రీ
చాపఖండిక- అదిజనించిన
క్షణం దైవీ కాలమానం
ఒక హిమాలయ సమానం
ద్రష్టలిచ్చిన మనపురాణం

భాష లోహం వంటి దేగద
దాన్ని భావ జ్వాలికల్లో
కాల్చి కరిగించారు వంచా
రెన్ని రీతుల సమాసాలుగ
శైలిగా వాక్యాలుగా బహు
రూపులిచ్చిరి రేఖలిచ్చిరి
దానిలో ఒక అఖండోజ్జ్వల
జీవలీలను మేలుకొల్పిరి
వారు చాతుర్ముఖ బ్రహ్మలు

ఆ ఊహా బ్రహ్మల యుగమే
స్వాహా అయి పోయింది!

కాలమెంత అవిలంఘ్యం
కాలమెంత అవిజేయం
మహాకాల విశ్వరూప
మహిమ నీవు దర్శిస్తే
శతాబ్దాల పరాక్రమం
భాషా శష్పసమానం
ఒక్కో మతప్రాబల్యం
ఆ శతాబ్ది చాపల్యం

మనిషి పోరిపోరి పోరి
మంచిన సాధించనీ
అదికూడా అశాశ్వతం
అందుచేత పోతుంది
నరుడిపోరు భూమిమీద
నాటకమై పోతుంది
మంచిపోయి చెడ్డవచ్చి
మారణహోమంచేశే
దుర్జన రాజ్యయుగంలో
మనిషే ఖడ్గంగా మారి
మంచిని స్థాపిస్తాడు

మంచి చెడ్డలనే రెండూ
మారక తప్పదు వాటికి
మారే ఈ లోకంలో
మంచి అనే దెల్లప్పుడు
నిర్విరామ మానవీయ
భీషణ సంగ్రామ ఫలం
కానీ మానవ ఆయుః
కాలపు పర్యంతంలో
దేని వంతు వస్తుందో
తెలీనిదే అదృష్టం
త్రవ్వి పోస్తు న్నారు మిత్రా

ఉన్న అన్నీ రోడ్లు మీరు
పిదప మళ్ళీ కొత్తరోడ్లను
వేస్తారో ముగిస్తారో
రోడ్డుఏదో ఒకటి కావలె
గుడ్డికాళ్ళకు నడవడానికి

విప్లవ మొక కాలపు హస్తం
దార్శనికత రెండో హస్తం -
ప్రళయానంతరసృష్టికనర్హుడు
రాజకీయ నాయకుడు.......
వాడి కాళ్ళపై వాలే తుమ్మెలు
వంది మాగధులు మన కౌలు

అదిగో దేవాలయగోపురం ! ఆధునిక ప్రపంచ దృశ్యాన్నంతా సమీక్షిస్తోంది తన పౌరాణిక నేత్రాలతో గాలి చెట్లనడుముల్ని బాహువులతో బంధిస్తోంది

గుర్రాల కండల కంటే
నీటి కండలే బలిష్ఠం
మనిషి కండరాల కంటే
గాలి కండలే బలిష్ఠం

సముద్రాల వీపుల మీద
తుఫానుల మూపుల మీద
సవారి చేశే రౌతుల కండలు
నివాళులిచ్చిన స్వప్నలోకమే
పురాణ గోపుర దేవాలయ -ఓం-
మహాత్తర ప్రాకారానీకము !

ఇక్కడేతెలుసుకో
ఆ కండలకే నూతన గోపుర
దేవాలయ నిర్మాణ సమర్థత
ఆకండలకే సాధ్యం మళ్లీ
ప్రళయానంతరపునః ప్రపంచం. . . .

దేవతల్ని సృష్టించా రాశిల్పులు
నాయకుల్ని సృష్టించారీ అల్పులు
సంస్కృతులుపాలించాయప్పుడు
కులమతాలు పాలిస్తున్నాయిప్పుడు
మనిషి కొరకు మతాలు పుడితే అప్పుడు
మతాల కొరకు మనిషి పుడుతున్నాడిప్పుడు
ఓహ్ !
మనిషి లేడు మనిషి లేడు
ఈనా డీలోకంలో
మతము మతము మతము మతము

అభిమతమే ఆధునికత
రాజాస్తానుకుపోనీ రోజాస్తానుకు పోనీ

నాగపురులో హిందీ నమిలేసీమకు పోనీ
మనిషి వాంతి చేసుకునే తెలుగు ముల్కికే పోనీ
కేరళలో మళయాళపు కోరల్లోనికిపోనీ

మనిషి లేడు మనిషి లేడు
కులమతాలు భాషలనే
క్రూరదంత వక్త్రాల్లో
పడి చూర్ణమైనాడు
పడి చూర్ణమైనాడు

ఓ మనిషీ ఓ మనిషీ
నీ కోసం చూస్తున్నాయ్
నీ కోసం చూస్తున్నాయ్
నా కన్నులు కర్ణాటకలో
నాకన్నులు కలకత్తాలో
నాకన్నులు భాగ్యనగర్‌లో
అన్నిదిక్కులా అన్వేషిస్తూ-

నాకన్నులు పీకేస్తా
నీదర్శన మివ్వకపోతే
అంధత్వం విధించుకుంటా



విప్లవ భాషావిధాత కవిసేనమేనిఫెస్టో ప్రణేత బుధజన విధేయ శేషేంద్ర నాయధేయ కవి వర్య ప్రణీత ఆధునిక మహాభారతస్య అనుబంధ కావ్యం జనవంశమ్‌లో యుద్ధకాండ సమాప్తం

# చమత్కారికాఖండము

## చమత్కారికలు

కవిత్వ మంటే స్వప్న విద్య అని
ఉపదేశించే ఓ - శేషన్
కలల వర్తకపు క్యాపిటలిస్టువు
నీవని కసితో నిందిస్తాన్

మనిషి ధనానికి బానిస అంటూ
మార్క్స్ చెప్పినదివాస్తవమే
మనిషి డబ్బుతో మారడమన్నది
మటుకీ శతాబ్ది జోకుసుమా !

మధ్యాహ్న వేళల్లో హేమంతవృక్షాలక్రింద
నీడలు పడుకొని నిద్రపోతున్నాయి

పూలకాలనీల్లో తంబురా మీటు తూ
తిరుగుతోంది సన్యాసి తేనెటీగ
ఒక్కబిందువు మకరందభిక్షకోసం

వాయువుల్లోరెక్కలుజాపి
నిశ్చలత్వం సాధిస్తున్న పక్షి
తొమ్మిదీ మూడుమీద

చేతులు జాపి ఉన్న
గగనంలో గోడ గడియారం

జీవితాల్లో ఖైదీలయి ఉన్న మీారు
కట కటాల్లో కన్నీరు కార్చకండి
నిట్టూరుస్తున్న ఆకాశాన్ని పరిచయంచేస్తాను
ఆక్రోశిస్తున్న సముద్రాన్ని చూపిస్తాను
మీా కిటికీల సందుల్లో మీాశ్వాసల
రాక పోకల్లో గాలినై పూల ఊపిరినై
కిరణాన్నయ్ వస్తాను నేను శబ్దాన్ని
కటకటాల్లో కన్నీరు కార్చకండి

నీకు జ్ఞానం కంటే ప్రేమతోనే పని ఉంది
నీవు కవివి ఓ శేషేన్!
సుత్తులతో కొడవళ్ళతో జీవితం
శిల్పించేవాళ్ళని నిద్రలేపుతావు
విప్లవానికి నీవు ఉదయ తారవు

అది ప్రపంచమంతా వ్యాపించింది
నేను రాశింది ఇప్పుడెలా తుడి చేస్తావు
నా పాయెం అవమానము అశ్రువు
క్రోధము గాయము తుఫాను అనే
పంచభూతములతో చేశిన శిశువు

అది ఒక తిరుగు లేని ఆయుధం

నా హాయెం ఒక లిల్లీ నీడ
ఒక నదీస్మృతి ఒక ఆందోళనలో
మునిగి పోయిన దినం
నా పద్యంలో నుంచి మధువులో
తడిశిన సంధ్యలు రాలవు
బాల్కనీలో నుంచు చూచే
చంద్రబింబాలు ఉదయించవు
అది ఒక తిరుగులేని ఆయుధం

నేననుకుంటాను ఈ దేశంలో
మాతృగర్భంలో ఉన్న శిశువు
అక్కడే ఉంటే మంచిది
బయటికి వచ్చి ఆకలి అని ఏడిస్తే
ఇక్కడి వాళ్ళు పుట్‌పాతులు
చూపిస్తారేగానీ పాలాలు కాదు

ఆకాశంలో వ్రేలాడుతోంది దినం
దినంలో వ్రేలాడు తున్నాడు మనిషి
మనిషి నా పద్యంలోకి వచ్చి యిరుక్కున్న తుఫాను
నేను జీవిత అఖాతంలో ఇరుక్కున్న
సముద్రం

అరే ఈ దేశం మీకేమిచ్చింది
వంకరటింకర్లుగా వంగేదేహం
బానిసత్వం మీద వ్యామోహం
మీరెగరేశే జెండా మీకే మిచ్చింది
ఐదేళ్ళ కొక సారి ఓట్లు
ఆమధ్యలో కునికిపాట్లు

పత్రిక ముట్టుకుంటే చాలు పామైకరుస్తోంది
రోడ్డుతొక్కితేచాలుబజారుకాటేస్తోంది
సూర్యోడుదయిస్తే చాలు బ్రతుకు ఉరిత్రాడవుతోంది
ఓట్లు మేసి ఒళ్ళు బలసిన నాయకుడి ముందు
ఏనుగంత రూపాయ ఎలుకై సలాంచేస్తోంది
అరే ఇప్పటికేమున్నిపోయాం
గోదావరీ జలంబుల యందు

తెలుసా బిడ్డా ఈ దేశంలో
రాజకీయతువురాగానే ఓట్ల డబ్బాలకు
గర్భ స్రావం జరుగుతుంది!
ప్రజా స్వామ్య శిశువు ప్రసవం
ఎప్పుడూ జరదగు
ఓట్ల వరికోతలు మాత్రం
యథావిధిగా జరుగుతాయి
రాజధానుల్లో ధాన్యాగారాలు నింపడానికి

మన బ్రతుకుల్ని సుందరీకరించడానికి
ఈ యుద్ధా లెందుకు ఈ బడ్జెట్లెందుకు
ఏ ఇంటి మీద సూర్యుడు తన ప్రభాతాల్ని
కుమ్మరి స్తాడో ఒక స్వర్ణవర్షంలా
దాన్ని ఎలారక్షించు కుంటావో
ఈ బడ్జెట్ ఉచ్చుల్లో నుంచి
వాడు నిన్ను నేరుగా సూర్య చంద్రులకే
అప్పగిస్తా నంటున్నాడు

దేశంలో రాజకీయ వాయుపీడనంచేత
దేశభక్తి తరగిపోయి దైవభక్తి పెరిగింది!
స్వాతంత్ర్యానంతర యుగమున
సర్వదేవతా జాతికి
నిద్రాహారములు లేవు నిమిషం విశ్రాంతి లేదు
భక్తులు పెట్టే బాధలు తట్టుకునే శక్తి లేక
గుళ్ళు గోపురాలు విడిచి గుట్టలు పుట్టలు అనక
పట్టు పంచలెత్తి పట్టి పారిపోవుచున్నారు!

ఎన్ని రోగాలైనా సరే ఎన్నికల మందుతోనే
నయం చేస్తామనే భూత వైద్యులు
బాబూ ! దేశం నెత్తిన పెట్టారు
శుష్క ప్రజాస్వామ్య శూన్య హాస్తం
అరే ప్రజారక్తం నేల మీద రాలుతోంది

రండి ఈదినాన్ని అంతం చేయక తప్పదు-

ఉదయ కిరణాలు పోలీసుల్లా
వెదుకుతున్నాయి ఏదో తీవ్రంగా
చెట్లల్లో చెరువుల్లో చివరకు తామరపువ్వుల్లో!
పాపం వాటికి తెలీదు,
రక్తకణాల్లో దాక్కో ఉన్న దొంగల్ని
రాష్ట్ర పతికూడా పట్టు కోలేడు

నన్నుబోలిన యావదాపన్నజనులు
నాదు జాతిగ భావింతు నాదరమున
నంతి యేగాని దేశమ్మైదైన నేమి
దాసుడను గాను మూఢవిశ్వాసములకు

ఆయుధమ్ముగ ఝళిపింప జేయవలయు
వసుధ కలికాల రాక్షస వర్గదుర్గ
భేదనోదగ్రధాటి గుభింపవలయు
తత భయంకర కవితా శతఘ్ని అగ్ని !

పోయింది స్వప్నవిద్య
పోయింది స్వర్ణవిద్య
తర్కవాదదంష్ట్రల్లో
జగం నలిగి పోయింది

మానవాత్మ సంశయాల
వెనక అస్తమించింది
మర్త్యలోక రహస్యాల
మహిమ కోలుపోయింది

మహితాత్ములు ఎందరు భువిలో శ్వాసపీల్చి
చాలించారో
భూమిమీద నిశ్శబ్దంగా నడిచి నిష్క్రమించారో
మైకొక్కటీముట్టలేదు పత్రికలో మెట్టలేదు
వాళ్ళంతా నడిచిన దారులు వార్తలుగా మారలేదు
మెరిసే మకుటంమినహా శిరసే కనిపించని నూతన
రాజుల ఎంగిలి కూతలు పేజీలై పోతుంటే
చప్పుడు చెయ్యని అడుగులు చరిత్రలో కెక్కలేదు

దోమల సామ్రాజ్యంలో ఈగల డిక్టేటర్లు
ఒంటెల సౌందర్యానికి వంత పాడుగాడిదలు
ఇక్కడ ప్రాకే చీమలు హిమాలయ శ్రేణులు



ఎండలాంటి నా ఊహ శబ్దంమీద పడింది
సుదీర్ఘంగా దాని నీడ శతాబ్దంమీద పడింది
సూర్యుడు ఉదయం పూచిన పూలతో క్రీడిస్తున్నాడు
కాలం వీరుడ్ని చూచి భయపడింది

సముద్రం ఒకటే కాళ్ళ దగ్గర కూర్చుని మొరగదు
తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు
పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు
నేనింతా ఒక పిడికెడు మట్టి కావచ్చు
కానీ కలమెత్తితే నాకు
ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది

అరే ఎన్ని మైళ్ళని కాదు
ఎన్ని శవాలు ముందుకు పోయామో
కొలుచుకో
ఇదిగో నా హృదయం
విసిరేస్తున్నాను పట్టుకో

ఓ కవీ అప్పుడే గోడకు తగిలించకు
నీ పద్యాల్ని యుద్ధానంతర శస్త్రాల్లా
నీ మాటల దేశాలనుంచి మత్తకోకిలల్ని
బహిష్కరించు
రాబోయే ఇతిహాసం కోసం

నీ శబ్దాల్ని నూరి పదను పెట్టుకో
ఎన్ని తుపాకుల దూరముందో
వాడిగుండె, కనుక్కో

నా యుద్ధాల పొగల్లోనుంచి
పద్యాల ముఖాలు పుడతాయి
నా గొంతు జలపాతానికి బెదిరి
చెదిరి పోతారు
కాలపు మేకులకు వ్రేలాడే కవులు
నడిస్తే నా అడుగులు
మబ్బుల్లో పరుగెత్తే పిడుగులు
దించితే నా చెయ్యి
వెయ్యి కిరణాలు వ్రేలాడే
సాయం సంధ్య

నా ఊపిరితిత్తుల్లో గాలికాదు
గాలివానలు గాండ్రిస్తున్నాయి
నా మాటలు ఈ దేశపు మట్టిలో
చల్లుతున్నాను
అన్ని దిక్కులా కత్తులు మొలవాలని
నేను జ్వాలల్ని కొరడాలుగా
ఝళిపిస్తున్న అగ్నిని

ప్రేమించిన చోటి నుంచి
భూకంపాలొచ్చినా కదల్ను
జ్యోతి భయపడుతుందా
అంధకారాన్ని చూచి
మృత్యువులో కూడా నేను
ఝుంఝూ మారుతాన్ని
నా కవిత్వం మనిషికి
కేవలం ఒక డిఫెన్సు

నేను తుఫానులకోసం
గాయాలకోసం తాగుబోతులకోసం
వెతుక్కుంటూపోయేవాడ్ని
ప్రజాశిఖరాలు చూస్తే కరిగి ఒక
పద్యాన్నయ్
కాగితం మీదికి కారిపోతా
కన్నీటి వాక్యాన్నయ్
జనంలోకి పారిపోతా

కష్టాల్ని కన్నీటిలో ముంచుకుని
బిస్కెట్లలాతింటాను
బ్రతుక్కంటేబలవంతుడైనవాడే
శబ్దంనుంచి శతాబ్దంవరకు
మలిచే శిల్పి అని ఆవిష్కరిస్తాను

నా గంభీర వేగాన్ని చూడండి
రండి నా శబ్దజ్వాలల మీద
మీ హృదయాల్ని రొట్టెల్లా కాలుస్తా
మీ రెటు నడవాలో చూపిస్తా

నాగళ్ళు తీసుకోండి నా సోదరులారా
పుస్తకాలు పారెయ్యండి నా దేశపు పిల్లల్లారా
మన ఉషస్సుల్ని పాతిపెట్టి మనదేశంలోనే
మనల్ని బానిసలు చేసిన వాళ్ళ ప్రాణవాయువులు
పీలుద్దాం పదండి

ఆ పెద్ద బిల్డింగుని ఒక్క గుద్దుతో
బద్దలు చేద్దామని లేస్తోంది నా హస్తం
నన్నిలా చూస్తే ఏముంటుంది
బ్రతికి ఉంటే పామరుడ్ని
చస్తే అమరుడ్ని

నేను సత్యాగ్రహిని
నా కళ్మల శరీరాన్ని దగ్గం చేసుకుని
నా దేశపు రహదారుల్లో
ప్రవహిస్తున్నాను తప్త హిరణ్యద్రవంగా
నా అవయవాలకు నీచంగా వంగే
భంగిమలు తెలీవు

నా నడకలు అడవుల్లో తిరిగే సింహాలు
నేను పూలతో పోట్లాడుతాను
తుఫానులతో పోట్లాడుతాను
పోట్లాట నేను బ్రతకడానికి పీల్చే ఊపిరి !

తెలిసో తెలీకో మా ప్రజలు
చేసే యుద్ధాలు ధాన్యంకోసమే
వాళ్ళు చేసే ప్రయాణాలు ఇతిహాసం వైపే
ఓ దేశమా నీవు నాకు తెలీకున్నా
నీ రక్తం నా దేహంలో ప్రవహిస్తోంది

నా తలుపు కొడుతోంది నా దేశపు భవిష్యత్తు
సమానతని మార్చేశారు సనాతన స్వప్నంగా
కవులకూ శబ్దాలకూ చెదపట్టింది ఈ దేశంలో
ఋషులే పుస్తకాలై పడి ఉన్నారు లైబ్రరీల్లో

నీవింకా గుడ్డులోనే ఉన్నావు
గుడ్డెలా ఎగురుతుంది బిడ్డా
నీకురెక్కలుఇవ్వడానికే
నిద్రపోకుండా మేలుకోఉంది నా కిటికీ
శ్రమించే కందరాలు
కోర్కెలసమాధులుకావు

బేటా వాణ్ణి మాత్రం నమ్మకు
వాడు జెండాలెగరేసే దొంగ
నీళ్ళున్న చోటికే ఎగిరిపోయే కొంగ
నీ చేతులో శతఘ్ని లేకున్నా
నీ ఛాతీలో గుండె ఉంది

నీ మూపు వంగితే
నీకాళ్ళు తుపాకుల్లా నిలవక పోతే
నీవు నా యుద్ధాల్లో పనికి రావు
నీవు దాహం అంటే గ్లాసెడు రక్తం ఇస్తా
బాధ అనే ఉలితో మనిషి బొమ్మ మలుస్తా
నీ శోకాన్ని దత్తతగా ఇవ్వు తీసుకుంటా

బాబూ మనం తుపాకుల్ని ఎదుర్కోగలం
కానీ నియంతలు ప్రశ్నల్ని ఎదుర్కోలేరు
సోదరా ఎలాంటి గ్రుడ్డితనాన్ని కూడా
కాపాడ బోకు కాంతిక్రౌర్యంనుంచి

హైదరాబాదు దినం వాంతి చేసుకునే
నాగరకతతొక్కుకుంటూపోతా
ప్రభుత్వ మార్కు ముఖాల్ని చూస్తా
చెట్లువైపు కేక వేస్తా
ఇవి పూలెందుకు పూస్తాయి

బుల్లెట్లెందుకు పూయవు!

నా గీతి నిశ్శబ్దాల కుట్ర
అశ్రువుల తిరుగుబాటు
అవమానితుల భాషాసమితి
ఒకనాడు నా ఛాతీలో ఉన్న
కోళ్ళన్నీ అరుస్తాయి
విప్లవాలన్నీ ఉదయిస్తాయి

నేను జేబుల్లో కోకిలల్ని వేసుకురాలేదు
పిడికిళ్ళలో బాంబులు బిగించుకుని వచ్చాను
నేను మోకరించి ప్రార్థిస్తున్నాను ఓ జిందగీ
నన్ను సుఖంమీద శిలువ వెయ్యకు

ఇల్లు లేనివాడు ఆకాశ క్రౌర్యానికి గు
భూమి లేనివాడు ఆకలికోరలకు బలి
మరణించే లోపుగా తన మాట చెప్పలేని
నిస్సహాయ మానవుడి గొంతు పేరే కవి!

స్వర్గాలు పిడికిళ్ళతో పట్టుకొచ్చిన
ఆనిష్కపటశిశువు
అశ్రువై నిద్ర పోతున్నాడు
ఓ గులాబీ పొదా! నీకు సిగ్గు ఉంటే

పాడబోకు
నీ గొంతులో ఉన్న ఆ బుల్బుళ్ళను
వాంతి చేసుకో

బాబూ నీ చిన్ని కన్నీటి బిందువులో
ఏ సముద్రం గర్జిస్తోందో నాకు తెలుసు
అందుకే చెట్లతో మొరపెట్టుకుంటున్నాను
ఆకులు కాదు తుపాకులు కాయండని

నీకు తెలుసా ఆకలి ఉందని
నీకు తెలుసా దప్పిక ఉందని
అవి రెండూనీ విలువైన స్వేచ్ఛమాంసం
తిని బ్రతికే క్రూర మృగాలని -
నేను నీజాతి గొంతునై చెపుతున్నాను
విను।
వాటి బారినుంచి నీవు తప్పించుకోవాలంటే
మీ నాన్న బొమ్మలూ బొమ్మల పుస్తకాలూ
తెచ్చియిస్తే తీసుకోకు, తిరస్కరించు।
పాలా లిమ్మను ఫ్యాక్టరీ లిమ్మను
అవే నీ ఆటవస్తువు లని చెప్పు -
మీ నాన్న తేలేక పోతే
దేశంలో ఉన్న నాన్నలందర్నీ
ఏకం కమ్మను .......

వేళ్ళు కాళ్ళయ్ నడిచే చెట్టు మనిషి
చెట్టుగా ఉంటే ఏడాది కొక వసంతమన్నా దక్కేది
మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను

రైతులాంటి నదికి పొలాలతోనే పని
నాలాంటి కాగితానికి కలాలతోనే పని
చంద్రబింబం తుఫానుగా మారిన రాత్రి
నాకన్నులకు రంగురంగుల కలత్తోనే పని

నేను డాము లెందుకు కడుతున్నానో
భూము లెందుకు దున్నుతున్నానో
నాకే తెలీదు
నా బ్రతుకొక సున్న అందులో నడుస్తున్నా

నాగలి భుజాన వేసుకుని ఆకలి
సంపాదించుకున్నవాడే
ఆకలి తీర్చుకునే హక్కును కూడా
సంపాదించుకున్నవాడు
నేనే మీా రస్తానైకలలు కంటున్నాను
వడివడిగా నడిచే మీా ముందడుగుకోసం
పదండి ముందుకు నేనే మీా జెండానై ఎగురుతాను

నా పిల్లలచేత వాడు
నా తిండిగింజలు తినిపించకపోతే
భూమి చేత నేను వాడి రక్తం తాగిస్తా
నా కవిత్వం
ఏ జెండానూ ఎగరేయదు
కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు

ఎన్నాళ్ళో పెంచి పోగు చేసిన వాళ్ళు
ఎండల తలపాగాలతో వెళ్ళిపోతుంటే
మిలియన్ల గొంతులెత్తి ఏడుస్తున్నవి
ధాన్యపు రాసులు

ఈ ఏడాది పైర్ల దుఃఖం తీరకపోతే
వచ్చే ఏడాది వట్టి కొడవళ్ళు పట్టుకున్న
పిడికిళ్ళే మొలుస్తాయి
కలలంటుకుని కాగితాలు మండుతాయి
నగరాలు మండుతాయి
కావచ్చు అదొక మహానగరం
కానీ భూకంపానికి ఏమి భయం ?

ఇన్నేళ్ళు రాసిన కాగితాలు
హిమాలయ పర్వతాలు
వాటి మీద వాడిన సిరా

ఒక మధ్యధరా సముద్రం
దేశంలో మాత్రం
రైతు నాగలి మోస్తున్నాడు
క్రైస్తు శిలువ మోసినట్లు

ధనికుల పొలాల్లోకే ప్రవహిస్తున్నాయి దేశంలో
నదులన్నీ కలిసి
స్వప్నాల గోలలేని నిద్రపోతున్నారు ప్రజలంతా కలిసి
కవులు పాడుతున్నారు ఉపమానాల్ని పీడించి
వీధులు ఏడుస్తున్నాయి చేతులు జోడించి

నీవు కాలేజీకి పోతుంటే బాబూ
నిన్ను పొలాలు బిక్కమొహంతో చూస్తున్నాయి
నీవు కాలేజీ గోడల్లోకి పోతావు
అక్కడ్నించి గవర్నమెంటు గోడల్లోకి పోతావు
ఆ తర్వాత ఎప్పుడూ ఎవ్వరూ
తిరిగిరాని గోడల్లోకి పోతావు
ఇక నీవు బ్రతికిందెప్పుడు ?

ఈ దేశంలో వంగే వాడికి
వంగి సలాం చేసేవాడు పుడుతున్నాడు
జాగ్రత్త ఈ లక్షణం తల ఎత్తిందంటే
ఆకాశంలో తోకచుక్క పుట్టిందన్న మాటే

ఇండియాలో కుక్కలన్నీ ఏకగ్రీవంగా అరుస్తున్నాయి
మనిషిక్కడ ఒకటేటు
దేశం నరకానికి గేటు
గంగానది ఫ్యాక్టరీల శౌచాలయం
గోదావరి కులపిశాచ లావానలం
'అరే ఇవాళ నగరం ఒక చంబల్ వ్యాలీ
గ్రామం దేశానికి కూలీ

ఎన్ని పొలాలు ఫ్యాక్టరీలు
ఏకగ్రీవంగా అరిచినా
ఆకలి తీరని ఈ దేశం
ఉపమానాలు నంజుకుని
ఊపిరి నిలుపుకుంటుందా
ఉద్రేకం చంపుకుని ఇంకా
ఊరుకుంటుందా !

నీకు తెలుసా వ్యవసాయ కూలీల ఆకాశం
వర్షాలు కురుస్తుందేగానీ వసంతాలు కురవదు
రైతులారా రాజకీయ వర్షం పడుతోంది
మోసపోయి మీ విత్తనాలు చల్లకండి

ఒక్క మబ్బుక్కూడా వర్షం కురిసే ధైర్యం లేదు
ఈ భయంకర బంజరు భూమిమీద తుఫానులు
కురిసే ఆకాశాన్ని
తువ్వాళ్ళలా తుడుస్తున్నాయి మేఘాలు!
పాపం పొలాల కోరిక ఏమిటి
పంటలు పండి మీ ఆకలి తీరాలనే కదా ?

గంగానది మొదట ఒక దేవత
తర్వాత పడవల రస్తా ఆ తర్వాత
మన పొలాల్లోకి ప్రవహించే పంటకాలువ
చూచావా దేవతల రూపాలు కూడా
కాలం చేతుల్లో ఎలా మారిపోతాయో

ఇవాళ మనమంతా ఈ నదిలో
మునిగిపోతే పోవచ్చుగాక
కానీ మరచిపోకు రేపు ఈ నదే
సముద్రంలో మునిగిపోయే రోజు రాకపోదు

ఒక దేశానికి ఒక రక్త నాళం చాలదు
ఒక దేశానికి ఒక నది చాలదు
రాత్రి నా చెయ్యి నదిగా మారుతుంది
కాగితాల చెల్లాల్లోకి పారుతుంది
అక్షరాల మొలకలెత్తి నాగలిధారి మనిషితో
దేశం దేశమంతా మారుతుంది

కొండలు కొండలే ఛేదిస్తున్నారు
ఆరే నీళ్ళనెంత బాధిస్తున్నారు
డాములు కట్టి కాలువలు త్రవ్వి
ఆకలి తరఫున సృష్టితోనే వాదిస్తున్నారు

భూగోళం మీద నుల్చొని ఉన్న ఆ యువకుడు
అద్భుత ఋజురేఖ ఒక నడిచే దేవదారు
అతడి వెన్నెముక కుతుబ్ మీనారు
ఋజురేఖను వక్రరేఖ చేస్తున్న
రాజకీయ నేత
మన దేశానికి యమదూత

నదులు కవులు భూగోళపు రక్తనాళాలు
నదులు ప్రవహిస్తాయి కవితల్లా
పశువులకోసం పక్షులకోసం మనుష్యులకోసం
నదులు కనే కలలు ఫలిస్తాయి పొలాల్లో
కవులు కనే కలలు ఫలిస్తాయి మనుష్యుల్లో

ఎర్రటి సుర్యాస్తమానాలు
పాత కాలాన్ని దహిస్తున్నాయి
నా ఖడ్గం శత్రుగుండెల్లోకి అస్తమించింది
ఉదయించింది ఈ శతాబ్దం మీద
పాడ్యమి చంద్రరేఖలా కొడవలి !

అరే ఆ కోడికూత విను
అది ఉషస్సు తూర్పును
బ్రద్దలు కొడుతున్న శబ్దం
వాడు ఒక్కొక్క జీవితపు పేలికకోసం
వాడికి ఉన్న రెండు చేతులతో
యుద్ధం చేశాడు
శాంతిరేవులు చేరేకోరికతో
సముద్రాలు ఈదాడు
ఆశల ఒడ్లకోసం తెడ్లు లేని నావల్లో
ప్రయాణించాడు
అరే ఎప్పుడు తెలుసు కుంటావు
ఇది భూగోళం!
మానవుడి ఆస్తి
సూర్యుడ్నుంచి సూర్యుడికి
ఇరవై నాలుగు గంటల దూరం
మనిషినుంచి మనిషికి
రెండు గుండెలే దూరం
అడుగు సోదరా ఆకాశంలో
ఎగిరే జెండాని
గ్రామంనుంచి గ్రామానికి
ఎన్ని తుపాకుల దూరం

వాడు ఎందుకు చస్తున్నాడనుకున్నావ్
అడవుల్లో అన్ని గాయాలతో
వాడికి నూరేళ్ళు చాలదు వెయ్యేళ్ళు కావాలి
మందులతో రాదు అమరత్వం
మరణంతో వస్తుంది

నది పొలాలవైపు పరుగెత్తింది
అన్నార్తుల్ని రక్షిద్దామని
వెయ్యిరైఫిల్‌వైపు దూకింది
ప్రజాద్రోహుల్ని శిక్షిద్దామని

చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం
ఒక రాగం కోసం బిగించిన ఫిడేలులా
పడి ఉంది
అతడి నోరు పాడిన పాటలు
ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి
చావులేని వాణ్ని చంపే మూర్ఖులకు తెలీదు
ఏమృత్తిక పువ్వును మనిషికి కానుకగా ఇస్తుందో
అది వాడి నిర్మాణంలో ఉందని

ఒక అందమైన పొయెం అంటే
దానికి ఒక గుండె ఉండాలి
అది కన్నీళ్ళు కార్చాలి

క్రోధాగ్నులు పుక్కిలించాలి
పీడితుల పక్షం అవలంబించి
మనిషి రుణం తీర్చుకోవాలి
బ్రతకడానికిఒక బురుజై మనిషి
విజయానికి జెండా అయ్ ఎగరాలి

శేషెన్ నీవు పీడిత ప్రజలకే చెందుతావు
అక్షరమై అందరికీ అందుతావు
మర్రి చెట్టు నీడనంతా నీవు
ఒక్క గులాబి నీడలోనే పొందుతావు

మనిషి కన్నీరు తుడవడం నీ వంతు
శరీరం పోయినా నిలిచేది నీ గొంతు
నీ ఛాతీ బందూకుల కార్ఖానా
నీ కవిత్వం గాయాల దవాఖానా
నీ మెడలో గాయాల దండ
నీవు మా యుద్ధాలకు నైతిక ఝండా

ఎంత ఎత్తుకు ఎదుగుతాడో మనిషి
ఈ కఠోర ధరిత్రి మీద
అంత దీర్ఘంగా పడుతుంది చరిత్రలో వాడినీడ
తపిస్తున్నాము కిరణాల కోసం
యుగయుగాలనుంచి

రక్షించకు తమస్సును కాంతి క్రౌర్యంనుంచి
ఆకలి హింసకు గురైన ప్రతి గుమ్మం మీద
మోపాము మా శిరస్సు
యుద్ధం చేస్తూనే ఉన్నాము నిరంతరం
రావాలని ఉషస్సు
ప్రతి ఏడూ భూమిని చీల్చుకుని బయటకొచ్చే ధాన్య
ఆకలి మీద దండయాత్రకోసం బయల్దేరే సైన్యం
||ఎంత ఎత్తుకు||

నాఆత్మకు శరీరమనే గృహాముండేది
ఒకప్పుడు
అది దహానమై పోయింది ఇప్పుడు
నీ ప్రేమాగ్ని అంటుకుని
రుతువులేన్నో ఉండేవి మునుపు నాకు
ఇప్పుడు నీ బాహువుల్లో ఏవీ లేవు
ఒక్క వసంతంతప్ప

మన అధరాలకు అడ్డు వచ్చే
నీ ముత్యాల దండలా
ఎందుకీ స్నేహితులు మన మధ్య
ఈ రోజుల్లో వాళ్ళొక మిథ్య
కాలం అన్ని వస్తువుల్లోనుంచీ
సత్యపు సువర్ణాన్ని దోచుకుపోయిన ఈ రోజుల్లో

నా చేతిలో నీ వొక నక్షత్ర గుచ్ఛంలా
ఉండకపోతే నేనేమయి పోతానో
నేనేమయిపోతానో నీ శరీరం
నా రాత్రి బరువును మోయకపోతే
భూగోళాన్ని ఇరుసు మోస్తున్నట్లు

అకాశం నక్షత్రాల శరణాలయం
నీ దేహాం చూపుల కార్యాలయం
గ్రీకులకు వీనస్ ఏమిటో ఆనాడు
ఇండియాకు అదే నీవు ఈ నాడు

నీ చూపుడు వెలెక్కి మరింత
గులాబీగా మారని గులాబీ ఎక్కడుంది
నీ కనులోతుల్లోకి దూకి మరింత
నక్షత్రంగా మారని నక్షత్రం ఎక్కడుంది

ఏ అవ్యక్త భౌతిక ద్రవ్యాలతో
కాచిన పీయూషమో నీ ప్రేమ
అందులో తమ స్వప్నాలు కరిగించుకుని తాగి
ఎందరు మానవ మాత్రులు దేవతలై
రెక్కల మీద ఎగిరి పోయారో!

నీవు స్త్రీవి కావు అందాల తుఫానువి
చీరా తారా కలిపి నేసిన రూపానివి
నన్ను కవి అనకు నేను కలల వర్తకుణ్ని
నాబజారుల్లో నీ కళ్ళు రెండు విలువైన
భూగోళాలు....

ఇదిగో నీ కోసం చేలలో
కోసి తెచ్చిన పువ్వు
ఆ పువ్వు నీ కురుల్లో
గూడు కట్టుకుందామని
ఎగిరి వచ్చిన పక్షి

ఏం చేశావో చూడు
నీ శరీరపు క్రూర బంగారు కాంతులు
నా చూపుల్ని నీ శరీర తీరాల్లో
త్యాగం చేసి వచ్చేశాను
ఒక గులాబీతో నిశ్శబ్దం ముంచి
పోసుకుంటున్నాను
చివరకు ద్రాక్షారస దేవతనై పోయాను

నీవు తాగే కాఫీలోకి
ఒక పంచదార చినుకునై రాలుతాను
నీ గుండె వాకిలోకి

ఒక పువ్వునై దూరుతాను
నీవు కన్నెత్తి చూడకపోతే
పద్యమనే పది అంతస్తుల మేడ ఎక్కి
భూమి మీదికి దూకుతాను

బ్రహ్మాండమైన నక్షత్రాల ఊరేగింపులో
వెన్నెల జెండా పుచ్చుకుని చంద్రుడు
ముందు నడుస్తున్నాడు
అప్పుడు గ్లాసులో వైను కన్నుగీటింది
ఆపిల్ పండు కొరుక్కోమని కండ చూపింది
అంతే
మసక చీకట్లలో మాధుర్యాలు కొల్లగొట్టాను
ఏవో రాగాల తేనెటీగలు
పెదవుల మీద మెదలుతుండగా
ఒక సౌందర్యమూర్తి
అద్దంలో మునిగి స్నానం చేస్తోంది
నా ఊహా ఆ సహృదయంలోకి దిగి
కవిత్వం మీటుతోంది

ఎంత బాధ కలిగించినా
ఎంత కన్నీరు పారించినా
ఈ ప్రేమ మాత్రం ఉండనీ
ఈ చార్మినార్ శిఖరాల్ని

ఇంకా పిలవనీ
ఈ హుసేన్ సాగర్ గుసగుసలు
చెవుల్లో ఇంకా మధురించనీ
ఈ తామర మొగ్గలాంటి అరచేతి వీపుని
ఇంకా నా పెదవుల దగ్గరే ఉండనీ

ప్రేమను గురించి ఉపమానాలు పేనుతుంటే
గుండెని కోకిల తన్నుకు పోయింది
గజల్ని గురించి రాద్దామని కూర్చుంటే
రాత్రి కవిత్వంలో తడిసి పోయింది

ఓ శేషేన్ నీ పాటకు రోజా ఒక పునర్జన్మ
నీవే ఒక ప్రేమలోక దేవతవు
నీ కోసం ఒక కోవెల నిర్మించాలనుకుంటే
చెట్టు నాటి కొమ్మమీద కోకిల పెడితే చాలు

ఓ శేషేన్ నీ వాకపత్రెటూళ్ళో
మొలకెత్తిన ప్రేమదేవతవు
ఇంగ్లండులో నీ పేరు ఎడ్వర్డు
ఇటలీలో నీ పేరు రోమియో
అరేబియాలో నీ పేరు మజ్నూ
అరే ఇండియాలో దేవదాస్
నిజంగా నీకో ఊరూలేదు
నిన్నెరగని వారూలేరు.

ఓ శేషేన్ నాకు తెలుసు
నీకు కవిత అంటే ఒక ద్రాక్ష ఒక ఉత్రేఎక్ష
కలిపి తాపీగా లేని గుండెల్ని
కాపీ గొట్టడం అనీ
చక్కటిభోజనంతిని
ఫ్రెంచిలిక్కరుతోగొంతుకడుక్కుని
రాత్రి ముదురు ఘడిల్లోకి ప్రవేశించడం
నీకు ప్రేమేంద్రజాలం అనీ

పాపాలనుకుని చాల మజాలకు
మీరు దూరమవుతున్నారు
నరకంలో ఉన్నన్ని మజాలు
స్వర్గంలో కూడా లేవు
స్వర్గనరక పేజీలను బాగా
తిరగేసిన రుషి వో శేషేన్
గడ్డంతో నీ నగ్నరుషిత్వం
కొలుచుట ఎంతటి మూఢత్వం

జీవితమంటే ఏమిటిరా అని
గడ్డాన్నడగడ మెందుకురా
మధుమాసంలో మామిడి కొమ్మను
గురించిబ్రాహ్మడ్ని డక్కురా
నన్ను అడుగు ఆ కోకిల నడుగు
అన్యుల నడుగుట వ్యర్థమురా

నీ వొక గడ్డంలేని మహర్షివి
దేవుడు లేని భక్తుడివి
ఎన్ని గుళ్ళ జేఘంటలు కాదని
ఏకగ్రీవంగా అననీ

నేను దేని మీద నా సచేతన శిల్పం
చెక్కుతున్నానో ఆ శబ్దం
నన్ను మృత్యువునుంచి రక్షించుకోడానికి
నేను లేపుతున్న దుర్గం
పుస్తకం మనిషి పశుత్వానికి
అడ్డంగా నేను కడుతున్న ఆనకట్ట

ఒక కలలోకి ప్రయాణం చేసే ఆత్మకు
శబ్దం ఒక గోల పుస్తకం ఒక కాగితం

నా పేజీ మీద ఒక సముద్రం పెడతా
దాని మీద ఒక పడవ పెడతా
దాని మీద ఒక తుఫాను ఊదుతా
అది పద్యమై ఏ తీరాలకు
కొట్టుకు పోతుందో చూస్తా

చంద్రుడు నీ చేతిలో ఉంటే
మాసాలెక్కడికిపోతాయి

నా పుస్తకం నీ చేతిలో ఉంటే
నీ చేతిలో నేనున్నట్లే గదా

గ్రామీణుల ఇంద్రధనుస్సే
నగరాలకు కవితావస్తువు
పక్షి వాలే వృక్షశాఖే
కవి కంటికి విమానాశ్రయం
శబ్దాన్ని ఎవడు అలాఎత్తాడు
ఒక మధుపాత్రలా
అతడు కవి అయి ఉంటాడు
ఒక గీతికతో ఎవరు ఈ వసంతరుతువుకు
ప్రారంభోత్సవం చేశారు
అది కోకిలే అయి ఉంటుంది

ప్రొద్దున్నే స్నానమాడి ఒక తామరపువ్వ
సరస్సును రాత్రి స్మృతులతో పరిమళభరితం చేసిం
దానికి మూర్ఛపోయి చంద్రుడు
అందులో పడి కరిగిపోయాడు

వసంతరుతువు వచ్చిందో లేదో
ఆ కోకిల గొంతు ఎలా పేలి పోతోందో చూడు
చైత్ర మాసపు ఎండ చూచిందో లేదో
బీరుసీసా మూత ఎలా ఎగిరిపోతోందో చూడు

జారి పోతుంటే నురుగులు గొంతులోకి
తేలిపోతున్నాయి వృక్షాలు పుష్పదేవతలై
వసంతం అంటే కోకిలల పాఠశాల
పక్షుల సంగీత అకాడమీ
ఒక్కొక్క పక్షి వెయ్యేసిపాటలుగా
రూపాంతరం పొందే ఋతువు

ఎన్నో వెన్నెల రాత్రులు కలిసి చేసిన గాయాల్ని
ఒక్క చందమామ ముక్క మాన్పుతుందని నా నమ్మకం
అందుకే చెలరేగే ఈ గాలివానల్లో
గగనంలోనుంచి ఎక్కడ ఎగిరి పోతుందో
ఆ చందమామ అని నాభయం

చైత్ర మాసపు గాలి వీచిందో లేదో
చెట్లన్నీ పూయడానికి నిశ్చయించాయి
పూలు పెదవులు విప్పాయి
పుష్పాడీ రహస్యాలు వినిపించడానికి
ఇప్పుడు ప్రతి చెట్టూ ఒక దేవాలయం
పక్షులన్నీ ఎగిరే దేవతలు

నీ కోసం లోకాన్ని మోసుకొచ్చే వార్తాపత్రిక
రోజూ నీ గుమ్మంలో పూచే లిల్లీ
టేబిల్ మీద పడుకో ఉన్న టెలిఫోన్
అప్పుడప్పుడూ మ్యావ్ మనే పిల్లి

మాట చేసే ఇంద్రజాలాన్ని
మీమాంసకు గురిచేయకు
సాయంకాలం పొదిగే స్వప్నాల్ని
దినస్మృతులకు బలి చేయకు
స్త్రీలో ఉన్న ప్రేమను పోలీసు
ఎంక్వయిరీకి అప్పగించకు
వసంతంలో అడుగు పెడుతున్న
వంట చెరకుగా చూడకు

ప్రభాత పుష్పాలు రంగుల
స్నానం చేస్తున్న నిశ్శబ్ద దేవతలు
శరదృతువు వెండి కాంతుల
జలప్రళయం
నక్షత్రాలకు పునర్జన్మ
మేఘాలకు జ్యోత్స్నాస్నానం

నా వాక్యం ఒక పిల్లనగ్రోవి
లోపల గాలి తప్ప అర్థం ఉండదు
గొంతు మాత్రం ఎందుకు తియ్యగా ఉంటుందో
తెలీని బాటసారిని

మనుషుల బజార్లు తరిమివేస్తే
నిశ్శబ్దం కొండల్లోకి పారిపోయింది

నిశ్శబ్దాన్ని బొట్టుబొట్టుగా చప్పరిస్తున్నప్పుడు
చప్పుడు చేసే గుండెనుకూడా క్షమించలేను

నిద్రనుంచి బయటికి వస్తాను
స్వప్నంలోకి వెళ్ళిపోతాను
నేను రాత్రి కనే కలలు
దినాలమీద కట్టే ంతెనలు

అడవిని పక్షిపాటతో కొలుస్తా
లేదా సెలయేటితో కొలుస్తా
అడవిలో అగ్నిజ్వాలలు పరుగులెత్తుతున్నప్పుడు
చెట్ల శరీరాలు కౌగలించుకుని
భోరున ఏడుస్తాను

కన్నీటిలో గుండె పిండి
కవిత మీద ఆరవేశాను
జనతా శాలువా కప్పుకుని
చరచరా వెళ్ళిపోయాను
ఈ దేశం నా ప్రతిభకొక సమాధి
ఎంత దూరం నడిచినా
ఎప్పుడూ దూరం అంతే

వర్షం వెళ్ళిపోయింది
మబ్బులరథాలెక్కి
జలదానం చేసిన మేఘాలకి
జోహార్లు చెప్పాయి చరాచరాలు
భూమిలో ఉన్న చిన్నారి గింజ
మెడ బయట పెట్టి మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది
కృతజ్ఞతతో

చెట్టు బుగ్గలు పూరించి
రెండు శాఖలతో ఒక పువ్వు పుచ్చుకుని
షహానాయీ ఊదుతోంది
ఒక్క రాగం విసిరేసి బుల్బుల్
తోటతోటనంతా తన చిన్ని రెక్కలమీద
ఎగరేసుకు పోయింది

కోకిల పుస్త కాల్లోనుంచి పారిపోయి
కొమ్మ ఎక్కి కూర్చున్న గానసమ్రాట్టు
చంద్రుడు ప్రణయాగ్నుల్లో కాల్చిన పెసరట్టు
దినం మనిషిమీదికి విసిరేసిన గాలం
జీవితం గుండెతో ముంచిపోసుకున్న కాలం

ఆమె ఒక నవలను గర్భంతో ఉంది
ఆమె పుస్తకాల కంపెనీకి ఇరుసు
నా జేబులో రూపాయి నిర్ఘాంత పోయింది
ఏచేయి దొంగిలించిందో దానికి తెలుసు

శిథిలమైన పద్యంకంటే స్మితాపాటిల్ మేలు
మూర్ఖులున్న దేశంకంటే శైరెలు ప్రయాణం మేలు

రక్త నదులు పారించాడు యుద్ధాలతో
వాటి మీద వంతెనలు కట్టాడు ఇతిహాసాలతో
గగనంలో ఎగిరే కాలం రాబందు
మనిషి చివరకు దానికే విందు

ఎవడో ఇరవయ్యో శతాబ్దపు భక్తుడు
గుడిఘంట మోగించాడు
దూరాన వినిపించింది ఆ ముసలి దేవాలయం
దగ్గుతోంది
రాళ్ళు ఊడిపోయాయి దంతాల్లా
అక్కడక్కడ
మనిషి ఇంకా వెతుకుతున్నాడు అక్కడే
తనని రక్షించే శక్తి కోసం

ఓ యుద్ధంలో ఉన్న మానవుడా!
రేపటి యుద్ధంకోసం నేటి నిద్ర మానుకోకు

నీ యుద్ధం నిర్వ్యరామం
నిద్రే ఆనందారామం

వసంతాలు వస్తున్నాయి
వసంతాలు పోతున్నాయి
ఒక పువ్వోడు వసంతంకోసం చెట్లు
ఆకులన్నీ రాల్చుకుంటున్నాయి
మా ఊరి వంతెన కాలాన్ని ఎదిరించి
నా కాళ్ళ పక్షాన నిలిచింది
అది పడిపోయింది
ప్రవహించే కాలువ మా ఊరినుంచి
నన్ను విడదీసింది

నన్ను సేవిస్తే ఏమొస్తుంది
సూర్యాస్తమానాన్ని సేవిస్తే
దుఃఖమన్నా వస్తుంది
అర్ధరాత్రి నక్షత్రాలతో
ఆకాశం దిగివస్తుంది
టేబిల్ మీద-లైటు శిరోజాలు
విరబోసుకుని కూర్చో ఉన్న దేవకన్యక అయ్
విలపిస్తుంది

పక్షి ఆకాశంలో మాట్లాడేది
వ్యాకరణం లేని భాష
మేఘం స్వప్నాల సామాను
మోసుకుపోయే నౌక
సెలయేటిలాంటి పాటకు
జన్మనిచ్చే నీవు
జుల్మలో బంధింపబడిన ఖైదీ

చిన్న పసి ఆకు నీడలో
ఒక కల అల్లుకుంటూ
సేద తీర్చుకుంటున్న పక్షి
ఒక తిరుగుబోతు మబ్బును
చూపులతో వెంటాడుతోంది
అదెక్కడికి పోయి కరిగిపోతుందో
తానూ అక్కడికేపోయి
ఆ లోతుల్లో కరిగి పోదామని

కోర్కెల చంద్రమండలం మీద
ఎవరు అడుగు పెట్టారు
ఆకలి సముద్రాలకు ఎవరు
ఆనకట్ట కట్టారు
నేను నిద్రకోల్పోయిన రాత్రులే
సాగర కతలు

నాకన్నుల మీద వాలిన
సీతాకోక చిలుకలే కవితలు

గడియారపు చేతులిచ్చే ఆజ్ఞలకు లొంగి
జీవన పందెంలో పరుగులెత్తే మనుషులు
ఋషులు కారు
కాలం బంగారపు గడియారంలో పెట్టినా
మనిషిని కాటు వేయక మానదు
జీవితం ఒక మహాసముద్రం కావచ్చు
కానీ ఆశ అనే నావతో దాన్ని ఈదెయ్యొచ్చు

ప్రొద్దెక్కినా నిద్రపోతున్న
కాలువల రేవుల్ని నిద్రలేపు
ఉషస్సు కలిసిన స్వప్నమయ జలాల్ని
ముంచి తీసుకురమ్మను
ఇవిగో తూర్పుతాళాలు తీసుకొస్తున్నాను
నేను ఎర్రటి కోడిపుంజును

చంద్రుడు ఇరుసుగా జీవితం తిరుగుతున్నప్పుడు
పూలు చర్చించుకునేవి
ఈ వసంతం ఎప్పుడు వచ్చిందని
అశ్రువు ఇరుసుగా జీవితం తిరుగుతున్నప్పుడు

శిశువులు చర్చించుకుంటున్నారు
ఈ జన్మ ఎందుకు వచ్చిందని

ఇక వసంతం మాట ఎత్తకు
మళ్ళీ కోకిలనై రాలేను
నా గొంతు
విరిసీ విరియని మొగ్గల్లో చల్లాను
అవి ఫలాలుగా మారేవరకూ
నా జీవిత మొక దీర్ఘ నిరీక్ష!

ఈ భాష ఈ కాలం ఈ దేశం
నేను కోరుకున్నవి కావు
వాటి కోసం నేను పుట్టే ముందు
నా అంగీకారం ఎవరూ తీసుకోలేదు
నేను వాటి ఖైదీని

ప్రతిభ అనే నేరం చెస్తే
మీరు క్షమించరని నాకు తెలుసు
కానీ నేను పుట్టే ముందు నిర్దోషివిగా పుట్టమని
నా కెవరు చెప్పారు

ఎంత ప్రయత్నించినా ఒక్క అవులింత కూడా
ఆహ్వానించలేదు రాత్రిని
ఒకటి రెండు పెజీలు ద్రాక్షోపనిషత్తు పఠించి

శయ్యతో తర్కం పెట్టుకోకుండా
స్వాధీనం చేశాను దానికి నా అవయవాల్ని

ఏమని రాసేది నిన్ను గురించి శేషేన్
నీకు నిద్ర శయ్యలో చేసే సాహసయాత్ర
కవిత క్రూర జీవన రస్తాల్లో ప్రవేశించే పాత్ర
ఈ దేశం నీ కిచ్చిన గాయం
నీకు మాత్రం తృణప్రాయం

ఎన్నో కలల్ని పద్యాల నౌకల్లో తెచ్చి
మీ తీరాలకు చేర్చాను
నా వాక్యాలు తీగెలుగా బిగించి
నన్ను వాద్యాన్ని చేసుకున్నాను
నన్నొక రేవు చేరనీండి
నా స్వర్గాలన్నీ ఇక్కడే కుమ్మరిస్తా

నా దురదృష్టాల్లో ఉన్న సత్యాలకోసం
నా లోతుల్లో దిగి స్నానం చేసే ప్రమాదం
ఎవడు స్వీకరిస్తాడు ? స్వీకరిస్తే
వాడు సమకాలికుడెలా అవుతాడు!

భయపడకు ఓ శేషేన్
ఇవ్వాళ్టి ఉదయం

రేపటి ఉదయాన్ని మరచిపోతుంది
గుండె ఆడుతుండనీ
ఏ కొమ్మలో చిల్చుకుని
పూలు రాక మానవు

నా ఆత్మను గురించి
నా కేమీ భయం లేదు
నేను చస్తే దానికే నష్టమూ
లేదు గనక
నా భయం నా శరీరానికి
ఏమవుతుందో అనే
పాపం జీవితాంతం
పంచుకుంది నా సుఖదుఃఖాల్ని

జీవించడంలోనే జీవితమంతా
ఖర్చు చేసి అలసి పోయాడు
అతడు వర్తమానంలోనుంచి
చరిత్రలోకి వలస పోయాడు

జీవన తపశ్శిఖరారోహణంలో
ఎప్పుడూ మనిషి ఏకాకి అని ఎవరికి తెలుసు
వాడి అవ్యక్త వాక్యే వాడి శిలువ
అని ఎవరికి తెలుసు

ధ్యానం చేసుకుందామని ఉంది
ఎక్కడికోనిశ్శబ్దకుహరంలోకిపోయి
ఎవ్వరూ లేని దేవాలయంలోకి పోయి
చివరికి నా ఏకాంతానికి భంగం కలిగించే
దేవుడు కూడా లేని దేవాలయంలోకి పోయి

నేను ఘనీభవిస్తే ఒక నామరూపాత్మక దేహం
నేను ద్రవీభవిస్తే ఒక జ్ఞాపకాల ప్రవాహం
మంచి నిద్ర కొంచెం సేపే
స్వప్న తుఫానులు వీచే
రాత్రి గడవడం రేపే
మనిషి నడక గమ్యం వైపే
కష్ట సుఖాలను మోసే
జీవ యాత్ర మరణం వైపే

సాయంకాలంపూట కొంచెం పాట
కొంచెం మధువు కొంచెం నిరీక్ష కావాలి
అప్పుడు తెలుస్తుంది
జలపాతం నీటి అధః పతనం కాదనీ
కన్నీరు దుఃఖానికి సంకేతం కాదనీ

జీవన తరంగాలు వస్తూ పోతూ
నా ఒంటరి తనాన్ని లోతు చేస్తున్నాయి

రోజూ ఆకాశం సూర్యుడనే
ఎర్రటి గుడ్డు పెడుతూనే ఉంది
కోడిపుంజు సూర్యుని దైనిక కార్యక్రమం
రోజూ ప్రకటిస్తూనే ఉంది

నా హృదయాన్ని ఆకాశంలో
జెండాగా ఎగరేశాను
గాలుల్లో ఎగురుతున్న
ఆ రంగుల పేలిక
ఈ యుగానికి నాలిక
ఒకనాడు నా శరీరం
అంతర్ధానమవుతుంది
అప్పుడు మీకు నా వాక్యాల్లోనే
దర్శనమిస్తాను

ఇక వసంతం మాట ఎత్తకు
మళ్ళీ నేను కోకిలనై రాలేను
బుల్లెట్ని జ్ఞాపకం చేయకు
బుద్బుద ప్రాయమైన మాటల్ని
ఇక పేల్చలేను

స్వర్గాన్ని నినాదం చేయకు
ఈ ధూర్త మానవ పదార్థంతో